గురుబ్రహ్మశర్మ, మద్దులపల్లి

# కొండవీటి సామ్రాజ్యము

గుంటూరు, 1920

Record no. 573

## Bibliographic Record Target

గురుబ్రహ్మశర్మ, మద్దులపల్లి.

కొండవీటి సామ్రాజ్యము / ఇయ్యది మద్దులపల్లి గురుబ్రహ్మశర్మచే రచియింపఁబడినది.- 1. ముద్రణము.- గుంటూరు : వాణీ ముద్రాక్షరశాల, 1920.

(1), 10, 136, 86 p., (2) leaves of plates. :port. ;20 cm.

Record no. 573

Gurubrahmaśarma, Maddulapalli.

Koṇḍavīṭi sāmrājyamu / iyyadi Maddulapalli Gurubrahmaśarmacē raciyimpam̐baḍinadi.- 1. mudraṇamu.- Guṇṭūru : Vāṇī Mudrākṣaraśāla, 1920.

(1), 10, 136, 86 p., (2) leaves of plates. :port. ;20 cm.

Record no. 573



# కొండవీటి సామ్రాజ్యము.

ఇత్యాది

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ చే

రచియింపఁబడినది.



ప్రథమముద్రణము ప్రతులు 500.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు

కే. బీ. కృష్ణారావుచే

ముద్రింపఁబడెను.

1920.

[పోస్టేజిగాక వెల రు. 1-8-0.



గ్రంథకర్త

ముద్దులపల్లి గురుబ్రహ్మశర్మ.

జననము 10-4-1876. (ధాత సంవత్సర చైత్ర బ ౨.)



# కృతినివేదనము.

---

సీ. శ్రీకరపాద రాజీవ సంస్పర్శచే
ఱాతి నేమహితుండు నాతిఁ జేసె
సుగ్రీవముఖర కీశోగ్రబలంబుచే
నేవీరుఁ డసురాళి నెల్లఁ గూల్చె
శరణాగతత్రాణ సరణి నే కరుణాక
రుఁడు విభీషణు భూవరునిగ నిల్పెఁ
గరిమఁ బట్టాభిషేక మహోత్సవాప్తిచేఁ
బ్రజ నే ప్రభుఁడు సౌఖ్యపదవిఁ దేల్చె

తే. గీ. అవనిజా లక్ష్మణాంజనేయాన్వితముగ
నర్సరాట్పురి వెలయు శ్రీనాథుఁ డెవ్వఁ
డట్టి పట్టాభిరాముని కర్పణముగ
వ్రాతు నీ "కొండవీటిసామ్రాజ్య" మెలమి.

---

# అవతారిక.

వర్తమానశతాబ్దమున నాంధ్రభాషయందుఁ గొన్ని చరిత్రగ్రంథములు ప్రకటింపఁబడియున్నవి. అందుఁ గొన్ని హిందూదేశచరిత్రమును వెల్లడించుచున్నవి; మఱికొన్ని ఆంధ్రదేశచరిత్రమును వెల్లడించుచున్నవి. మఱియు దేశచరిత్రములయందు స్థాలీపులాకన్యాయముగ సూచింపఁబడి, ప్రత్యేకించి స్వతంత్రచరిత్రగ్రంథరచనమున కాస్పదములగు కథానకములుగలిగి, మిగులఁ బ్రశస్తిగాంచిన పురాతనస్థలము లాంధ్రదేశమున నందందుఁ గొన్ని కానవచ్చుచున్నవి. అట్టివాటిలోఁ గొండవీడు నొక్కటిగ నున్నది. ఇయ్యది సుప్రసిద్ధమును, అనేక రాజవంశ పరిపాలితమును నగు దుర్గస్థలము. గతశతాబ్దములయం దాంధ్రదేశమునందు సగము నతిక్రమించినభాగమున కీ కొండవీడు రాజధానీనగరముగ నుండెను. అప్పుడీకొండవీటిసామ్రాజ్యమున ననేకజనపదములు మిగులభాగ్యవంతములై విరాజిల్లుచుండెడివి. కొండవీటిదుర్గమును, అచటి జీర్ణసౌధరాజంబులును, దేవాలయములు మున్నగునవియు, ప్రకృతిసౌందర్యవిలసితమై కోమలపుష్పలతావేల్లితభూతపుంజ విరాజమానయగు నచటిమహానగమును, వర్ణనీయములును, దర్శనీయతమములును నైయున్నవి. ఈసామ్రాజ్యమునకు సంబంధించిన చిత్రములగు చరిత్రవిషయములును, అమానుషములగు గాథలును, పరంపరగ తరతరములనుండి జనులు చెప్పుకొనుచుండు పుక్కిటిపురాణములును పెక్కులు గలవు.

చిన్నఁటనుండియు దేశచరిత్రపఠనమునందు నాకు మక్కువ మిక్కుటము. ఆకారణమున నాంధ్రభాషయందుఁ బ్రకటితములైన చరిత్రగ్రంథముల మిగులనుత్సాహమునఁ జదువుచు నేవేనినూతనవిషయములఁ దెలిసికొనఁ బ్రయత్నించుచుండువాఁడను. అటులఁగొంతకాలముగడచిన పిదప నాకు నెదియేని యొక చరిత్ర రచింతమన్న కోర్కె జనించెను. నా యభిలాషమున కుపబలముగ నామిత్రుల నేకులు నన్నందులకుఁ

ప్రోత్సహింపఁగడంగిరి. నేనును నా యశక్తతను బాటింపకఁ గార్యో న్ముఖుఁడనై కొండవీటిసామ్రాజ్యచరిత్రమును పద్యమయముగ వ్రాయఁ బ్రారంభించి దానిని "కొండవీటిచరిత్ర" మనుపేరట 1907 సంవత్సర మునఁ బ్రకటించితి. కాని, యనంతరము నాయభిప్రాయములు మాఱు టవలనను చరిత్రగ్రంథములు పద్యకావ్యములుగ నుంట సమంజసము గాదని తజ్ఞులు కొందఱుసూచించుటచేతను, నూతనశోధనలవలనఁ బద్య కావ్యములోని విషయములుగొన్ని వ్యత్యయములుగఁ గానవచ్చినందునను మఱల "కొండవీటిసామ్రాజ్య" మనుపేర నీగ్రంథమును వ్రాసినాఁడను.

నా కీగ్రంథరచనమునందుఁ దోడ్పడిన ప్రధానగ్రంథము కొండ వీటిదండకవిలె. దీనిని కర్తృనామరహితమనియుఁ, దత్కారణమున విశ్వసింపఁదగనిదనియుఁ గొందఱుచరిత్రకారులుసూచించిరి. నే నివ్విష యమునఁ గొంత శోధన మొనర్చితిని. నాకు దొఱకినంతవఱకుఁ గల యాధారములను బట్టి చూడ నీ దండకవిలె ప్రథమకర్త "జయిని నాగాభట్ట"ని యేర్పడినది. అయిన నిది యాతఁ డొక్కనిచే మాత్రము గాక క్రమక్రమముగఁ బాలకుల వంశక్రమమున వారి యాజ్ఞానుసారము గ సమకాలికులగు నితరులచేఁ గూడ వ్రాయఁబడిన యా కాలపు వ్యావహా రిక గ్రంథముగఁ గనుపట్టుచున్నది. కావున నే దీనికిఁ గర్త యొకఁడుగ నుండ లేఁడు. కొంచె మెంచుమించుగ నిది రాయవాచకమును బోలి యున్నది. కర్తృనామ మెయ్యది యో తెలియఁబడని కారణమున, విశ్వ సింపఁదగనంత యపరాధము నీదండకవిలె యొనర్చెనదనుట సమంజస ముగాదు. దీన నొకటిరెండువిషయములు విశ్వసింపఁదగనిరీతిని గాన వచ్చుచున్నవి. అవి యీగ్రంథమునఁ జొచ్చుటకేది యేనిబలవత్తర కారణ ముండవచ్చును; లేక యిటీవలి లేఖకులు తమయూహలనుబట్టి కొలఁదిని గొప్పగఁ బెంచి యట్లువ్రాసియుండవచ్చును. కాని, వాటి నూతగఁ గొని మూలగ్రంథము నున్మూలింపఁజూచుట ధర్మముగాదు.

ఎటులైనను దండకవిలె మూలగ్రంథము రాజులపరిపాలనకాల మున వారియధికారముక్రింద వ్రాయింపఁబడిన యొకసంస్థానచరిత్రమని యొప్పుకొనకఁ దప్పదు. రాజశాసనములు, ఆజ్ఞలు, మున్నగునవియు,



గ్రామసంఖ్యాదికములును, రాజుల పరిపాలనాకాలమును నందు గాన వచ్చుటయే దీనికి నిదర్శనము. బహుళప్రయాసమున నీదండకవిలె ప్రతులను రెంటిని సంపాదించితిని. ఒకటి గుంటూరువాస్తవ్యులు బ్ర. శ్రీ. కొమ్మవరపు నరసింహముగారు దయతోఁ బంపినది. రెండవది చెరు కుపల్లి సబురిజస్ట్రారు బ్ర. శ్రీ. భువనగిరి కోదండపాణిశాస్త్రిగారు దయ చేసి పేష్కరు కరణం బొడపాటి గోపాలరావుగారి ప్రతిననుసరించి వ్రా యించిపంపినది. ఈ రెండుప్రతులు నచ్చటచ్చట నించుక భేదించినను ముఖ్యవిషయములయం దొకటికొకటి యభిన్నములైయున్నవి. రెండు గ్రంథములయందును విషయములువిడిచిపోయినచోట్ల "మాతృక భిన్న" మని వ్రాయఁబడియున్నది.

చిరకాలమునుండియుఁ గొండవీడు మహానగరమై, రాజనివాస మై, ప్రఖ్యాతినొందియున్నదనుట నిర్వివాదాంశము. దీనికిఁ బ్రాముఖ్య త యేకాలమున నెవనివలనఁ బ్రారంభమయ్యెనో తెలియ నవకాశము లభింపలేదు. గజపతివంశసంభవుఁడగు విశ్వంభరదేవు తొలుదొలుతఁ గొండవీటిదుర్గనిర్మాణ మొనర్చినట్లుదండకవిలెవలనఁ దెలియుచున్నది. ఇది గాక నివ్విషయమునుగూర్చిన దృష్టాంతేతరములు నేఁటిదనుక నలవడి యుండలేదు. శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్ర మూఁడవభాగమున, అనవేమునివిషయమును జర్చించు నవసర మున "గోదావరీమండలములోని యొక శాసనములో అనవేముఁడే కొండవీడును నిర్మించి రాజధానిగా జేసికొన్నట్లు దెలుపఁబడినది." అని వ్రాసి యాశాసనము నుల్లేఖించియున్నారు. చూడుఁడు.

శ్లో॥ * * * *

కొండవీడుం రాజధానిం సతిచిత్రామకల్పయత్
దృష్ట్వాత్వష్టాపిచిత్రత్వ మభోద్యస్యాసవిస్మయః॥"

కొండవీటిదుర్గమును అనవేముఁడు దృఢపఱచి, దానికిఁ గ్రొత్త యందములఁ గూర్చియుండవచ్చును; గాని కొండవీటిదుర్గనిర్మాతమాత్ర మీతఁడు కాఁడని చెప్పవచ్చును.

ఇఁక గోపరాజు రామప్రధాని చరిత్రమును విచారింతము. ఇతఁడు గణపతిదేవునియొద్ద మంత్రిగనుండెనఁట. ఈగణపతి యెవఁడైయుండవచ్చును? కాకతీయగణపతియా? కాదు. కాకతీయగణపతికడ గోపరాజు రామన యున్నట్లు లేశదర్శనములును లేవనియు, గణపతి కాలమునాటి యేశాసనమునఁగాని యీతనినామమైనను యుదహరింపఁబడలేదనియు, యీవివరము భావిపరిశోధనలవలనఁగాని తేలదనియు వీరభద్రరావుగారు తమ యాంధ్రచరిత్ర మధ్యమయుగమున వక్కాణించియున్నారు. కాని యితనికిని కరిణీకోద్ధరణమునకును గల సంబంధమును గూర్చిన ప్రతీతి యవిలంఘ్యముగ నున్నది. దండకవిలెయందీచరిత్రయంతయు గజపతివంశజుఁడగు గణపతిదేవునికి సంబంధించినట్లు విపులముగఁ దెలుపఁబడినది. అదియంతయు నీగ్రంథము 33-34 పుటలయందుఁ జూడనగును. ఈ గణపతి కళింగదేశ రాజవంశజులలోనివాఁడు. కళింగదేశచరిత్రము మనకు లభ్యముకాలేదు. అందువలన నితనికాలమును, చరిత్రవివరములును మనకుఁదెలియవు. ఎట్లైనను, గోపరాజు రామన కాకతీయగణపతికాలమువాఁడు కాఁడనియు, గజపతివంశపువారిలో నేగణపతికాలముననో యున్నాఁడనియు, కాకతీయులకుఁబూర్వము ఆంధ్రదేశము గజపతులపాలనమునందున్నపు డేసందర్భముననో యీతఁ డవకాశముఁజూచుకొని రాజానుమతినిఁ గరిణీకములు బ్రాహ్మణులకిచ్చెననియు నిశ్చయింపవచ్చును. ఇవ్విషయమునుగూర్చి తెలిసికొనననేకవార్తాపత్రికలకు వ్రాసియు, పలువిధముల పరిశోధన లొనర్చియు విఫలమనోరథుఁడనైతిని.

నందవరీకులనుగురించి లోకమున వెలసియున్న గాథవంటి గాథయొకటి యీగ్రంథమునఁ బ్రథమప్రతాపరుద్రునిసందర్భమునఁ జెప్పఁబడినది. ఈరెండుకథలును దద్దయు నభేదములుగ నున్నవి. వీటి పూర్వోత్తరములుగాని సత్యాసత్యములుగాని తెలిసికొనఁ బలవత్తరసాధనములు లేవు. కాకతీయులు కొండవీడు రాజధానిగ రాజ్యపాలనమొనర్పకున్నను సందర్భమునుబట్టి వారిచరిత్రములును నిందు సంగ్రహముగఁ జేర్చినాఁడను.



రెడ్డిరాజులప్రభుత్వకాలనిర్ణయమునుగుఱించి యనేకు లనేకవిధముల సిద్ధాంతములు పూర్వపక్షములును నొనర్చుచున్నారు. కొందఱియ్యది భావిపరిశోధనలవలనఁగాని సిద్ధాంతముగాదని వచించుచున్నారు. నాకుఁగలయాధారములనుబట్టి నేనొకమార్గము నవలంబించియున్నాను. రెడ్డివంశజులప్రకరణమున ఆంధ్రులచరిత్ర మూఁడవభాగమున వీరభద్రరావుగారు "సర్వజ్ఞ చక్రవర్తిబిరుదాంకితుఁడగు పెదకోమటి వేమభూపాలునకు సర్వజ్ఞబిరుదాంకితుఁడగు రావుసింగమహీపాలుఁడు సమకాలికుఁడుగాఁడే" అని ఖండితముగ వ్రాసియున్నారు. అందుకు వారికిఁగల యాధారములఁ జూపియుండలేదు. మఱియు సింగమహీపతికాలమును ముందునిర్ధారణపఱచి వారట్లువక్కాణించిన మేలగు. అట్టిప్రబలనిదర్శనము గనఁబఱచుదనుకను వారియూహ సరికాదని నాయభిప్రాయము.

ఈ గ్రంథమున (1) సిద్ధుఁడు - గొల్లవాఁడు, (2) గృహరాజుమేడ, (3) కపిలేశ్వరగజపతి దేవేంద్రునకు వ్రాసిన జాబు, మున్నగు సమానుషకృత్యములును—(1) స్పర్శవేది, (2) ఉపశ్రుతి. (3) పాతెగాంద్ర కత్తులబావి మొదలగు చిత్రములగుగాథలును—కృష్ణరాయల గాండ్లసంగకథయును - జేర్చితిని. వీటి సత్యాసత్యములును, ఘన, నీచములును యెట్లున్నను, నాకాధారముగనున్న మూలగ్రంథముననున్నందునను, చరిత్రనాయకులకును, స్థలములకును సంబంధించి ముడివైవఁబడియున్నవిగావునను, "కొండవీటిసామ్రాజ్య" చరిత్రకర్తనగు నాకు యీగాథలను వెల్లడించుట విధియైయున్నది.

దండకవిలెకనుబంధముగ "కరిణీకములపట్టిక" యొకటి యున్నది. ఆపట్టికయందలి గ్రామములన్నిటికినిఁ బూర్వము గోపరాజురామన కరిణీకముల మిరాసీల నిర్ణయించెనఁట. పట్టికయందలి వివరణమునకును ప్రస్తుతాచరణమునందలి నామాదికములకును యించుక భేదము గానరావచ్చును. అయిన నిట్టివిషయములఁ దెలుపు గ్రంథ మిదివఱకుఁ బ్రకటింపఁబడియుండనందునను, పూర్వపు గ్రామకరిణీకముల స్థితులును, యేయేవంశములవా రాపదవులనందియుండినదియు, మొదట నియమితులైనవారు క్రమముగ నొనరించుకొనుచువచ్చిన మార్పులును మొదలగు

సంగతులు పట్టికయందుంటచే దాని నీగ్రంథమున కనుబంధముగ "అ" కారాది సూచిని జివరఁ జేర్చినాఁడను. ఇది యెట్టి రాజకీయ వ్యవహారిక కృత్యమునకుపయుక్తముగాదు. ఈపట్టికయందలివిషయముల నిర్ణయించుటకు కొండవీటిదండకవిలెగాక కీర్తిశేషులగు గుంటుపల్లి గోపాలకృష్ణకవిగారు సేకరించియుంచిన వినుకొండదండకవిలె ప్రతి యొకటి బ్ర.శ్రీ గుంటుపల్లి పేరయ్యగారివలన నాకులభించి మిగుల సాహాయ్యపడినది. ఈపట్టిక భాగములఁ బూరింప మిగుల శ్రమపడినాఁడను; గాని తగినయాధారములు లభింపమి యింకను గొన్ని భాగములు విడువవలసివచ్చినది.

నాకీగ్రంథరచనమునకు దండకవిలెయొకటిగాక ఆంధ్రులచరిత్ర ఆంధ్రకవులచరిత్ర మున్నగు కొన్నిగ్రంథములు సాహాయ్యపడినవి. ఇక్కార్యమునకై మదరాసునకేగి యందు దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము (Oriental Manuscript Library) నందలి గ్రంథసామగ్రిని విమర్శించితిని. ఇంక నందందుగల శిలాశాసనాదికములను నాయోపినకొలంది శోధించితిని. తుదకీరూపమునఁ బుస్తకమును ప్రకటించుభాగ్యమునుగంటిని. గ్రంథరచనమునందు గాకున్నను, దేశచరిత్రరచనమునందు నేనుక్రొత్తవాఁడను. అందువలన నిందుఁ బ్రమాదములు పెక్కులుండుట సహజము. కావున నవి క్షమించి నాకుఁ దెలిపినచోఁ గృతజ్ఞుఁడనై ద్వితీయముద్రణమునందుఁ బొందుపఱచెదను.

దండకవిలెకుఁ బ్రత్యంతరములు మున్నగునవి సేకరించుటయందు నాకుఁ దోడ్పడిన శ్రీయుత సోమరాజు హనుమంతరాయుడుగారికిని, అనుమంచి హనుమంతరావుగారికిని గ్రంథవిమర్శనాదికములయందు మిగుల శ్రమవహించి కార్యనిర్వాహకమొనర్చిన శ్రీ కొణిదెన బాలకృష్ణయ్యగారికిని, గ్రంథముద్రణమునకుఁ దగు ధనసాహాయ్య ప్రోత్సాహముల గలిగించిన మిత్రమండలికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచు నీ గ్రంథము నాంధ్రమహాజనుల కర్పించుచున్నాను.

ఇట్లు,

నర్సారావుపేట,
**29-9-1920.**

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ,
గ్రంథకర్త.

---

# విషయసూచిక

## మొదటి ప్రకరణము.



## రెండవ ప్రకరణము.



## మూఁడవ ప్రకరణము.



## నాల్గవ ప్రకరణము.

## అయిదవ ప్రకరణము.



## ఆరవ ప్రకరణము.



## ఏడవ ప్రకరణము.







## ఎనిమిదవ ప్రకరణము.



## తొమ్మిదవ ప్రకరణము.



## పదియవ ప్రకరణము.

## అనుబంధము.



## కరిణీకముల పట్టిక.

---

శ్రీరస్తు.

# కొండవీటిసీమ.

## మొదటిప్రకరణము.

### దండకవిలె నిర్మాణము.

"దండకవిలె" అనునది పూర్వాపరపాల పరిపాలనాదికములను గురించి తదాశ్రితబృందముచే వ్రాయఁబడిన చరిత్రము. ఇట్టి చరిత్రలు మనపూర్వులు వ్రాసియుంచినవి పెక్కులుగలవు. కాని సరియైన విమర్శకులులేక యవి యుత్సన్నములగుచువచ్చినవి. చరిత్రలు వ్రాయుటకు శాసనములును, పూర్వగ్రంథములును, దండకవిలెలును మార్గదర్శకములు. 1810 సంవత్సర ప్రాంతమున దొరతనమువారివలన "సర్వేయర్ జనరల్" ఉద్యోగమున నియమింపఁబడిన శ్రీమెకంజీదొరగారివలనఁ గొందఱి యుద్యోగస్థులచేత దేశచరిత్రలను గూర్చిన గ్రంథసామగ్రి వ్రాయింపఁబడినది. అప్పుడు వారు ప్రతిగ్రామమును జూచి యందుగల శాసనాదులను సంపాదించి యాగ్రామాధికారులవలన వాఙ్మూలములను (కైఫీయ్యతు) తీసి యందుపైఁ గొంతచర్చజరిపియుండిరి. ఇట్టి వ్రాతలన్నియు వ్రాసియిచ్చినవారి సంతకములతోఁగూడిన అసలు ప్రతులును, పిదప కొంతకాలమునకు వానికి ప్రతులు వ్రాయించి శ్రీ. సి. పి. బ్రౌన్ దొరవారి విమర్శలతోఁగూడిన శుద్ధప్రతులును, Local records vol. అను పేర మదరాసునందు దొరతనమువారి పుస్తకభాండాగారమున (Government Oriental Manuscripts Library) నుంచబడినవి.

అట్టి సందర్భమున మనదేశమునకు "పులిగడ్డ మల్లయ్య" అనువారు వచ్చి కైఫీయతులను వ్రాయించిరి. కొండవీటిదేశమునకు సంబంధమగు గ్రంథములు (1) దండకవిలె, (2) కొండవీటి కైఫియ్యతు. వీనియందుమాత్ర మెవరువ్రాసియిచ్చినది పేర్లుగాని, సంతకములుగాని.

లేవు. ఇందువలన "కర్తృనామరహితము"లని కొందఱనిరి; కాని యిది ప్రమాదము. కైఫియతులవలె దండకవిలె మెకంజీదొరవారి కాలమున మాత్రమె పుట్టినదిగాక పురాతనమైనట్టు దాసియుండే కనుపట్టుచున్నది. "ఇది జయని నాగాభట్టు వ్రాసినప్రకారము శా॥ ౧౭౪౦ నల సం॥లో వ్రాసి ప్రతిక్రమం వ్రాసిరి" అనియును, "పిదప సంపుటం కోనప్ప" వ్రాయించినట్లును యిందు వ్రాసియున్నది. కాని యీకోనప్ప యెవరైనదియు, యేకాలపువాఁడైనదియు తెలుపఁబడలేదు. కొండవీటి కరణముల యింటిపేరు పూర్వము సంపుటమువారనియుఁ, బిదప కొంతకాలమునకు కొండవారనియు మారినదని తెలియుచున్నది. వీరిలో 100 యేండ్లక్రిందట కొండ కోనప్పయను ప్రముఖుఁడుండి యీ దండకవిలెను సంపాదించెనని చెప్పుచున్నారు. ఇదియే చరిత్ర కాధారము. కాని యిప్పటివారు వారి మార్గానుసారకులగు నంశములనుమాత్రము సత్యములుగ గైకొనుచుండినను ప్రశంసయందు దీని నవిశ్వసనీయమని వ్రాయుచున్నారు. ఇది యెంతయుఁ జింత్యము.

### కొండవీటికొండ ప్రస్తుతస్థితి.

కొండవీడు గుంటూరుజిల్లాలోఁ జేరిన నర్సారావుపేటతాలూకాయందలి యొకదుర్గారణ్యస్థలము. (గొప్పపర్వతము.) దీని చుట్టుకొలత 30 మైళ్ళు. ఈపర్వతమునఁ బ్రతిసంవత్సరమును పండెడు ఫలసాయములు, చింతలు, సీతాఫలములు, కుంకుళ్లు, మామిడి మొదలగునవి. వీనిని దొరతనమువారు గుత్తకిత్తురు. సంవత్సరమునకు దాదాపు వేయిరూప్యములుఆదాయమువచ్చును. చిరుతపులులు మొదలగుమృగభయము, చోరభయమును గలదు. కొండయెత్తురమారమి రెండున్నర మైళ్ళు.

### పురాతనకట్టడములు, ఆలయములు.

ఈ పర్వతమున రమారమి యేబదిబోళ్ళు (శిఖరములు) గలవు. అందు ముఖ్యములు నాలుగు. అవి (1) బొల్లుమూరి వేంకటేశ్వరుని బోడు. ఇందు శ్రీ వేంకటేశ్వరుని గుడికలదు. దీని నిర్మాణము తెలియదు. ఇచ్చట వివాహములు సేయుచుందురు. దీనికి దక్షిణమునఁ గన్యకల



బావి కలదు. దీనియొద్దనుఁ గన్యకల ప్రతిమలు గలవు. దేవకన్యకలు దీన స్నానమాడుదురని చెప్పుదురు.

(2) ఆదంషఫీకొండ. దీనికి రుద్రపాద శిఖరమనిపేరు. దీనిపైన పూర్వపు శిథిల శివాలయము గలదు. దీనికి దక్షిణమున రుద్రపాదమను నొక పాదము (పాదాకారమగు గుంట) గలదు. అందుదక మెపుడుండును. కృష్ణానది వరదలు వచ్చినప్పుడు దీనియందును నీరు మిక్కుటముగ నుండుననియు, నీరు కృష్ణోదకము ననుకరించి యుండుననియుఁ జెప్పుదురు. దీనిపై మహమ్మదీయుల దరగా (మంటపము) నిర్మించి దేవతాప్రార్థనలును (నవాజులు) కందోర్లు మొదలగునవి చేయుచుందురు.

(3) బొల్లుమూరికొండ కాగ్నేయభాగమున మిగుల నెత్తగు గురునాధుని బోడు గలదు. దీనిపైకి మనుజులు పోవుటకు వీలులేక భయంకరమైన చరియలుగలిగి యెత్తుగనుండును. కొండ యన్నిభాగములలో మిగుల నున్నతమైనది ఆదంషఫీకొండ. ఇది రెండున్నరమైళ్లు యెత్తుగలిగియున్నది.

ఈ పర్వతశిఖరములకుఁ బశ్చిమభాగమునఁ బర్వతముపై మూడుమైళ్ళ చదరముగలదు. అందు మూడు చెఱువులు గలవు. 1. వెదుళ్ల చెఱువు. 2. ముత్యాలమ్మచెఱువు. 3. పుట్టలమ్మచెఱువు. మామిడితోటలును, శిథిలములగు రాజమందిరములును పెక్కులుగలవు. ఇందొకదానిని ప్రస్తుతము దొరతనమువారు బాగుచేయించి (ఫారెస్టువారికి) యుపయోగించుచున్నారు.

"నేతికొట్టు" అనునది కలదు. దీనిలోఁ బూర్వపురాజులు నెయ్యి పోయుచుండిరని చెప్పుదురు. కాని మందుసామగ్రిపెట్టుడి శాలపగిదిఁ గనుపట్టును.

పై చదరపు స్థలమునకుఁ జుట్టుగల పర్వత శిఖరములపైనుండి కొండయంతట వ్యాపించునట్లు కోటలు కట్టబడినవి.

కొండపైకిఁబోవు సోపానమార్గముప్రక్కను శిథిలమగు నృసింహాలయము గలదు. ఇందలి విగ్రహము శిథిలమై కొండక్రిందఁ బడియున్నది. ఇందుఁ బెక్కుశాసనములు గనుపట్టుచున్నవి.

పర్వతమార్గమునకు దక్షిణము గండికాలువయొద్ద *ంగాధర రామేశ్వరాలయము గలదు. ఈగుడియొద్ద స్థంభముమీద శ్రీరంగరాయలవారి శాసనమొకటి గలదు. (అతని చరిత్రభాగమునఁ జూడనగు).

కొండపై నిప్పటి రాజమందిరము (ఫారెస్టుబంగళా) నుండి చెరువులకుఁబోవు మార్గమునకుఁ దూర్పున నొక విష్ణ్వాలయము, నొక శివాలయమును శిధిలములై యున్నవి.

కొండలమధ్యభాగమున నొక గుహయందు "కొండ సింగరయ్య" అను పేర నృసింహస్వామి గలఁడు.

కొండపైన రెండు (మశీదులు) మహమ్మదీయు ప్రార్థనామందిరములు గలవు. ఇవి యిప్పటికిని మంచిదశయందున్నవి.

పుట్టకోటకు వెలుపల నవులూరి * పోతరాజు, నాగవరమ్మ కుళ్ళుండినట్లీదిగువ శాసనమువలనఁ దెలియుచున్నది.

నాగవరమ్మ గుడియొద్దనున్న శాసనము.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా॥శ॥ ౧౪౪౫ అగు నేటి స్వభాను సం॥ర ఫాల్గుణ బ ౨ ఆదివారము నవులూరి పోతరాజుకు కొండవీటి నాగవరమ్మగారికి ముఖమంటపాన వజ్రసింహాసనారూఢులై సభ గూర్చున్న యాశైయారు దేశములవారు ముకటసంకధాగమున్నూ, నిటశెట్టి అయ్యగారి కొమారుడు బసవయ్యగారున్నూ కొండవీటి యేడువాడలవారున్ను సాష్టాంగదండము పెట్టి యిచ్చిన ధర్మశాసనము పత్రిక రవిటక అమ్మగారికి చీరలునోము వీభూతికట్నము చంద్రపట్నం తోరణాభరణం ద్వియాపుటు విడాలతివితలము యివి మీదట అమ్మవారి శోభనాలబియ్యం మానెడు, వ్రాతధర్మము తప్పక యిచ్చువారు కొండవీటినుండే యేర్పాటులకు అమ్మగారికి యేలాగునయిత్తురో అలాగున యిచ్చువారము. నవులూరి పోతరాజుకు యీశాసనములో వ్రాసినవుట్టుకు యిచ్చువారము."

కొండ దిగువభాగమున నిప్పుడు కోటయని పిలువబడు గ్రామ దక్షిణభాగమున గోపినాధస్వామి గుడికలదు. ఇది మిక్కిలి రమణీయమైన పనితనముగలిగిన స్థంభములచేతను, చిత్తరువులచేతను నిర్మింపఁబడినది. దీనిప్రక్కను పూర్వము వేయికాళ్ళ మంటపముగలదు. ఇది శిథిలమైనది. దేవాలయము ప్రస్తుతము మహమ్మదీయుల ప్రార్థనామందిరముగ నుపయోగింపఁబడుచున్నది. దీనిముందు నిరువదిగజముల యెత్తగు శిలాధ్వజము గలదు దీనిపై నొక శాసనమును, గుడి యుత్తర ద్వారశాఖయందిరుప్రక్కలను శా॥ శ॥ ౧౪౮౭ రక్తాక్షి సం॥ ర ఆషాఢ శు ౧౧ సదాశివరాయలనాటి శాసనములును గలవు. ఈ గుడి నాలుగు అంతరాళములు గలదై విశాలముగ నుండెను. దీని వెలుపలి గోడలకు విచిత్రములగు తీగెలు, చిత్తరువులుదీర్చిన రాళ్ళతో నమర్చిన జవకట్లునుగలవు. గోపినాధస్వామిగుడికి దక్షిణము (నాదెండ్లగవనికిఁబడమరదిశ) నొకశివాలయముండి శిథిలమయినది. అచ్చోట నొక నంది యిప్పటికినుండికి పూర్వదేవాలయమును జ్ఞప్తికిఁదెచ్చుచున్నది. ఆనంది గర్భమున వరహాలుండెనని తెలిసి చోరులు తొకయొద్ద భిన్నముచేసి తీసికొనిరట. ఇచ్చట లంకెలబావియు, "వసంతఘర్" అను రాజమందిరమును గలవు. ఇప్పుడివి నామావశిష్టములు.

---

* గృహరాజుమేడ విషయమున శ్రీనాధుఁడుత్తరము వ్రాసిన దీ పోతరాజునకేమని తోఁచెడి.



(పుట్టకోట) కొండకుత్తరభాగమున క్రిందిస్థలముప శ్రీనాథప్రశంసితమగు "గృహరాజుమేడ" యను రాజమందిరముండెను. నేఁడీప్రదేశమునఁ గొన్ని మంటిదిబ్బలుదక్కఁ దక్కినవిశేషమెద్దియుఁ గానరాదు. (దీనివిషయము పెదకోమటి వేమనచరిత్రయందుఁ గలదు). ఇచట 1898 సం॥న పుట్టకోట కాపురస్థుడు కుడుముల బొల్లయ్యచేనిలో వీరభద్ర భద్రకాళివిగ్రహములు దొరికి ఆరు మాసములు మహోత్సవ జరుపఁబడి యిప్పుడాలయప్రతిష్ఠితములై యున్నవి.

దీని సమీపమునఁ బూర్వము రెడ్లుకట్టించిన రంగనాయకాలయముండెను. ఇందలి నాగేంద్రప్రతిమ యిప్పటికినిఁ గనుపట్టుచున్నది. ఇచ్చట మాణిక్యారావువారి కోనేరుగలదు. ఆయన దానిని కర్ణాటకప్రభువుల కాలమున ఖిల్లేదారుగానుండి కట్టించిరని చెప్పుదురు. దీనికిఁ దూర్పున మాణిక్యారావువారి గుండములు గలవు. ఇవి యుద్ధమున రావువారు వధింపఁబడగా వారిస్త్రీలు సహగమనముఁజేసిన గుండములట. ఈ గుండములకు దక్షిణమున రెడ్డిరాజుల గృహములుండెనని చెప్పుదురు. గృహరాజుమేడ దిబ్బలయొద్ద జడ్డిగలబావియని యొ

కటిగలదు. ఇది గృహరాజు మేడయందుఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీ ఆదిలక్ష్మీ కామేశ్వరి అమ్మవారి జలక్రీడావిహారార్థమై నిర్మింపఁబడినది.

దీనికి దక్షిణమునఁ గొండయడుగుభాగమునంటి వేయఁబడిన చెరువుగలదు. దీనిలోఁతట్టు కొండలమధ్యస్థలమున "పెద దాసరయ్య" "చినదాసరయ్య" అనువారు రెండు తోటలు వేయించిరి. ఈ దాసరయ్యల చరిత్రము తెలియరాదు. చెరువుకట్టమీఁద వేణుగోపాలస్వామి గుడిగలదు.

కొండల క్రిందిభాగమున "తిరుమలలక్ష్మీ నరసింహస్వామివారి" గుడిగలదు. దీనికిఁ బశ్చిమమున శ్రీరామేశ్వరస్వామి గుడియునుఁ, దత్సమీపమున మదనగోపాలస్వామి గుడియును గలవు.

దీనికిఁ బడమట సీతాపతియను ఖ్యాతినామముగల చెరువొకటి యుండెను. ఇప్పటి కొండవీటి కుత్తరభాగమున శ్రీ వీరభద్రాలయమును, దీనికుత్తరమునఁ "బొందిలెరహణాసాహేబు దరగా" యను మూడు గోరీమంటపములును గలవు. దీనికుత్తరమున "పత్తేఖాఁ మసీదు" ను, "భోజరా" అను అత్తార్ చౌదరి మసీదును, దానిదాపున "సురుఖానా" అను మసీదును, దానికి దక్షిణము నల్లమసీదు, దానికిఁ బడమర "గుమ్మల్ మసీదు, జామత్ఖానామసీదు"లును, వానికి దక్షిణమున "చిన్నమసీదు, రెండు దరగాలును" గలవు.

ఇప్పటి కొండవీటికి దక్షిణము రెండుమైళ్లదూరమున "శిఖవస్ ఖాఁపేట" (శింగిస్కానుపేట) యను గ్రామము గలదు. అందు శ్రీ వెన్నముద్ద కృష్ణస్వామి గుడిగలదు. ఇందుఁగల విగ్రహము పూర్వకాలమునఁ గొండవీటిరాజులచేఁ బ్రతిష్ఠింపఁబడినది. కాలక్రమమున గుడి శిథిలముకాగా విగ్రహమును బూడ్చివేసిరి. ఇప్పటికి దాదాపు నూరేండ్లక్రిందట "కోట" యను (గోపీనాథపురము) గ్రామమున నొక మహమ్మదీయునింటఁ ద్రవ్వుచుండ నీవిగ్రహము దొరకగా నప్పటి జమీందారగు శ్రీరాజా మానూరి వేంకటకృష్ణమ్మగారు చిలకలూరుపేటలో నాలయము నిర్మించి యందుఁ బ్రతిష్ఠించుటకై విగ్రహమును బండిపై నెత్తించి తీసికొనిపోవుచుండగా, శింగిస్కాఁపేటకు వచ్చుతరికి



బండి విరిగిపోయినందున వారానాటిరాత్రి యచ్చట నిలిచిరి. ఆరాత్రి వారిస్వప్నమున స్వామివచ్చి నేనిచ్చటనుండి కదలనని పలికిరట. అంత వారచట గుడికట్టించి ఆవిగ్రహమును ప్రతిష్ఠించి పెక్కు భూదానములు చేసిరట. ఇవి దండకవిలెయందలి విషయములు.

దీని నైఋతిదిక్కున దివాఁ వారి మసీదుగలదు.

ఎన్నియో యాలయములు శిథిలములై రూపుమాసిపోయినవి. వాని సుందరపుష్పలతాచిత్రితములగు రాళ్ళు పెక్కు లన్యగ్రామముల వారిచే దేవాలయములకుఁ గొంపోవబడినవి. వానిపైఁ బెక్కు శాసనము లుండినట్లు తెలియుచున్నది. గుంటూరు నృసింహస్వామివారి గుడి మొదలగుచోట్లకు విశేషముగ నిచటిశిలలు గొంపోబడినవి. సుందరమగు నొక కల్యాణమంటపము సమూలముగ గొంపోఁబడి పురుషోత్తమ పట్టణమున విష్ణ్వాలయమున నిలుపఁబడినది. దీని స్తంభములు దారువులకన్న మిన్నయగు పనితనముగలవై కంచువలె ధ్వనించుచుండును.

## కోటలు.

కొండపై నెటుజూచినను గొప్పకోటగోడలు శిథిలములై క్రిందికిఁ గనుపట్టుచుండును. తన్నిర్మాణకారకులెవ్వరో తెలిసికొన నవకాశముగాని, నిదర్శనములుగాని జూపట్టుటలేదు. కాని ప్రప్రథమమున 800 సం॥ల క్రిందట "విశ్వంభరదేవు" అను రాజు కట్టించెనని దండకవిలెయందుఁ గలదు. కొండపై నుత్తరదిశ నొకచోట నైదుకోట లొక్కచోటఁబుట్టి వెలువడినవి. అవి 1 అరకోట, 2 పిల్లకోట, 3 పెదమూలెముకోట, 4 చినమూలెముకోట, 5 తట్టకోట.

క్రిందినుండి యీకోటలగుండ పైకిఁబోవు మార్గమున "ఖిల్లెదర్వాజా" యను నొక మందిరము గలదు.

కొండక్రింద పడమరదిశ నొకటిన్నరమైలు చుట్టుకొలతగల నొక కోట గలదు. దీనిచుట్టు లోతగు నగడ్తయు, కోటకు నాల్గు కోణములందే కాక మధ్యమధ్యను బురుజులును గలవు. ఈకోటను రామయ భాస్కరుఁడుకట్టించి యందొకపురమును, గోపీనాథుని గుడియును

నిర్మించి దీనికి గోపీనాథపురమని పేరుబెట్టెను. దీనికుత్తరమున సింహద్వారమొకటి యిప్పటికిని గనుపట్టుచున్నది. దీని పడమర భాగమున నొక బాతిమీఁద రామయభాస్కరుని గూర్చిన యొకపద్యము గలదు. * దీనికిఁ గొండపల్లి గవని యనిపేరు. దక్షిణద్వారము శిథిలమైనది. దీనికి నాదెండ్లగవని యనిపేరు.

కొండకుత్తరదిశను కొండలమధ్యభాగమునందుఁ బుట్టకోటగలదు. దీనిని ప్రోలయ వేమారెడ్డి కట్టించెను. ఇందే కుంభీనపురమనియు నొకటి కట్టించెనని దండకవిలెయందు వ్రాయఁబడినది.

ఈపురమున నగరేశ్వరస్వామి గుడియొకటి ప్రసిద్ధిగనుండినట్లు కొండవీటి యుత్తరదిశగల దరగాయందుండిన మంటప స్తంభములపై నున్న లిఖితములనుబట్టియు, నీదిగువ శాసనములనుబట్టియుఁ గనుపట్టుచున్నది. కాని యీయాలయముండిన ప్రదేశమిదియని చెప్పుటకు వలనుపడదు. కొందరీదరగాస్థలమే యాలయప్రదేశమని చెప్పుచున్నారు. మఱియు నీయాలయ విషయికమగు శాసనమొకటి గుంటూరు నరసింహాలయ గాలిగోపుర స్తంభముపై గలదు.

"స్వస్తిశ్రీ శుభశకవర్షంబులు ౧౩౭౮ అగు నేటి తారణనామ సం॥ మాఘ ౧౦ లు కొండవీటి నగరేశ్వర దేవర ముఖమంటపానకు నగరేశ్వరదేవ దివ్య శ్రీపాద పద్మారాధకుఁడును, పెనుగొండపురవరాధీశుండును, వైశ్యకులోత్తముండును, శిరిశెట్లగోత్రపవిత్రుండును నయిన రాయపూడి వీరిశెట్టి తమ తండ్రి నరసంశెట్టికిని, తమతల్లి మారసానికిన్ని పుణ్యముగాను వేయించిన కంభం, శ్రీమంగళమహా. శ్రీం జేయును.

## బురుజులు.

కొండపైనుండి కనుపట్టు కోటలకు కొండయొక్క ప్రతిశిఖరమునను బురుజులు నిర్మింపబడినవి. కాని యిప్పుడొకటిరెండు తక్క తక్కినవి నామావశిష్టములై యున్నవి. అయినను శిథిలములగు బురుజుల గుఱుతులు బాగుగ గనుపట్టుచున్నవి. బురుజుల సంఖ్య యిరువదొక్కటి. వీనిపేర్లీక్రింద వ్రాయఁబడినవి.

* అచ్యుతదేవరాయల చరిత్రలోఁ జూడుము.



1 కోనేటయ్యబురుజు
2 పెదతిరుపతయ్యబురుజు
3 చుక్కలకొండబురుజు
4 సజ్జామహల్ బురుజు
5 బొల్లుమూరయ్యబురుజు
6 కాశ్రేటిబురుజు
7 మిర్యాలచట్టు బురుజు (ఇదిబాగుగనున్నది)
8 పాముకుదురుబురుజు
9 గంజికాలువబురుజు
10 పోతరాజుబురుజు
11 జెట్టిబురుజు
12 శేళ్ళకుగువబురుజు
13 పడమటిగవిబురుజు
14 హనుమంతునిబురుజు
15 వీరన్నబురుజు
16 బ్రహ్మదేవునిబురుజు
17 తిరుపతిబురుజు
18 బొడంకొండలబురుజు
19 తూర్పుకట్టెలదిడ్డిబురుజు
20 ఆళ్ళవారిబురుజు
21 ముల్లగూరమ్మబురుజు

పేర్లు కొన్నిమారినను యేబురుజేపక్కనుండినదియు నీ పురవాస్తవ్యులు వాడుకొనురీతి నిందుక్రింద వ్రాయుచున్నాను.

పర్వతసోపానముల కుత్తరదిశ తారాబురుజు (చుక్కలకొండ బురుజు) దీనికాగ్నేయమున జెట్టిబురుజు. దీనిదక్షిణమునఁ గట్టెలదిడ్డి దర్వాజా. దక్షిణమున నెమళ్ళబురుజు. దీనిదక్షిణమున రహనాల్ బురుజు. దీనికుత్తరమున సజ్జామహల్ బురుజు. దీనికుత్తరము ఖిల్లాదర్వాజా బురుజు. దీనికుత్తరము మిర్యాలచట్టుబురుజు. దీనికుత్తరము తారాబురుజుతో గలిసిన అయిదు కోటలు గలవు.

## కొండవీటిపురము.

కొండవీటిపురము రమారమి 4-5 మైళ్ళ వైశాల్యమును, పదువాడలును గలదై యుండెను. (వాడయనగా పేటయని భావము). ఇప్పటి శింగిస్థానుపేట మొదలు ముల్లగూరమ్మ కొండవరకు వ్యాపించియుండెనని కొందఱు చెప్పుచున్నారు. కొన్ని నిదర్శనములును గన్పట్టుచున్నవి.

మహమ్మదీయ ప్రభుత్వము వచ్చినతరువాత నప్పటి పాలకులు తమతమ పేర్లఁ గట్టించిన పేటలు గలవు. అవి పేట మహమ్మద్ షాపురము (కుతుబ్ షా పేట), నవాబ్ పేట, సర్ సాలార్‌జంగ్ పేట, శిఖవస్ ఖాఁ పేట, మృత్తుజానగర్ (గోపీనాథపురము) మొదలగునవి.

చేతిపనులు - వర్తకములు.

ఇచ్చట కాగితములు మున్ను కడు నేర్పుగా జనపనార, గుడ్డ పేలికలు మొదలగువానితోఁ జేయుచువచ్చిరి. విదేశపు కాగితముల మార్దవమునకును, వన్నెకును సాటి రాకపోయినను నవి గట్టిగనుండి వందలకొలఁది సంవత్సరములు చెడకయుండును. పురాతన రాజకీయ వ్యవహార గ్రంథము లన్నియును, పూర్వపు గ్రంథములును గొండవీటి కాగితములపైన వ్రాయఁబడినవి. ఈ పనిసేయువా రిప్పటికిని గలరు; కాని యితరదేశపు కాగితముల వర్తకము విరివిగనుండి వీనికి కొనుగోలు లేకుండుటచే వాటిని చేయుట మానిరి. కాగితములుసేయు స్థలము (చట్టు) కొండపై నిప్పటికిని గానవచ్చుచున్నది. కాగితములుసేయు స్థల మిదికాక మనదేశమున వేరొండు కానరాదు. ఇచట మల్లెపూవుల తోటలు చాలగలవు. ఆ పూవులతోను, మఱికొన్ని పరిమళద్రవ్యములతోను అత్తర్లుచేసి యితరభాగములకుఁ గొంపోయి ప్రసిద్ధిగ విక్రయింపుచున్నారు.

కుండిననామ విషయము.

పూర్వమునుండి యిప్పటికిని కొండవీడు కుండిననగరమనియు, విదర్భదేశమునకు ముఖ్యపట్టణమనియు, నిచ్చట దమయంతియు, రుక్మిణియు జన్మించిరనియు, నిప్పటి అమీనాబాదుయొద్దగల కొండపైనున్న ముల్లగూరమ్మయే మున్ను రుక్మిణి పూజించిన పార్వతి యనియు నిచటివారు చెప్పుచుండుటయేకాక యిది కుండిననగరమని పై విషయములఁ జేర్చి దండకవిలెయందు వ్రాయబడినది. కాని యిది త్రిలింగదేశమునకు మధ్యనుండుటచేతను, విదర్భదేశము ఉత్తరదేశమునఁగల “బీదర్” అనియు, నచ్చటఁ గుండినపురము వేరుగగలదనియు, గాన దీనిని “కుండినపురమ”ని వాడుట సమంజసము కాదనియుఁ జరిత్రకారులనుచున్నారు.



ఇది కుండినపురమైనను కాకున్నను కుండిననామము కొండవీటికి వాడబడలేదనియు, దండకవిలెలోని వ్రాత తప్పనియు, నిరసింతమన్న ముందుదహరింపఁబడిన కొన్ని యాధారములవలనఁ బై యంశములు దృఢపడుచున్నవి.

(1) *సంచార్ల శాసనము. “ శా॥ ౧౨౬౨ విక్రమ॥ మార్గశిర శు ౧౫ సోమవారమునందు శ్రీ వల్లభశిష్ట నామధేయ ద్విజాయ కుండిననామనగర ప్రాగ్దిగ్భాగే భద్రానదీ పశ్చిమతీరప్రాంత దేశే శ్రీకృష్ణానదీ పశ్చిమయామ్యదిక్సంధిస్థ జనపదేషు ప్రసిద్ధ మంచాళ్యాఖ్యగ్రామ [illegible]తిముఖ్యాగ్రహారదానం కర్తుమిచ్ఛక” అని కలదు.

(2) కొండవీటి గోపీనాథుని గుడివెనుక (పడమట) రెండవఆలయమున స్తంభమునఁగల (శా॥ ౧౩౭౬ విభవ సం॥ మాఘ శు ౧౨) శాసనమున నిట్లున్నది. “శ్రీరామేశ్వరాయనమః. కుండిననామప్రసిద్ధేషు భవతి విభవవత్సరే మాఘశుద్ధ ద్వాదశ్యాం జీవవారే సవితరి మకరస్థానిలగ్నే సిద్ధ శ్రీరామభక్త్యాజగతి రఘునాథ్యా శ్రీమాఘ్యాపహ్యా కల్పం కొండవీట్యామదగిరి కృతవాసాచు లింగప్రతిష్ఠా” (సరిగ తెలియరాకున్నదగుటచే పూర్తిగ వ్రాయలేదు).

(3) దండకవిలెలోని రెడ్డిదత్త అగ్రహారములను గుఱించిన శ్లోకములలో :—

“శ్లో॥ తస్యపాదభవేద్రస్య కుండినక్షోణిశాసితః
వేమాఖ్యశ్చతురః పుత్రాః నిత్యధర్మపరాయణః”

(4) శ్రీగురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు 1-2-1893 నఁ బచురించిన కవిజీవితము 587 వ పుటయందు :—

“ఆంధ్రదేశమునకుఁ దూర్పున సముద్రమున్నదిగదా. ఆకారణముచే నాసముద్రతీరముననే గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, నెల్లూరు మండలములున్నవి. ఈ మండలములలోని దేశమునే పూర్వము “కళింగము, వేఁగి, విదర్భ” లను దేశములుగ వ్యవహరించిరి. ఈ విదర్భదేశము కృష్ణామండలములోనిది. దీనిఁ బురస్కరించుకొని నెల్లూరు, కడప, కర్నూలు, చిత్తూరు, బళ్లారి మండలములున్నవి. ఇవి కాంచెమెచ్చుతగ్గుగాఁ గృష్ణానదికి దక్షిణభాగములో నుండును. ఆ కృష్ణా

* లోకల్ రికార్డ్సు 12 వాల్యుం 16 వ పేజి.

నది యుత్తరభాగమున బెజవాడ మొదలు హైదరాబాదువరకుఁగల దేశము త్రిలింగదేశమని పూర్వము వాడుకొనఁబడు లింగనాడు ఖండము. ప్రస్తుత మిది గోలకొండదేశముగాఁ జెప్పవలసియుండును".

(5) పూర్వము కొండవీటియందుండి రాజగౌరవమునొందిన కొప్పరపు సిద్ధాంతులనఁబడు చింతలపాటివారి పంచాంగపీఠికయందు "॥శ్లో॥ శ్రీమచ్చింతలపాటివంశతిలక శ్రీపేరుభట్టాత్మజో। భారద్వాజపవిత్రగోత్ర జననస్సిద్ధాంతశాస్త్రార్థవిత్ । ఎల్లజ్యోతిషికాగ్రణీర్విజయతే వేదాంగవిత్సత్యవాక్ । పంచాంగం ప్రతివత్సరం ప్రకటయన్ శ్రీకొండవీటీపురే॥" అని చెప్పినయీ యెల్లాజ్యోతిషికుని పుత్రుఁడగు వేంకటయజ్వ వ్రాసిన కాలామృతవ్యాఖ్యపీఠిక శ్లోకమున నీ కొండవీటిని "సోయం వేంకటయాజకో విజయతే శ్రీ కుండినే పట్టణే" అని వక్కాణించెను. ఇందువలనఁ గొండవీటిపురమునకుఁ గుండిననగరమను పర్యాయనామము గలిగియున్నదని విశ్వసింప నవకాశము గలుగుచున్నది.

ఇత్యాది నిదర్శనములనుఁబట్టియు, చిరకాలమునుండియున్న వాడుకలననుసరించియు, నిట్టి విమతములు నిరసించుటకంటెఁ జంద్రభాగ, తుంగభద్ర, బరహంపురము, బందరు, హైదరాబాదు మొదలగునవి యొక పేరుతో రెండుండి యవి వేర్వేరుస్థలముల నొండొంటికిఁ గడు దూరమున నున్న రీతిని, పూర్వము కుండినపురములును రెండుండి అందొకటి "కుండినపురము" మనియుఁ "గొండవీడ"నియు ద్వివిధనామంబులఁ జెన్నగుచుండెనని యూహించుట సమంజసము.

## ప్రభుత్వవిషయము. కాలము.

కొండవీడు యుగాంతరములనుండియు రాజనివాసమై భీమరాజు భీష్మకుఁడు మొదలగువారికాలమునుండియు నాయా భూపతులకు రాజధానిగ నుండెననియు గజపతివంశక్షత్రియుఁడగు "విశ్వంభరదేవు" కొండపైఁ దొలుతఁ గోటఁగట్టించి 12సం॥లు పాలించెననియు- పిదప నితని కుమారుడు గణపతిదేవు మొదలగువారు పాలించిరనియుఁ దండకవిలె మొదలగువాటియందు వ్రాయఁబడినది. కాని ప్రప్రథమమునఁ



గోటకట్టిన దెవ్వరైనదియు చెప్పుటకుఁ దగినయాధారము లేమియుఁ గానరావు. ఇందు గల కోటలు మొదలగునవి వేయేండ్లకుఁ బూర్వము నిర్మింపఁబడినట్లు గనుపట్టును. మోటుపల్లి శాసనమున గల "సోయం కొండపట్టణే" అను వాక్యమును బట్టి శా॥ ౧౧౬౦ గణపతిదేవుని కాలమునాటికే రాజధానిగ నుండినట్లగుపడు చున్నది. (గణపతిరాజు చరిత్రభాగము చూడనగు) ప్రోలయ వేమారెడ్డినాటికి అద్దంకి రాజధానిగ నుండినట్లు హరివంశమునఁ జెప్పఁబడినను; ఆతఁడు కొండవీటియందుండియే ను పాలించినట్లు కూడ శాసనాదులవలనఁ గనుపట్టును. అన వేమారెడ్డి ధరణికోటనుండి తన రాజధానిని కొండవీటికి మార్చెనని యాంధ్రుల చరిత్రయందు వ్రాసియున్నది. ఎంతకాలమునుండి యెవ రెవరు కొండవీడు రాజధానిగ నేలినదియుఁ దెలియకున్నను తుదకుఁ గొండవీడు రెడ్డిరాజులనాటనుండి రాజధానిగ నుండెననుటకు సంశయ ముండదు.

ఈ దేశపు రాజు లందఱును ధరణికోట, కొండవీడు పట్టణములనే రాజధానిగఁ జేసికొని యేలిరి. కావున నీరెండుస్థలములందుండిన రాజులయొక్క పాలన దేశ మొకటి యగుటచే సందర్భమును బట్టి వారిరువురి చరిత్రము నిందుఁ జేర్పబడినది.

ఆయా రాజులకాలములు స్థానికచరిత్రలను బట్టియు శాసనాదులను బట్టియుఁ దెలిసినంతవఱకు నిదర్శనములతో నిందుదాహరింపఁబడెను.

## రాజ్యవిస్తీర్ణము.

కొండవీటిరాష్ట్రము కృష్ణా, గోదావరి, గుంటూరు, నెల్లూరు, కర్నూలుమండలములకు వ్యాప్తమై యున్నట్లు రెడ్డిరాజుల శాసనముల లోని బిరుదులవలనఁ గనుపట్టుచున్నది. దండకవిలెను బట్టి ఇది నాలుగు గిరిదుర్గములును, పదునాలుగు సీమలును (2048) రెండువేల నలుబదియెనిమిది గ్రామములును గలిగియున్నట్లు దెలియవచ్చుచున్నది. దీని వైశాల్యము ర॥ 22500 చదరపుమైళ్ళు.

గిరిదుర్గములు — 1 కొండవీడు. 2 వినుకొండ. 3 బెల్లంకొండ 4 నాగార్జునకొండ.

సీమలును వానిక్రింది గ్రామములును.

| | | | |
|---|---|---|---|
| కొండవీటిసీమ | 580 | తంగెడ సముతు | 44 |
| వినుకొండసీమ | 225 | తుమ్మృకోట ,, | 12 |
| బెల్లంకొండసీమ | 100 | | —— |
| అద్దంకిసీమ | 55 | | 150 |
| ఉదయగిరిసీమ | 80 | | —— |
| కోటసీమ | 60 | కందుకూరుసీమ | 65 |
| వెల్లూరుసీమ | 150 | దరిశి లేక పొదిలెసీమ | 80 |
| మారెళ్ళసీమ | 58 | అమ్మనబ్రోలుసీమ | 55 |
| నాగార్జునకొండసీమ | 150 | చుండిసీమ | 44 |
| ఇందుక్రిందిసముతులు 5[illegible] | | దూపాటిసీమ | 360 |
| మాచెర్ల సముతు 64 | | | —— |
| గురిజాల ,, 16 | | | 2048 |
| కారెంపూడి ,, 14 | | | —— |

ఈ దేశమునందంతటను మొత్తము యెనుబది నాలుగు దుర్గములు (కోటలు ఠాణాలు గల గ్రామములు) కలవు. వీటి పేర్లు స్పష్టముగఁ దెలియఁదగు నాధారము లేదు. ఈ గ్రామములు గాక నందిగామసీమ 90 కంభముసీమ 200. వినుకొండసీమ 237 అనియు వెరశి 2219 గ్రామము లనియు నింకొక గ్రంథమున వ్రాయబడినది. తురుష్కులు పాలనమునకువచ్చిన పిదప నీ రాష్ట్రమంతయు (కొండవీడు) "ముర్తుజానగర్" (కొండపల్లి) "ముస్తఫానగర్" అను రెండు సర్కారులుగా నేర్పడినవి. అందు కొండవీటి సర్కారున నెక్కువ గ్రామములుండి రెండవదానిక్రిందఁ దక్కువగ్రామము లుండెను. అందువలన సమముగ నుండుటకై కొండవీటిక్రిందనుండిన 1 పాములపాడు. 2 వెలగపూడి. 3 మద్దూరు. 4 ధరణికోట. 5 బండ్డంరావూరు. 6 మందడం. 7 ఉండవల్లి. 8 పెనుమాక.



9 తాడేపల్లి. 10 పాతూరు. 11 ఎరుకుళ్ళపాడు. 12 తూమునూరు. 13 ఉప్పుమాగులూరు. 14 రావిపూడి గ్రామములు కొండపల్లి సర్కారులోఁ జేర్పఁబడెను.
రాయలదేవుడి యేలుబడిలో కైతేపల్లి ఉదయగిరిక్రిందను, పరుచూరు అద్దంకిక్రిందను, కేశానుపల్లి, యెనుమలమంద, మాదల, తొండపి, కోసూరు, జువ్వలకల్లు యీ 6 బెల్లంకొండసీమక్రిందను, ముసిదక్షిణం (ముసియొద్ద) బింగనపల్లి, తుమ్మలపెంట, కరేడు యీ నాలుగు కందుకూరిక్రిందను, ఈతముక్కల, మడునూరు యీ రెండును పెళ్ళూరి క్రిందను కలిపిరి.

ఈ దేశము కర్ణాటకము క్రింద చేరిన పిదప వినుకొండ బెల్లంకొండ పరగణాలుగ విభజింపబడెను. జంపనివారి క్రింద 9 గ్రామములు అలాయిదా ఆయెను. కేసానుపల్లి, యెనుములమంద, మాదల తొండపి, కోసూరు జువ్వలకల్లు, గోరంట, గరికపాడు యీ 8 బెల్లంకొండక్రింద కలిసెను. విశాయిక్రింద 14 గ్రామములు అలాయిదా అయిపోయెను.

తురకాణ్యాం అయిన తరువాత 1 ముద్రేడు. 2 ఆముదాలపల్లె. 3 గోకర్ణేశ్వరము. 4 ప్రజ్ఞం. 5 అడవులదీవి. 6 పోతుమెరక 7 యేలేరు. 8 అలపర్రు. 9 పల్లపట్ల. 10 ముత్తుపల్లి. 11 యీదుపల్లి. 12 పెదమట్లపూడి. 13 చినమట్లపూడి. 14 అల్లూరు. 15 కావూరు. 16 చెరుకుపల్లి. 17 ఆరేపల్లి. 18 పూడివాడ. 19 నగరం. 20 కామరవోలు. 21 రాజవోలు. 22 శిరిపూడి. 23 బలుసులపాలెం. 24 పెదపల్లి 25 చందవ్రోలు. 26 అమృతలూరు. 27 బాపట్ల. 28 గణపవరము. 29 ఉరపట్ల. 30 పెరవలి. 31 పేరాల 32 అడుసుమల్లి, 33 కడకుదురు. 34 పెదగంజాము. 35 దేవరపాడు. 36 వెలగపూడి. యీ గ్రామలు ఉప్పుమహాల్ క్రింద అలాయిదా అయిపోయెను.

## పూర్వపుభూమికొలతలు.

ఈ దండకవిలెయందుఁ బూర్వమున వ్యవహరింపఁబడిన భూమి కొలతలకు తూములనియు ఖండీలనియు వాడబడినట్లు వ్రాయబడినది.

వీనిపేర్లిప్పుడు వాడబడకుండుటచే నీపేర్లెవరికిని తెలియుట దుస్తరము కాన వానిపేర్లును పూర్వమున వ్యవహరింపఁబడిన కొలమానములును, వాని పరిమితికి యిప్పటికి కొలతలతో సరిపోవు కొలపరిమాణములను దండకవిలె నుదహరించిన విధమున వ్రాయుచున్నాను.
తూము, కత్తి, మర్త, ఖండలీ అను నివి యన్నియుఁ గుచ్చలకు పేర్లు.

4 నూరలు 1 బార

4 బారలు 1 గడ లేక కర్ర

400 గడలు 1 కుంట

100 కుంటలు 1 కుచ్చల లేక ఖండలీ లేక తూము.

ఓఢ్రులకాలమునను గోపరాజు రామమంత్రి కాలమునను 4 బారల గడను 6400 అయిన నొక కుంట లేక కత్తి యనిరి.

గజపతులపాలనమున 100 కుంటలు 1 కుచ్చల లేక ఖండలీ

అంతకుపూర్వము 80 కుంటలు 1 కుచ్చల

రెడ్డిరాజులనాడు 50 కుంటలు 1 కుచ్చల తూము.

కర్ణాటప్రభువుల పాలనదినములలో 64 కుంటలు 1 కుచ్చల లేక 2½ తూము

తురుష్కుల ఏలుబడియందు 2 కుంటలు 1 ఖండలీ

16 మానికెలు 1 తూము

ఈ కాలము కొలతల ప్రకారము

50 లింకులు ½ (అర్థ) సెంటు

2½ సెంట్లు 1 పిచ్చకుంట

2½ పెదకుంటలు 1 యకరము.

ఈ భూమి కొలత లన్నియు నే దేశమున నే క్రమమున వాడుకయందున్నదియు విపులముగ విజ్ఞానసర్వస్వమున 3 సంపుటము. 14 గవ సంచికయందు అమరకము అను విషయమున వ్రాయబడినవి. ఈ వివరణమంతయు నిందుదహరించుట యనవశ్యము



## —✱ రెండవ ప్రకరణము ✱—

### ముక్కంటిదేవుఁడు లేక మొదటి ప్రతాపరుద్రుఁడు

ఇతనిఁ గూర్చి దండకవిలెయందు విస్తరించి వ్రాయబడినది. గాని యీతఁ డేలిన స్థల మేదియైనది చెప్పఁబడలేదు. ధరణికోటయందుండి రాజ్యపాలన మొనర్చినట్లు తెలియుచున్నది. ఇందుకు సరియగు నిదర్శనములు దొరకలేదు. ఓరుగల్లురాజధానిగ నుండెననియు, నీతని రాష్ట్రము తూర్పు సముద్రము, దక్షిణము శ్రీశైలము, పశ్చిమము పశ్చిమచాళుక్యదేశము కటకము, ఉత్తరము మాల్యవంతము, యీ హద్దులమధ్య గలదనియు, ఏన్ సెంట్ డక్కన్ గ్రంథమున వ్రాసిరి. అయినను ఓరుగంటిరాజులకు ధరణికోటకు సంబంధముండుటచే ధరణికోటయందుండినట్లును చెప్పవచ్చును.

ఈతని శాసన మొకటి ఓరుగల్లునఁ గలదు. పూర్తిగ లభింపనందున నిం దుదహరింపలేదు. ఇతఁడు రుద్రాంశసంభూతుఁడనియును అందువలన నితనికి ముక్కంటి లేక త్రినేత్రుడని బిరుదువచ్చెననియును దాతయనియును పెక్కు దేవాలయములను గట్టించినవాఁడనియును రెండు వేల రెండు నందల పందొమ్మిది గ్రామము లేలెననియు దండకవిలె నొడువుచున్నది.

ఇతనికిఁ బూర్వము వేయేండ్లక్రిందట ధరణికోట నేలిన ముక్కంటి పల్లవుఁడను రాజునకుఁగల యీ బిరుద మీతనికి వచ్చినట్లు పూర్వ చరిత్రమువలనఁ దెలియుచున్నది. ముక్కంటిదేవుడు కలియుగము 3౬౦౦ యేండ్లమీద దుందుభి సంవత్సరమునఁ గాలధర్మము నొందెనని దండకవిలె నొడువుచున్నది. దుందుభి కలి॥ 3౬౮3 క్రీ॥ 464 శా... ౪౮౭ అగుచున్నది. ఈ కాలము ప్రతాపరుద్రునికి ఆరువందల యేండ్లు ముందుగాన ముక్కంటివల్లభునకే సంబంధించుచున్నది.

ఈ ప్రతాపరుద్రుడు కాకతీయవంశజుడు. ఈతనివంశ మిందుక్రింద రెండువిధముల తెలుపబడినది. ఇందలి భేదాభేదములు చదువరులు విమర్శింతురుగాక.






ఈ ప్రతాపరుద్రుని దర్శించుటకై వీరశైవుడగు పిడుపర్తి సోమనారాధ్యుడు (శైవబ్రాహ్మణుడు) రాగా నితడు దర్శనమునకు సెలవీయఁ డయ్యె. అంతట నాతఁ డలిగి శివస్వరూపమును రాజునకుఁ బ్రత్యక్ష మగునట్లు చేయగా రాజు విస్మయ మంది క్షమాపణము వేడుచుఁ గొలువుకూటమునకు రావించెను. అప్పు డాతఁడు రాజును సంభాషణలచే మెప్పించి తనకు శిష్యునిగఁ జేసికొనెను. కి॥ శే॥ కం॥ వీరేశలింగము పంతులుగారు రెండవకూర్పు కవులచరిత్రమున శా॥ ౧౧౧౦ సం॥ ప్రాంతమున బసవపురాణమును పద్యకావ్యముగ రచించినది పిడపర్తి సోమనాథకవి అని వ్రాసిరి. ఈతఁ డెవరో తెలియరాదు.

ఈతని శాసన మొకటి ఓరుగల్లునందుఁ గలదు. అది నాకు లభ్యము కాదయ్యెను.

## —* ఇతని ధర్మములు *—

ఈ సోమనారాధ్యుని యాజ్ఞచొప్పునఁ బ్రతాపరుద్రుడు బహు నొకం డగ్రహారము లిచ్చెను. అందు సప్తమహాఋషుల పేర్లతో నేడును, త్రిమూర్తులపేరిట మూడును, గురువుపేరిట నొకటియు నిచ్చెను. ఈ విషయము దండకవిలెయం దిట్లు వ్రాయఁబడినది.

"శ్లో॥ దదేధరణికోటాఖ్యం బ్రహ్మప్రీత్యాపురంముదా
చంద్రార్ధమకుటప్రీత్యా చంద్రవాదిపురందదా (చందవోలు)
కేశవార్పణబుద్ధ్యావై దదౌదిక్షుపురంభువి
సోమనారాధ్యగురవే పిడపర్తిఁపురందదౌ॥
"శ్లో॥ ఆదౌప్రతాపరుద్రాఖ్యే భూపాలోధర్మపూర్వకం
సప్తఋషిసంఖ్యయా గ్రామాన్ దదౌసప్తద్విజాయతే॥

*   *   *   *

ఏవం ప్రతాపరుద్రాఖ్యే కృతవాన్ రుద్రసంఖ్యయా॥ "

౧ ధరణికోట బ్రహ్మప్రీతిగను
౨ చందవోలు శివప్రీతిగను
3 ఇక్షుపురి (చెఱుకూరు) విష్ణుప్రీతిగను
౪ కారుసాల విశ్వామిత్రస్థానము

౫ గుంటూరు గౌతమస్థానము
౬ ఇనగల్లు జమదగ్నిస్థానము
౭ ఉప్పుటూరు వసిష్ఠస్థానము
౮ సొలస భారద్వాజస్థానము
౯ వంగిపురము కశ్యపస్థానము
౧౦ కారముచేడు ఆత్రేయస్థానము
౧౧ పిడపర్తి గురుస్థానముచేసి సోమనారాధ్యునకును పైవి యితర బ్రాహ్మణులకు నిచ్చెను.

మఱియు చేబ్రోలున నితడు రుద్రసంఖ్య శివాలయములను గట్టించి సహస్రలింగప్రతిష్ఠ చేసెను. అనగా ఒక లింగమునందె 998 లింగములు చెక్కించి తక్కిన రెండు లింగములను గుడిలో నుత్తర దక్షిణ దిశలందుఁ బ్రతిష్టించెను.

### —* ఈతని యోగాభ్యాసము *—

ఈతఁడు యోగాభ్యాసముచేసి * యోగబలమున నిత్యమును కాశికిఁబోయి గంగాస్నానము చేసి భార్యయగు "అంబికాదేవి" కిఁ దెలియకుండగ నామె మేల్కొంచకమున్నె మరల వచ్చుచుండెడి వాఁడు. ఇట్లుండ నొక దిన మామె యమ మేల్కొంచి భర్త లేకుండుట కెంతయు విచారించి తన యనుగ్రహపాత్రులగు కొందఱు జైనుల నడిగి జ్యోతిషశాస్త్రముఖమునఁ దనభర్తవిషయ మంతయుఁ దెలిసికొని మరునాడు భర్తతోఁ దననుగూడఁ గాశికిఁ గొంపొమ్మని వేడికొని వల దని యెంత వారించినను వినక బలాత్కారమున విభు నొడబఱిచెను.

---

* ఇది మధుమతి యను భూమిక (విద్య). దీనిని 65 సం॥ క్రిందట చేజర్లయం దుండిన శ్రీ తుంగదుర్తి బుచ్చయ్యగారు నేర్చి దివ్యస్థలము లన్నిటిని యొక సమయమున సేవింపుచు వచ్చిరి. దీనినిగూర్చి యోగశాస్త్రమం దిట్లు చెప్పబడినది. "శ్లో॥ అంజ నాకర్షణాద్యభ్యాసస్య నాదోపయుస్తుతిం। దూరశ్రుతిందూరదృష్టేష్యు దూరగమనం తథా । సాక్షాన్మధుమతీశక్తి ప్రసన్నస్య ప్రయచ్ఛతి। పాతాళ లోకసంచారోఖిల సిద్ధిప్రజాయతే । మహిమ్నా ఖేచరత్వాదిసంచారస్సర్వకామదః । సర్వత్ర సర్వదా స్సర్వంవ్యక్తి జ్ఞానప్రభావతా। సప్తకోటిమహామంత్రాకళాన్నాహ్వతి షోడశీం॥"



పిట్టకేల కతఁడును సమ్మతించి యోగబలమున భార్యనుఁ గూడ దోడ్కొని కాశికిఁబోయి స్నానమాడఁబోవుతఱి నామె "రజస్వలా" అయ్యెను. తద్దోషమున నాతనియోగ ముపయోగింపనందునఁ జిం తిల్లి యచటనుండు బ్రాహ్మణులను జేరి తనను భార్యాసహితముగ నిజరాజధానియగు ధరణికోటఁ జేర్పుఁడని వేడికొనెను. అందులకు వారు సమ్మతించి "రాజా! ముందు పంద్రెండేండ్లకొక మహాక్షామము రాబోవుచున్నది. అప్పటికి మే మెల్లరముఁ గుటుంబసహితముగ నీకడ కు వత్తుము. మమ్ము రక్షింతువేని నీ కోరికఁ దీర్తు" మనిరి రాజు నట్లె యని వారికి వాగ్దానమీయ వా రా దంపతులఁ దమ యోగబలమున శుద్ధులఁ గావించి క్షణమాత్రమున నెప్పటియట్ల ధరణికోటఁ జేరునట్లు చేసిరి.

### —* విప్రవినోది జననము-జయినులనాశము. *—

నిజపురంబుఁ జేరి ప్రతాపరుద్రుఁడు దన భార్య కీ వృత్తాంత ము జయినులవలనఁ దెలిసియుండునని యెంచి వారి యెడల మిగుల గోపించి యుండెను. ఆ కాలమున జయును లీ దేశమునఁ బ్రబలి యుండిరి. వారికి జ్యోతిషవిద్య కరతలామలకము. వేదబాహ్యులు. వీరికిని మన దేశపు బ్రాహ్మణులకును బ్రబల శత్రుత్వము కలిగి యుండెను. ఇట్టి సందర్భమున బ్రతాపరుద్రనరపతి యొకనాడు దన సింహాసనము క్రింద నొక గుంట తీయించి యందొక కుండలో నొక సర్పము నుంచి పూడ్పించి బ్రాహ్మణులను, జైనులను సభకుఁ రావించి "నా సింహాసనము క్రింద నేమి కలదో శీఘ్రకాలమున మీ యుభ యులు చెప్పుడు. చెప్పలేనివారిని వంశనాశనము చేయించి వారి ప్ర మాణగ్రంథముల దగ్ధము చేయించి దేశము వెడలఁగొట్టింతు" నని శాసించెను. జయినులు "చెప్పెద" మనిరి. బ్రాహ్మణులు "రేపటికిఁ గడువీయు" మనిరి. రాజును గడు వొసంగెను. బ్రాహ్మణు లేమియుఁ దోచక దిచ్చవడి భీతచేతస్కులై యందరు నరణ్యమున కేగి భక్తి

యుక్తులై సూర్యోపాసనఁ జేయుచుఁ బ్రాయోపవిష్టులు కాఁ జొచ్చిరి. అప్పుడు కరుణాఖండగు సూర్యభగవానుల కా బ్రాహ్మణులయం దనుగ్రహము జనించి యొక బాలునిఁ గల్పించి వారి కడకుఁ బంపెను. ఆ బాలుఁడు చేత నొక పాత్రమునుబట్టి యాకస్మికముగ నా పారుల కడకువచ్చి "మీ వృత్తాంత మే"మని యడిగెను వా రా విషయము నంతయును వినిపింపఁ నతడు "దీనికై మీ రింత విలపింపనేల? నన్ను మీరు పోషింతుమని వాగ్దాన మిత్తురేని మీ కార్యమును క్షణమాత్రమున నెరవేర్తు" ననిన వా రెల్లరును "మేము మా వంశము లుండు నంతవరకును పోషింతుము. మా బాముల దీర్పుము." అని వేడ నాత డిట్లనియె. "అయ్యలారా! మీరు రాజసభ కిప్పుడే వెడలి నన్ను మీ వానిగ వేషధారునిఁజేసి సభకుఁ గొంపోయి సభలో "రాజా! మీ ప్రశ్నకు మా బాలకుఁడే యుత్తర మిచ్చునని పలికి నన్ను ముందు పంపుడు. నేను మిమ్ము గెల్పించి ప్రాణసంరక్షణము సేతు"నని చెప్పగా వా రది యేమగునో చూతమని యట్లు చేసిరి.

సభయందుఁ బ్రవేశించి బ్రాహ్మణులు సూర్యదత్తవరప్రసాది తమతోఁ జెప్పినవిధంబున రాజునకు మనవిజేసి యా బాలకుని ముందుకుఁ బంప నా బాలుడు "మహారాజా! నీ సింహాసనముక్రింద ముత్యాలఛత్ర మున్న"దని పలికి మంత్రాక్షతలు చల్లెను. జయినులు యథార్థమునుఁ జెప్పిరి. త్రవ్విచూడఁగ నందు ముత్యాల ఛత్ర ముండెను. రా జందుల కాశ్చర్యము నొంది బ్రాహ్మణులను మెచ్చి "మీ రోడితి" రని జయినుల నిరసించి వారిని దేశాంతరమునకు వెడలగొట్టించి వారి యిండ్లను బ్రాహ్మణుల కిచ్చి జైనమతగ్రంథముల దగ్ధము చేయించెను. వారును దుఃఖితులై యీ యుపకృతిఁ బన్నినవాఁడు "భిక్షుకుఁడౌఁగాక" యనియు బ్రాహ్మణులయందు "వేదములునిలువక నిరర్థకములగుఁగాక" యనియు, "ఇట్టి క్రూరకృత్యమున కొడిగట్టినరాజు స్థానభ్రష్టుఁడౌఁగాక"యనియు శపించి పోయిరి.



పిదప బ్రాహ్మణు లాచిన్నవానిని గౌరవించి అతనికొక వైశ్య బాలికనిచ్చి వివాహము సేసిరి. తమకు యాచకునిగ నుండనియమించిరి. అతఁడు విప్రులకడ వినోదములు జేయుచు జీవింప మొదలిడెను. అతనికే "విప్రవినోది" యను పేరువచ్చెను. కాలక్రమమున నా బాలుని వంశ మభివృద్ధిఁగాంచెను. ఆవంశమువా రాంధ్రదేశము నెల్లెడల వ్యాపించి యిప్పటికిని బ్రాహ్మణులనే యాచింపుచుందురు.

జయినుల శాపమువలన నితఁడు ధరణికోట విడిచి ఓరుగల్లు రాజధానిగ మార్చుకొనుట కలిగెనని దండకవిలెయందు వ్రాయఁబడి నదికాని; రాజధాని మార్చుకొనినది రెండవప్రతాపరుద్రుఁడని యితర చరిత్రములందుఁ గానవచ్చుచున్నది. అయినను యీతని పుత్రుఁడగు గణపతి యోరుగల్లునఁ గోటకట్టెను. గనుక పైవృత్తాంతము బలపడుచున్నది.

—* ఆరువేలవారి విషయము *—

కాశీబ్రాహ్మణులు చెప్పినట్లు కొంతకాలమున కాదేశమున గొప్ప కఱవురాగా అచటనుండి ఆఱువేల కుటుంబములవారు ధరణికోటకు బయలువెడలివచ్చి కృష్ణానది సంపూర్ణప్రవాహముగ నుండుటచే దాటఁజాలక నదీతీరమున విడిసి "యిట్టి క్షామకాలమున రాజు మనను భరించునో లేదో; అన్నము లేక మృతినొందుటకన్న నదీమధ్యమున మరణ మొందుట మే"లని యెంచి దేవుని దలంచుచుఁ బ్రవాహమునఁ బడి దాటజొచ్చిరి. దైవకృపచేఁ బ్రవాహము వారికి మోకాలిబంటి యయ్యెను. వా రెల్లఱును ధరణికోటఁ బ్రవేశించి రాజును దర్శించి యీ వృత్తాంతము సెప్ప నాతఁడు సంతసించి వారిని గౌరవించి పోషింపఁ జొచ్చెను. వీరే "యారువేలవార"ని యందురు. ఆరువేలవారి విషయమై వేరు వేరు విధములుగ ననేకులు చెప్పుచుందురు. గోపరాజు రామన్న కరిణీకము లారువేల మందికి యిచ్చుటవలన వారి కాపేరు వచ్చెనని చెప్పుదురు. కాని యిది విశ్వాసపాత్రము కాదు. ఏలనన;

కరిణీకము లీయబడినవా రారువేలవారు మాత్రము శాక పలు తెగల వారయి యుండిరి. ఆరువేలనాడని చెప్పబడు దేశమునం దుండినవా రగుటచే వారికీ పేరు వచ్చినట్లు కనుపట్టుచున్నది.

ఈ ప్రతాపరుద్రుడు (ముక్కంటి) మచిలీపట్టణము (బందరు) నకుఁ బోయి అచ్చట శ్రీ శాంతమల్లేశ్వరస్వామివారిని దర్శించి యచ్చటఁగల శూద్రకులార్చకులను దొలగించి బ్రాహ్మణార్చకులను నిర్ణయించి యీ దిగువ శాసనము వ్రాయించెను.

* బందరు శాసనము.

"శ్లో॥ శకాబ్దే శాలివాహశ్చ నేత్ర శాస్త్రాంబ రేందుకే (౧౦౬౨)
మాసేకృష్ణచతుర్దశ్యాం విక్రమే మాఘసంజ్ఞకే
ముక్కంటినామరాజేన పాలితే ధరణీతలే
శివక్షేత్రేషు సర్వేషు చాముండ జంగసంజ్ఞకే
అపరేచార్చకాభూత్వా పూజాచ క్వారవైదికీం
తస్మిన్ కాలే మహారాజా రిపుమత్తేభకేసరీ
ఉమారమణపాదాబ్జాయుగళైకం పరాయణః
నారాయణం యథామంత్రై ర్వేదోక్తై విప్రమోత్తమః
పూజయంతి తథాశంభుః కారయిష్యమ్యహం సదా
ఇతిసంచింత్యబహుధా బ్రాహ్మణాన్ వేదపారగాన్
ఆహూయస్వయమ్యగా నేనుస్సభాయాం స్సంపురోహితః
ప్రత్యుద్గానాం తథాకృత్వా పూజాసమ్యగ్యథావిధిః
భక్త్యాపుంసన్నమకృత్యాతాన్ సర్వాన్ బ్రాహ్మణోత్తమాః
రాజాప్రోవాచవచనం సభాయాం భూసురాశ్రితః
మేఘగంభీరమోవాచ భక్త్యావినయపూర్వకం
శ్రుణ్వంతు బ్రాహ్మణాస్సర్వే వేదవేదాంగపారగాః
విజ్ఞాపన మిదంయూయం అస్మదీయ యథాక్రమం
ఋగ్యజుస్సామవేదోక్తైః । మంత్రైస్సర్వైక్రమైరపి
స్తూయమానం మహాత్మానాం పరమాత్మానస్సమర్చయం
శంకరాం పంకజాం భక్త్యాత్యఖిలాసురసేవితః
భావితం హృత్సరోజేషు సర్వదాపరమర్షిభిః
శంకరైరర్చితం నిత్యం కింకరోహింకథంసహా



కింపునర్భనితాంతత్వాం । జానీత్వాం పార్వతీపతే
తస్మాద్యూయం మహాభాగాః భగ్గనిర్భాగ్యదుర్గమం
భాగవంతం సమర్చంతు యథాన్యాయమనామయం
యతీదితంతథా రాజ్ఞావచనం సర్వభూసురాః
సమాకర్ణ్యధరాపాలం ననందు తుష్టపుష్టలైః
సృష్టాంత్తంధీమతా రాజాన్ భగవతాశ్రీమతాచుతః
మహర్షీణాం తథాస్మాకం దేవర్షీణాం మహాత్మనాం
కింతుపూర్వేయథేదాశీం తథా వేదవిదామహీ
స్థితేరభావదుగ్రస్య పూజాజాతచ్ఛభైతతః
తస్మాత్కాశ్యపకౌండిన్య భారద్వాజహారితసైః
మార్కండేయాభిధానేన గౌతమాత్రేయకౌశికైః
గోత్రేరేతేర్యుతాన్ విప్రాన్ తేషు బ్రాహ్మణపుంగవాన్
అహూయశంభుపూజాయాం నభిషిస్యనియమ్యచ
దేవానాం బ్రాహ్మణానాంచ యథాతృప్తిం విశేషతః
విస్తాద్యక్షేత్రపాత్రాణి గ్రామాణి వివిధానిచ
దాపఇత్వా తథా రాజ్ఞాం ప్రతిష్ఠాంచతురేబుధాః
పంచారామేషుకేషాచత్ బ్రాహ్మణానాం మహాత్మనాం
పట్టిషేచపరేషాంచ కదళీపుగసాజ్ఞకే
రాజాద్విజైపదేషామ గోకర్ణక్షేత్రసంజ్ఞకే
వసతంకారయామాసః యథార్హ్వాం ద్విజసత్తమాః
రాజాద్విజైర్వరాపూజన్ కారయం శంకరం ప్రతి
సనందవైదికైర్మంత్రైరభిషేచనపూర్వకం
శ్రీమన్మహాదేవస్య శ్రీపార్వతీకుచకలశవిన్యస్త
కుంకుమాంకితవక్షస్య శ్రీమందరాచలేశాయైనమః"

ఇతఁడు రాజ్యమును క్రీ॥ 1146 మొదలు 1196 వరకు పాలించెనని ఆంధ్రుల చరిత్ర రెండవభాగము చెప్పుచున్నది. శా॥౧౦౬౮-౧౧౧౮ వరకని కవుల చరిత్ర 2వ కూర్పున కం॥ వీ॥ పంతులుగారు వ్రాసిరి. పైశాసనము క్రీ॥ 1140 నాటిది. కావున నీతఁడు 12వ శతాబ్దమధ్యమున నుండినవాడు. మఱియు నీతని శాసనములు శా॥ ౧౦౮౮

* (లోకల్ రికార్డు నెం 19 వాల్యూం 281 పేజి)

(క్రీ॥ 1162) శా॥ ౧౧౦౭ (క్రీ 1185) నాటివి కలవని ఫ్లీటుడక్కను గ్రంథమున వ్రాయబడినది. ఈతని పిదప నితని తమ్ముడు మహాదేవుఁడు రాజ్యమునకు వచ్చి కొద్దికాల మేలెను. ఈ మహాదేవరాజును గూర్చిన విశేషాంశము లెవ్వియు నెందును గన్పట్టవు. దీనిఁ బట్టి యీతఁడత్యల్పకాలము మాత్రము రాజ్యపాలన మొనర్చెనని నిశ్చయింపఁదగి యున్నది. అనంతర మీతని తనయుఁడు గణపతిదేవుఁడు సింహాసన మలంకరించెను.

---

—* మూఁడవ ప్రకరణము *—

## గణపతిదేవుఁడు.

గణపతిదేవుడు ప్రథమప్రతాపరుద్రుని తమ్ముఁడు. మహాదేవుని కిని బయ్యమాంబకును పుత్రుఁడు. ధరణికోట నేలినట్టు గనుబట్టును. ఈ విషయ మెందునను స్పష్టముగ వ్రాయబడలేదు. కాని ఆంధ్రుల చరిత్ర 2వ భాగమున నీతఁడు వెలనాటి ముఖ్యపట్టణమగు ధనదపురి జయించెనని వ్రాయఁబడినది. ఇది ధనదపురి (చందవోలు). ఎట్లయినను యీతడు ధరణికోటనుండి యోరుగంటికి రాజధాని మార్చుకొనినట్లు చెప్పవలసి యుండును. ఈతనికాలము శా॥ ౧౧౨౨-౧౧౮౪ వరకనియును శా॥ ౧౧౨౩ న రాజ్యమునకు వచ్చెననియు కవులచరిత్రయందును శా॥ ౧౧౮౪-౧౨౫౭ వరకని సోమదేవరాజీయమునందు క్రీ॥ 1190-1258 వరకని కృష్ణాడిస్ట్రిక్టు మాన్యూయలునందును వ్రాయఁబడి యున్నది. మఱియు, మోటుపల్లి శాసనమున. * (శ్లో॥ వస్వ్యధికైకాదశీ శతసంఖ్యే క్రోధినామ్ని శకవర్షే మోటుపల్యభిధానస్సోయం కొండపట్టణే మహారాజశ్రీ గణపతిరాజేంద్రస్థాపితశాసనం.॥) అనగా శా॥ ౧౧౬౦ న శాసనమును స్థాపించెనని చెప్పఁబడినది.

కొప్పరగ్రామమున నీతని శాసన మొకటి శా॥ ౧౧౮౭ కాలము నాటిదియును, వేదాద్రినృసింహాలయమువద్ద శా॥ ౧౧౨౫ ప్రభవ సం॥ పుష్య బ౯ నాటిధర్మశాసనమును కనుపట్టుచున్నవి. * త్రిపురాంతకశాసనములో నొకటి శా॥ ౧౧౫౨ నాటిది కలదు. దానిలో నీకాల మీతని ప్రభుత్వకాలమున నగువదిరెండవ యేడని తెలుపఁబడినది. కాన శా॥ ౧౧౨౦ శక మీతని రాజ్యారంభ మనుట నిస్సంశయాంశము.

---

* లోకల్ రికార్డు వాల్యూం. నెం 48 రు 158 పేజి.

* (ఫ్లీటు డక్కను పేజి 282)

ఈతఁడు తన రాజ్యమును దివిసీమ మొదలు నెల్లూరు పర్యం తము వ్యాపింపఁజేసి తన రాజధానియగు నోరుగల్లుపట్టణమునకు (గాం కోస్) చుట్టు కోటకట్టించెను. ఈతని కాలమును గూర్చి కవిజీవితమున శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారు కొంత చర్చించిరి. అందు ముఖ్యాం శము ద్రాక్షారామమునఁ గల యీతనియల్లుని (శా॥ ౧౦౯౮) నాటి శాసనము గలదనుట. విమర్శనీయాంశము లుండినను దీనివలన గణపతి కరిణీకోద్ధారణము నాటికిఁ గలడని దృఢముగఁ జెప్పవలసియుండును.

ఇతని ధర్మములు పూర్వగాథలు.

గణపతిదేవుని దానశాసనము లనేకము లాంధ్రదేశమునం దనేకచోట్లఁ గానవచ్చుచున్నవి. ఈతని పేరున గట్టబడిన "గణపవరము" లను గ్రామములు పెక్కులు గలవు. ఇతఁడనేకాగ్రహారముల నిచ్చెను. కాని దండకవిలె యందుదహరింపబడిన శ్లోకములను బట్టి 44 అగ్రహారము లిచ్చినట్లు కనుపట్టుచున్నది. ౧౦౫౬ వర్షమున గోరంట్ల మొదలగు గ్రామము లిత డిచ్చినట్లు దొరతనమువారి వ్యవహారగ్రంథము (Inam fair registers) లందు వ్రాయఁబడినది. ఈతని యొక్కయు నీతని తమ్ములయొక్కయు ధర్మములనుఁ గూర్చియు వంశ మును గూర్చియు వేరువిధముగ దండకవిలెయందు వ్రాయఁబడినది. అందీ విషయ మంతయు గజపతివంశస్థుఁడగు గణపతిదేవునకు సంబం ధించునట్లు వ్రాయుబడినది. ఈతఁడు కాకతీయవంశజుఁడు. 11-12 శతా బ్దములమధ్య గజపతివంశస్థులలో గణపతి యను రాజుండినట్లు కాని ఆ వంశరాజు లీ దేశము నేలినట్లుకాని యే చరిత్రమును బట్టియు గాన రాదు. మన దేశము గణపతిరాజు (గజపతివంశము) పాలనము క్రింద శా॥ ౧౦౬౦ ప్రాంతములం దుండినట్లును కరిణీకము లుద్ధరించినట్లును పూర్వమునుండి వచ్చుచున్న ప్రతీతిమాత్రముగాక మెకంజీ దొరవారు వ్రాయించిన కైఫియతులందును గలదు. దండకవిలెయందలి గజపతి వంశపు గణపతిదేవుని కాలమునకును, శాసనములు, చరిత్రములు మున్నగువానియం దుదహరింపబడిన కాకతీయగణపతి కాలమునకును అనువ దేండ్లు వ్యత్యయమున్నది. దండకవిలెలోని గజపతివంశపు గణపతి



రాజుకాలము ప్రథమప్రతాపరుద్రునికి సంబంధించుచున్నది. ఏది యెటు లున్నను శా॥ శ. ౧౦౬౦ సంవత్సరమునాటికి కాకతీయగణపతిరాజ్య మునకు రానట్టు లనేక శిలాశాసనములు దృఢపఱచుచున్నవి. కాని దండకవిలెయందు గజపతివంశపు గణపతిని గూర్చిన గాథయు నందుల కాధారముగ లిఖింపబడిన శ్లోకములును, నిష్కారణముగఁ జేర్పబడిన వని నిరసించుట కవకాశము లేకుండుటను బట్టియు, దండకవిలెయం దలి విషయములకును శిలాశాసనము లందలి విషయములకును ముఖ్య ముగ నివ్విషయమున సమన్వయము కుదరకుండుటను బట్టియు కేవల గాథలను బట్టి కరిణీకోద్ధరణము మున్నగు విషయము లిదమిద్ధమని వచింప వీలుగాకున్నది. దీనికి సంబంధించిన దండకవిలె యందలి విష యము మీఁద క్రింద పొందుపఱచబడినది. "కొండవీటికొండపై మొట్ట మొదట కోట కట్టినది విశ్వంభరదేవు. అతని పుత్రులు 1 గణపతిదేవు. 2 బాలభాస్కరదేవు. 3 నరసింహదేవు. 4 విశ్వంభరదేవు. అందు గణపతిదేవుడు శా॥ ౧౦౫౬ న రాజ్యమునకు వచ్చెను. శా॥ ౧౦౬౭ న యీతని మంత్రి గోపరాజు రామప్రధాని కరిణీకము లుద్ధరించెను." అని వ్రాయబడినది. మఱియు.

"శ్లో॥ గజపత్యాన్వయోభూపో గణపత్యవనీశ్వరః
బ్రాహ్మణేభ్యశ్చతుశ్చత్వారింశద్గ్రామపదం దదౌ
అర్కసంఖ్యాకగోత్రాణాం విప్రాణాంచ మహాత్మనాం
షట్త్రింశతి సంఖ్యానా ముర్వీంగణపతిర్దదౌ॥
శ్రీమచ్ఛకాబ్దేరసబాణఖేందుసంఖ్యాప్రవృత్తే ద్విజపుంగవేభ్యః
దండాత్రభా శ్రీమతుదుగ్గిరాలపూడిం దదాత్యాగపరాగతాభ్యః
శ్రీమచ్ఛకాబ్దేరసబాణఖేందు సంఖ్యా ప్రవృత్తే ద్విజపుంగవేభ్యః
గ్రామందదౌ శ్రీగణపత్యభిఖ్యాం వృత్తిప్రయుక్తాన్ గజపత్యధీశః
శ్రీమచ్ఛకాబ్దేరసబాణఖేందు సంఖ్యాప్రవృత్తే ద్విజపుంగవేభ్యః
ముప్పాలపూడీమపిపండితేభ్యో దదౌ పంత్యావహపరాగతేభ్యః
భర్తృత్వవంశార్ణవపూర్ణచంద్ర పరిపాలమార్తాండమహీతలేశః
యత్కల్పయద్గ్రామిమమింథరిత్రీసురరత్నమాచంద్రదివేశతారకం॥
శ్రీవస్త్రతుకపద్మనాభకుశికానందితాహికర్కోటకః
నానుకార్యాదిషుహార్ధనాగవిచదం పండాత్మజానందనం
ధీమంపాండరభీమవిక్రమనిభం శ్రీఖండవాటీశ్వరం

శ్రీ రా రాతిమాహిద్రవజ్రతులితంగతుంతభూపోత్తమం
ప్రాస్వశాకపురీధాత్రిషష్టిత్రిశతసంఖ్యకే
అంబరంగజకర్ణంచ ఖండలీగతపద్ధతా
రసబాణ్యభ్రభూసంఖ్యేప్రవృత్తేశకవత్సరే
ప్రమాధీచాఖ్యవర్షేతు గజపత్యన్వయోద్భవః॥
అర్కసంఖ్యాకగోత్రాణి విప్రాణాంచమహాత్మనాం
అంబరంగజకర్ణంచ ఖండలీ గతపద్ధతా
బాలభాస్కరదేవశ్చ ప్రాస్వశాకపురస్యచ
షష్టిత్రిశతసంఖ్యానాం సుద్విజోగణపతిం దదౌ
వినియోజ్యకృత్వాముప్పాలనామ్నా తత్ఖండవాటికా
దదౌ ద్వాదశగోత్రేభ్యో విప్రేభ్యో ధర్మచింతయా॥

స్వస్తిశ్రీ శా॥ శ॥ ౧౦౯౬ ప్రమాదీచనామ సం॥ న బాలభాస్కరదేవు ఈవని పొలములో ఖండవాటీలు విడదీసి దుగ్గిరాలపూడి అలాహిదాపొదలిమేర హద్దులు చేసి బ్రాహ్మణులకు ౧౨ గోత్రాల వారికి వృత్తులు ౨౨ ఖండవాటీలగ్రామము నిచ్చెను.

ఈవనిపొలం ఖండవాటీలు ౧౯౦ కొలకలూరుపొలం ౧౦-౧౬౦ ఖండలీలు దుగ్గిరాల ఖండవాటిగ్రామమునిచ్చి ఈవని పడమర దుగ్గిరేలకు తూర్పుపొలిమేర కరవేయించినారు. పొలిమేరవెనుక చింతలపూడి కొలకలూరు కూడలినుంచి ఈవని పడమర కొలకలూరునకు తూర్పు కలిసిరాగాను నడుమ దుగ్గిరేలపూడిపొలము చొచ్చివచ్చెను. దుగ్గిరేలపొలముకు తూర్పు ఈవనికి దుగ్గిరేలకు పొలిమేర ఆయెను. పడమర కొలకలూరు దుగ్గిరేలపొలిమేర ఆయెను. దుగ్గిరేలపొలం బిండిపురము అనుకొందురు. ఈ బిండిపురము కునికుంటహద్దునుంచి దుగ్గిరేలపూడికి దక్షిణభాగం కొలకలూరికి ఉత్తరభాగము తుంగభద్ర పడమర గాణేలమెట్టను, కొలకలూరు. ఈవని పెనుమూడి కూడలి కుంటహద్దు. కొలకలూరుపొలం ఉత్తరభాగము ఖండలీలు ౧౦ ఖండవాటిలోను కలిసి ౧౬౧ చేసి దుగ్గిరేలపూడి కొలకలూరు ముప్పాలపూడి పొలిమేరహద్దులు చేసినారు.

ముప్పాలపూడి చినకూరపాటిపొలములోను ఖండవాటీలు చేసి



౧౨ గోత్రాలవారికి బాలభాస్కరదేవు డిచ్చెను. ఈవని గణపతిదేవు ౩౬౦ వృత్తులు బ్రాహ్మణుల కిచ్చెను."

ఇది దండకవిలెయందలి గజపతివంశపు గణపతిని గూర్చి వ్రాయఁబడినయంశము. ఇందలి సత్యాసత్యములను నిశ్చయించుభారము పాఠకమహాశయులకు వదలివేయడమయినది.

కాకతీయగణపతి క్రీ॥ 1244 న ఎగుమతి దిగుమతి సరుకులపైఁగల పన్ను తీసివేసి సముద్రవర్తకులకు మిక్కిలి సాహాయము చేసెను. 1250న త్రిపురాంతకేశ్వరునకు ఉప్పుపన్నును వచ్చునట్లును దానము చేసెను. పాకాలచెరువు (జగడాలముమ్మడి) ను కట్టించెను. మఱియు ననేక పల్లపుసేద్యవసతుల నేర్పరచెను.

* గణపతి దత్త అగ్రహారములు.

"వెల్లటూరు ఆదుమూడి ఓలేరు అనంతవరం నల్లూరు.

కామరాజగడ్డ (ఇందు గుడిసెలోనుండు ముక్తేశ్వరునికి గుడి కట్టించి యీ గ్రామము ౧౦౯౬ శకమున అగ్రహార మిచ్చెను).

నందంపల్లి. దోనెపూడి. పెదకాకాని. చేబ్రోలుకపల్లి. దొప్పలపూడి. పాలడుగు.

చినమక్కెన (శా॥ ౧౦౯౬ ప్రమాదీచ సం॥ మాఘ శు ౧౯ సోమవారమున కాశ్యపగోత్రుడు అంబటిపూడి పెదరామభద్రప్ప సోమయాజుల కిచ్చెను.)

విడుపులపాడు. (శా॥ శ॥ ౧౧౩౧ న మేషసంక్రాంతిని యిచ్చెను.

తూర్పురుద్రవరము. నందివెలుగు. కఠెవరము. ఈమని. తెనాలి. కొల్లిపర. మున్నంగి. దావులూరు. మోటుపల్లి.

గోరంట్ల. (మల్లాది సోమనాధసోమయాజిగారికి శా॥ ౧౦౯౬ ప్రమాదీచ సం॥ న యిచ్చెను.)

దుంబాల. సుద్దపల్లి. అంగలకుదురు.

---

* నలుబదినాలుగగ్రహారములిచ్చినట్లు శ్లోకములవలన గన్పట్టుచున్నను ఇరువదితొమ్మిదిటికి మాత్రమే రెడ్డిదత్తాగ్రహారములని దండకవిలెయందు పేర్లుదహరింపబడినవి. మఱియు నేగ్రామ మేవత్సరములో నెవరికిచ్చినదియు వివరముగానరాదు.

మంచాళ్ల. (శిష్టావారికి అనిమెదరు.)
చివ్వలూరు."

## గణపతిమంత్రులు.

గణపతిరాజు చిరకాలము రాజ్యమేలి బహుదేశములనుజయించి మతివృద్ధిని ధర్మములను నడిపించినవాడు. గణపతిమహారాజుకడఁ బెక్కండ్రు ప్రధానులుండిరి. మంత్రులు (1) జయ (జయన లేక జయసేనాపతి) యుండినట్లును, గణపతిదేవుడు క్రీ॥ 1213 న తామరపురి (చేబ్రోలు) గ్రామ మితని కిచ్చినట్లును యీ మంత్రి చోడేశ్వరాలయము కట్టించి దానికి వెలనాటిలోని మోదుకూరుగ్రామ మిచ్చినట్లును, దాచనప్రగడ గణపయ్య యీతనిక్రింద నొక పాలకుడు లేక యుద్యోగిగ నుండినట్లును,

(2) దుర్గిలో దేవాలయము గట్టిన నామదేవు డొక మంత్రిగ నుండినట్లును ఏన్షెంటు డక్కనునందు జెప్పబడినది.

(3) శివదేవుడను నతఁడు మంత్రిగ నుండినట్లు హిందూమహాయుగమున జెప్పబడినది.

*(1) కొణిదెనశాసనములలో గజసాహిణి భాస్కరదేవుడు గణపతిరాజు యేనుగులబలమునకు సేనాపతిగ నుండినట్లును, (2) మఱియుఁ జోళాన్వయుఁడగు "ఓపిలిసిద్ధి" గణపతిదేవుని యనుగ్రహము పొంది కమ్మరాష్ట్రమును పరిపాలించుచుండెననియును తెలుపఁబడినది. కొణిదెన (కొట్యదొన) యందు గణపతియొక్క గజబలముంపఁబడినట్లు దెలియవచ్చుచున్నది. అచట ఏనుగులదిడ్డి "ఏనుగులమేళ్లగాడి" అను స్థలములచిహ్నములింకను గానవచ్చుచున్నవి. ఈ కారణముచేఁ గాబోలుకొణిదెనను "కోటియేనుఁగులు గల కొండి (కాకతి) గణపతిపట్టణము" అని యచటి జనులు చెప్పుచుందురు.

---

* (1) కొణిదెన చెన్నకేశవస్వామి యాలయ బహిర్ద్వారమున కదుటఁ బడియున్న శిలాశాసనము. (2) కొణిదెన శంకరేశ్వరాలయముమున తూర్పు ప్రాకారపుగోడ కంబడి పొలకాలకు యీశాన్యమున నిలుపబడి యున్న శాసనము.



## గోపరాజు రామమంత్రి కరిణీకము లుద్ధరించుట.

ఆంధ్రదేశమునఁ గల గ్రామముల కరిణీకములను గజపతి వంశస్థుడగు గణపతిదేవుకాలమున నతని మంత్రియగు గోపరాజు రామప్రధాని శా॥ ౧౦౬౭ రక్తాక్షి సం॥ భాద్రపదబ ౩౦ మంగళవారమునఁ గృష్ణయొద్దున సూర్యగ్రహణకాలమున రాజానుగ్రహమున కరిణీకములను బ్రాహ్మణులకిచ్చెనని దండకవిలెయందునును కంజిదారివారు వ్రాయించినగ్రామకయిఫియతులందును వ్రాయబడుటయే గాక పూర్వకాలమునుండి వచ్చుచున్న జనప్రతీతియు నున్నది. దీనికితర చరిత్రలు లేకుండుటచే నిప్పటివారు కొంద ఱీ వృత్తాంత మవిశ్వసనీయమనియు గణపతియొద్ద గోపరాజు రామమంత్రి యనునతఁడు లేడనియుఁ జెప్పుచున్నారు. దీని నిజస్థితిని విచారింపఁ బ్రయత్నింపనీ కరిణీకముల కథ దండకవిలెయందును, దాని ననుసరించిన యొకటి రెండు గ్రంథములయందును దప్పనింకెందును గానరాలేదు. ఇవ్విషయమున బ్రబలతరకారణము లేవియు గన్పింపకఁ జరిత్రకారులకుఁ బలుసందియములు గల్గించుచున్నది. కావున నీ గాథ పుక్కిటిపురాణములలోఁ జేర్చి చరిత్రకారుల వలనఁ బలుకబడుచున్నది.

ఈ కరిణీకోద్ధారణమును దెలుపు శ్లోకములను దండకవిలెనుండి యుదుదహరింపుచున్నాను.

"శ్లో॥ గోత్రశాస్త్రాంబరేందూనాం సంఖ్యాబ్దే శాలివాహనే । గ్రామస్థావరవృత్తీనాం
ప్రథమో గణకాగ్రణీః
శ్రీమాన్గణపతిర్భూపో గజపత్యన్వయోద్భవః । అష్టధాఖండితస్యబహవస్సంతి మంత్రిణః ।
తేషాంశ్రేష్ఠతమామాత్యో యాజ్ఞవల్క్యకులోత్తమోద్విజః । గోపరాజాన్వయోత్పన్నో
రామాఖ్యో గణకాగ్రణీః ।
రక్తాక్ష్యబ్దేమాసిభాద్రపదే బహుళపక్షకే । దర్శేర్కగ్రహణేపుణ్యకాలేంగారక
వాసరే ।
గణకానాంవిహితార్థాయసద్యశ్శాసనాయచ । తిష్ఠతఃకృష్ణమార్తాండయాత్రా
వచ్చరతాం ।
తేషాంరాజానుగృహీతానాం కృష్ణవేణీతటేతథా । గ్రామస్థావరవృత్తీనాంసాక్షి

ణాప్సర్వదేవతాః ।
తస్మాద్ధర్మమిదంసత్యంనిర్మితంయోదురాత్మనాం । కరోతిచేదన్యథాసోஃజాయతే ఖరయోనిషు ।
ఆపస్తంబస్యసూత్రస్యశాఖభేదఃప్రచూచ్యతే । యాజ్ఞవల్క్యేతివిఖ్యాతో గోత్రం కాశ్యపఇత్యథా
విప్రాణాంశాపముద్వేవం వేదబాహ్యశ్చకారయత్ । తచ్ఛశాపనిముక్తిత్వం భానుశక్త్యాద్యపండితః ।
మాఘమాసేసితేపక్షేవిజయేవత్సరేతథా । పంచమ్యాం రవివారేచయాజ్ఞవల్క్య ర్భవోభవత్ ॥ ”

ఈ రామప్రధాని యాజ్ఞవల్క్యుడనియుఁ గాశ్యపగోత్రుడనియు కృష్ణాతీరమున గణపతిదేవుని మంత్రిగ నుండి కరణీకము నుద్ధరించె ననియు నిందువలన గనుపట్టును. కృష్ణాతీర మని యుండుటవలన తత్తీరస్థమగు ధరణికోట యితని రాజధానిగ నుండియుండును.

ఈ కరణికోద్ధారణమును గూర్చి పూర్వపు లోకప్రతీతి ననుసరించి రమారమి యిరువదేండ్లక్రిందట ఊరె వీరభద్రకవి (కర్నూలు జిల్లా త్రిపురాంతక నివాసి) కర్నూలులోని ట్రెజరీ డిప్యూటికలెక్టరు వారగు నరహరికృష్ణమ్మసెట్టిగారిపైఁ గృతినిడి యేకాశ్వాసము నొక ప్రబంధమును "కరణికోద్ధారిణి" యను పేర వ్రాసెను. అందిట్లున్నది.

"కళింగదేశపురాజగు గణపతిరాజు మంత్రియగు గోపరాజు రామమంత్రి తిరుపతియాత్ర కేగి తిరిగివచ్చునపుడు మాదల యను గ్రామమున నొక విప్రునింట విడిసి యా నాడీ మంత్రియింట నాబ్దికము తటస్థింప నా యింట బ్రాహ్మణుని నిమంత్రణమునకు నియమించెను. ఆ బ్రాహ్మణుఁడు దొరతనమువారికి పన్నుకట్టవలసియుండి కట్టనందున నా గ్రామకరణమగు విశ్వబ్రాహ్మణు డీతనినిఁ బిలిపించి పన్ను కట్టనందున దండనార్థమై చావడియందు బండకొయ్య వేయించెను. నిమంత్రణకు రావలసిన యా బ్రాహ్మణుఁ డెంతకు రానందున నీ మంత్రివగుఁ డరసి యిది యంతయుఁ దెలిసి ప్రస్తుత మాతనిని బంపి పితృకార్యానంతరము నిర్బంధింపుమని వర్తమాన మంపియు నతడు విననందునఁ దానునేఁబోయి చెప్పియుఁ దుద కాకారణమువలన నిరసింపఁ



బడెను. అందుల కాతఁ డలిగి యానాఁడెట్లో తన కార్యము నెరవేర్చుకొని యిది మదినిడుకొని కొండొక కాలమున సూర్యగ్రహణసమయమున స్నానమునకు రా జేగుతరి పురోహితు లెవరును రాకుండఁ జేసి తాను మాత్ర మేగెను. సంకల్పము సెప్పుటకుఁ బురోహిత బ్రాహ్మణు లేరి యని రాజడుగ "విప్రు లెవరును రారైరి. నేను బ్రాహ్మణుఁడను పురోహితకృత్యము నెరవేర్తు" నని రాజు నొడంబరచి తాను సంకల్పము సెప్పి రాజువలన నేడు గడియలు ముద్రాధికారము తన కిమ్మని వేడి యుదకము విడిపించుకొనెను. పిదప నాతఁ డేడు గడియల కాలము ముద్రాధికారము వహించి యా కాలమునఁ బెక్కు గ్రామముల కరిణీకములు బ్రాహ్మణుల కిచ్చెను" అని యున్నది. దండకవిలెలో నీ విశ్వబ్రాహ్మణుని కథ లేదు. దీనికి మూల మేదియో తెలియరాదు.

గణపతి స్నానకాలమున రామమంత్రి చెప్పినపద్యములు.

స్నానకాలమున రా జీతనిని సంకల్పముఁ జెప్పి దానము పుచ్చుకొను నధికారము నియోగివిను మంత్రివగు నీకు లేదని వాదింప నితఁడు సమాధానములతో రాజు నొప్పించెననియు నప్పు డితఁడు కొన్ని పద్యములు సెప్పెననియు వాడుక గలదు. వాని నిందుదహరింపుచున్నాను

ఉ॥ మానఘనుండు బ్రహ్మకులమండనమూర్తి పరోపకారి దు
ర్దానము రాన్నముల్ గొనఁడు తప్పదుస్వామిహితైకకార్యముల్
దీనులఁ బ్రోచు బాంధవవిధేయుఁడు డస్సియు వేదఁబూన డిం
పూనినభక్తితోడుత నియోగికొసంగిన దాన మల్పమే॥

ఉ॥ వ్రాయుటదోసమా? వికృతివైదికమా? సుతదారరక్షణో
పాయముకై నియోగినయి పార్థివసేవయొనర్చునంత నే
పాయునె వంశశీలములు బాగుగ మున్నల చిత్రగుప్తులుఁ
వ్రాయరె యెల్లలోకములవారలు సేసిన పుణ్యపాపముల్ ॥

చ॥ కవి క[ల]లాసనుండు త్రిజగత్పతియైన పినాకపాణియుఁ
గవియె; తలంపగాఁ గవులుగారె పరాశర బాదరాయణుల్
కవికృతపుస్తకగ్రహణగర్వితు లల్పులు పూజనొందగా

కవులట; పూజపాత్రములుగారట! యిట్టివెపో విచిత్రముల్॥

ద్వాత్రింశన్మంత్రిచరిత్రమున నీ విషయ మిట్లున్నది.

"సీ॥ గణకనిర్వాహంబుగల్పించెనూరూరమహీంగోపరాజు రామప్రధాని"

ఇదిగాక

"క॥ ధర గోపరాజు రామన । కరణీకములుద్ధరించు కాలమువలనన్ । గి
రిబుతు గగన శశాంకులు । కరణముప్పు శకమునాటి కాలంబయ్యెన్"

అని యొక చాటువును గలదు.

ఈ విషయము "ఆంధ్రులచరిత్ర మధ్యమయుగము"నం గొంత కలదు. ఈ గాథలలో విమర్శనీయములగు నంశములు జాలంగలవు. గ్రంథవిస్తరభీతి నట్టివనిక్కిం బూనక విడిచిపెట్టితిని. ఆంధ్రచరిత్రకారుండు పలికినట్లీ విషయము భావిపరిశోధనలవలనంగాని వెల్లడియంబడదు.

ఈ కరణీకము లిచ్చినవారికి ప్రతిగ్రామమునను వేతనార్థమై భూజీవనము లీయబడెను. వీనికి * ఖండలీ యని పేరు. రామప్రధాని. యిట్లు అయిదునూర్ల ముప్పదైగు గ్రామముల కరణీకము లిచ్చెనని దండకవిలెయందు వ్రాయంబడి, విశేషగ్రామముల పేళ్లును, ఇయ్యబడినవారి గోత్రము, సంప్రతి, ఇంటిపేరు మొదలయినవికూడం జేర్పబడినవి. ఆ వివరమీ గ్రంథమున కనుబంధముగం జివరం జేర్చినాండను.

రుద్రమ్మ దేవి.

గణపతిదేవుని పిదప రుద్రమ్మదేవి రాజ్యమునకు వచ్చి "కాకతీయ రుద్రదేవమహారాజు" అను బిరుదపదముతో రాజ్యమేలెను. స్త్రీలు రాచరికము సేయునపుడు పురుషనామమును వహించు నాచారము మన దేశమున గలదు. ఈయమ క్రీ॥ శ॥ 1261-1291 లేక క్రీ॥ శ॥ 1260-1288 లేక 1295 వరకు రాజ్యమేలెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈమెయు గణపతిదేవునివలె ననేక దానములు చేసి శాసనాదులు వేయించెను. తనపరిపాలనమున రాజ్యమునకుంగాని ప్రజ

(ఈ కొలతపరిమాణములు "పూర్వపుభూమికొలతలు" అను భాగమున వ్రాయబడినవి).



కుగాని యేలోపములును రాకుండ నీ సాధ్వీమణి ధర్మమార్గమునం బాలించెను.

ఈమెకడ గన్నమనాయండు సేనాపతిగ క్రీ॥ శ॥ 1268 వ నుండి నట్టును, యీమెకాలమున గుడిమెట్టలోని కోట సాగి పోతరాజుచే కట్టబడినట్టును ఏన్షాంటు డక్కను గ్రంథమున వ్రాయంబడినది. వేములవాడ భీమకవి "హాయుమదిసీత" యను తిట్టుపద్యము నీ పోతరాజును గూర్చియే చెప్పియుండినట్లు తోచుచున్నది.

రుద్రమదేవి గణపతిదేవుని కూతురా? లేక భార్యా? అను సంశయ మొకటి బాధించుచున్నది. ఏలయన; ఈమె కాలమున నిచటికి (మోటుపల్లి) వచ్చిన యొక విదేశీయ బాటసారి యీమె పాలనమునుగూర్చి పొగడుచు "గణపతిదేవుని భార్యయగు రుద్రమదేవి భర్తవలెనే చక్కగ పాలించుచున్నది" అను మొదలగు వాక్యములు వ్రాసెను. ఈ వాక్యములు కృష్ణాడిస్ట్రిక్టు మాన్యువలునందు వ్రాయంబడినవి. ఇందువలన భార్యయని రూఢియగుచున్నది. * మల్కాపుర శాసనమున "రుద్రదేవీసముదభూత్కారుణ్యాత్సర్వభూభృతాం। గంభీరాన్మహత స్తస్మా ల్లక్ష్మీ రత్నాకరాదివ" (రత్నాకరునందు లక్ష్మియుదయించినట్లు గణపతిదేవునికి రుద్రమదేవి జనించెను అని వ్రాయంబడినది.) ఆర్యవట శాసనము 22 వ శ్లోకము "పితర్యుపరతే తద్వదరి...దక్షలా...క్షితిం। ...రుద్రమదేవీతి మహితా మహితా గుణైః" (తండ్రిపోయినవెనుక పేరరుద్రమదేవి యనుగుణమహితురాలైన యాతని పుత్రిక తండ్రివలెనే పాలించెను) అని వ్రాయబడి యున్నది. ఈ రెంటిలోను దేనిని గ్రాసి వేయుటకును సాహసింపంగాలము గాని ముఖ్యముగ శాసనమునే. విశ్వసింపవలసియుండును. ఏలయన; బాటసారి విదేశీయుండై యుండుటవలనను, రాజుభార్య పేరును రుద్రమదేవియెయై యుండుటవలన విచారించుటలో ప్రమాదము నొంది యుండవచ్చును. ఆర్యవట శాసన మీకాలమునకు నూరేండ్లనాపుడి కావున శాసన విషయమే నమ్మదగినదిగా నుండును. ఈ రుద్రాంబ రాజ్యకాలమున వితంతువై

* (ఆంధ్రభారతి 8 వ సంచిక 1912 సం॥ నవంబరు డిసెంబరు నెలలవి-244 పుట)

యుండును. ఈమె భర్తపేరు తెలియరాదు. కావునఁ బైనజెప్పబడిన బాటసారి వితంతువని వ్రాసి గణపతిభార్యయని భ్రమపడినట్లు చెప్పవలసియుండును. ఈమెకు ముమ్మడాంబ యొక్కతయె కూతురు. కాన యీమె యను తన కూతురి కొమరుకు ప్రతాపరుద్రునికి రాజ్యమిచ్చెను. ఈమె కాలమునాటికి రాజ్యము దీవిసీమ మొదలు నెల్లూరు పర్యంతము విస్తరించి యుండెను. ఈమె కాలమునాటి విశేషము లేవియుఁ గానరావు.

## రెండవప్రతాపరుద్రుడు.

ఈతఁడు రుద్రమదేవికి దౌహిత్రుఁడు. ఆమెకు పిమ్మట రాజ్యమునకు వచ్చినవాఁడు. ఇతనికి "కుమారరుద్రదేవమహారాజ"ని బిరుదముండెను. ఇతనితల్లి ముమ్మడాంబ. తండ్రి మహాదేవుడు. ఈ ముమ్మడాంబ రుద్రమ్మదేవి కూతురు. అని ప్రతాపరుద్రీయమునఁ గలదు. ఇతఁడు రుద్రమదేవి కొమారుడు. (గణపతిదేవుని దౌహిత్రుడు) తల్లి రాజ్య మితనికి వచ్చెనని మఱియొక వ్రాతగలదు. తురుష్కులదాడిఁ బడఁజాలక రాజధానిని ఓరుగల్లునకు మార్చెను. కాని తురుష్కులవలన పలుమారు బాధకలుగుచు వచ్చినను తన బలసామర్థ్యమువలనను మంత్రియగు యుగంధరుని ప్రజ్ఞావిశేషమువలనను వారిని లెక్కగొనకుండెను. కాని యిత్యడు మోసకృత్యమువలన (క్రీ॥ 1323 ఏప్రిలు నెలలో) మహమ్మదీయులవలనఁ జెరగొనబడి ఢిల్లీకి గొనిపోఁబడెను. పిదపఁ ద్రికాలజ్ఞుఁడగు మంత్రి యుగంధరుడు కపటవేషధారియై ఢిల్లీకిఁబోయి కొన్ని యుపాయములతో నాతని చెర విడిపించుట యేగాక ఢిల్లీపాదుషాను నావపైనుంచి చెరగొనివచ్చెను. ఈతని యశమును విని విద్యానాథుఁడను నొక కవి ప్రతి శ్లోకమునందును ప్రతాపరుద్రునిపేరు వచ్చునట్లు "ప్రతాపరుద్రీయ"మను పేర నొకయలంకారశాస్త్రమును వ్రాసి ఓరుగల్లున కీతనిని దర్శింపఁబోవుచుండ మార్గవశమున నడవిలో మహమ్మదీయుల చెరలోనుండి [illegible] యాతనితో గ్రంథరచనవిషయమై ప్రసంగించుట సంభవించెను. రాజు తానె ప్రతాపరుద్రుడనని తెలుపక ప్రసంగింపుచు "ఇపుడు ప్రతాపరుద్రుడు కారా



బద్ధుడయ్యెను. నీ వా గ్రంథమును మఱియొకరి కంకిత మీయరాదా" అని యనగా నాతడు దుఃఖించి విసుగుపడి గ్రంథమంతటను వానినే తగులబెట్టితినే, నేనీ గ్రంథము నెట్లు దిద్దుదును, దీని నేమిసేతును" అనెను. అప్పుడు రాజును దుఃఖించి "అయ్యా నేనే ప్రతాపరుద్రుడను. కాలగతివలన నిట్లు చెరగొనబడితిని. నీ వీ యుంగరమును గొని వెచ్చించి జీవనము చేయుచుండుము. దైవకృపచే నేను తిరిగివత్తునేని నీకృతిని గొనియెద" నని చెప్పి రత్నాంగుళీయకము నీయగా నతడు గొనిపోయి జీవనము చేయుచుండెను. తరువాత నతఁడు చెరతప్పించుకొనివచ్చి సింహాసనస్థుఁడై కృతినందికొని కవికిఁ గనకాభిషేక మొనర్చెనట. *

యుగంధరుడనువాఁ డొకడు ప్రతాపరుద్రుని కడమంత్రిగ గలడాయనియు పై కథయంతయు నవిశ్వసనీయమనియు కొందఱనుచున్నారు. ఇందుకుముఖ్యకారణమేమన, ప్రతాపరుద్రునికాలముననో, యాతనికి పూర్వమో యుండిన వారిలో నెవరికో "మంత్రియుగంధరా" అను విశేషణ ముపయోగింపఁబడెనట. ఇదిగ్గాక నీయుగంధరునిఁ గూర్చిపూర్వ గ్రంథములందెచటను గూడ యుదహరింపబడి యుండ లేదు. గావున నీగాథ సంశయాస్పదమై వివాదాంశములలో జేర్పదగియున్నది.

ఈ ప్రభువుకడ శివదేవుడను మరియొకమంత్రి యుండెనని తెలియుచున్నది. ఈతడుండినది ప్రథమప్రతాపరుద్రునికడనో లేక ద్వితీయ ప్రతాపరుద్రునికడనో తెలియరాదు. కాని గణపతికాలమునుండి యుండెనన్ని హిందూ[illegible]యుగమున వ్రాయబడినది ఈతనికడ ఎల్లారెడ్డియను నతడు సర్వాధికారిగనుండెనని ఏన్షెంటు డక్కన్ అను గ్రంథమున లదు. విద్యానాథుడను నతఁడు ప్రతాపరుద్రుని యాస్థానకవి.

ఈతని దానశాసనములు పెక్కులు పెక్కుగ్రామముల దేవాలయముల యందు శిలలపై గనుపట్టుచున్నవి. ఇందువలన నీతఁడు ధర్మ

* ఈ కథ బ్ర. వేదము వెంకటరాయ శాస్త్రులవారు రచించిన నాటకములోనిది. ఇది చరిత్రకు సంబంధింపకున్నను చదువ హృద్యముగనుంటచే నిచట పొందుపఱచినాడను.

పరిపాలనము గలిగి గొప్పదాతయై యుండినట్లు గనుపట్టుచున్నది. ఇతఁడు క్రీ॥ 1295-1323 వరకు పాలించెను. శాసనాదులును యీ కాలమునకె సంబంధించుచున్నవి. ఓరుగల్లునకు రాజధానిని మార్చినది యితఁడే యని చెప్పుటవలనను, ఇతని కాలమున రాజ్యభ్రష్టత్వము కలిగినందువలనను జయినుల శాపము లిప్పటికిఁ బూర్తిగఁ దగిలెనని దండగవిలె లోనికొన్ని వాక్యములు చెప్పుచున్నవి. కాని రాజధాని నోరుగంటికి మార్చినది యితనిపూర్వులే. జయినులితని కాలమునఁ బూర్తిగ నశించిరి. ఇతఁడు శత్రువులచే మొదలఁ జెరగొనఁబడి మరల రాజ్యపదవినందినను తురుష్కుల దాడికి వెరచి వారితో సంధిచేసికొని రాజ్యవిస్తీర్ణము తగ్గించుకొవలసివచ్చినది. ఇతని పిమ్మట నితని కొడుకు (వీరభద్రయ్య లేక కృష్ణనాయకుడు) అసమర్థుఁడై రాజ్యపాలనమును నెరవేర్చ లేకపోయినందున దేశము చెల్లాచెదరై పరరాజుల రాకకవకాశమిచ్చుచు వచ్చెను. అందువలన నీ వంశమువా రంతట నంతరించిరి.

పిదప మహమ్మదీయులును విస్తారకాలము నిలువలేకపోయిరి. రాజ్యము రెడ్డిరాజుల పాలయ్యెను.

---



## నాల్గవప్రకరణము.

### రెడ్డిరాజుల మూలపురుషుడు.

రెడ్డిరాజుల వంశమును గూర్చియు మూలపురుషుని గూర్చియు నీ క్రిందివిధమున దండకవిలెయందు వ్రాయఁబడినది.

"రెడ్డిరాజులలో మూలపురుషుఁడగు దొంతి అల్లారెడ్డి యను పంటరెడ్డి కులజుఁడు (నైజాము రాజ్యములోని) "చదలువాడ" గ్రామమునఁ గృషిచేయుచుండగ నొకనాఁడు ధనము దొరకెను. దాని నపహరించవలయునని కొందఱు ఘాతుకులు యత్నింపగా నారాత్రి తన యిష్టదైవమగు శ్రీ (చదలువాడ) వీరరాఘవస్వామి స్వప్నంబునఁ బ్రత్యక్షమై తక్షణ మీ యూరువదలి దండనాధకాయలుగల స్థలమునఁ జేరుమని చెప్పగా నతఁడు తక్షణమే బయలుదేరి సంసారముతో పానుగొండ (నైజాము రాజ్యములోనిది) ప్రవేశించెను. అంతట నొక సువర్ణవీరరాఘవ విగ్రహమును చేయించి పూజించుచుండెను. ఇట్లుండ నతఁడు ప్రబల ధనవంతుఁడై యుండి శా॥ ౧౦౮౭ (క్రీ॥ 1165) తారణ సం॥న పానుగొండ విడిచి కొండవీటిసీమ (కుండిన) లోని కవులూరిలోను, ధరణికోటలోను మేడలుగట్టి గొప్ప రహితయి (కృషివరుడు) యతిథి యభ్యాగతులఁ బూజింపుచు ధర్మవంతుఁడై యుండెను.

శ్లో॥ శ్రీమచ్ఛకాబ్దే ఋషినాగఖేందు (౧౦౮౭)
సంఖ్యాప్రవర్తే సతితారణాబ్దే
అల్లాడభూపో నుముగొండదేశే
దొంత్యాన్వయో కుండినరాజధాని".

పై శ్లోకమునకు "ఋషివార్ధిరుద్ర" అని పాఠాంతరము గలదు. అట్లయిన ౧౧౪౭ శకవర్షమగును. రెంటి సంవత్సరములును తారణలే. ఇందేది యథార్థమో తెలియరాదు. రెడ్డిరాజులు శైవమతావలంబులు.

* క్రీ॥ 1225 సం॥రములో దొంతి అల్లారెడ్డి ధరణికోటయందు దుర్గాధ్యక్షుడై యుండెను. తరువాత ప్రోలయ వేమారెడ్డి ధరణికోట యుద్ధ ప్రతాపరుద్రుని యోడించి తాను స్వతంత్రరాజునని ప్రకటించు

* ఏన్షెంటు దక్కను గ్రంథము.

కొని కొండవీడు ప్రవేశించి అచట పుట్టకోటకట్టి క్రీ॥ 1320-81 వరకు పాలించెను.

స్పర్శవేది.

ఒకనాడు (కవులూరులోనో లేక ధరణికోటలోనో తెలియరాదు) కోమటి వేమన యను వైశ్యుఁడు అతిథియై వచ్చెను. అప్పుడీ రెడ్డి వానికి భోజనపదార్థములిప్పించిన, కోమటివేమన సంతసిల్లి తాను వింధ్యాద్రియందు యోగీంద్రుల కృపవలన సంపాదించిన స్పర్శవేది (philosaphers' stone) నొక గుడ్డనుగట్టి యొకచోటనుంచి వంటచేసికొనుటకుఁ బోయెను. అట్టితరి నట్టిలో స్పర్శవేది, అందలి యొక యినుపముక్కకుఁ దగుల నది బంగారముగ మారెను. దానిఁగాంచి రెడ్డి, అటఁ బరుసవేదియుండుటెఱింగి దానిఁ గైకొననెంచి యాచట నా యతిథి వదిలపెట్టిన స్పర్శవేదిని రహస్యముగఁ దీసికొని తనయింట దాచి, తొలుత పరుసవేదియుండిన యింటిని తగులఁబెట్టెను. పాపము! కోమటివేమఁడా రెడ్డియిల్లు తగులఁబడుట విని తన స్పర్శవేది పోయెనని తలఁచి వచ్చి దుఃఖించి "బహుకష్టముల ననుభవించి సంపాదించుకొనివచ్చిన స్పర్శవేది యగ్గిపాలయ్యె. ఇఁక నేను జీవించిన ఫలమేమి? ఎట్లు జీవింపఁగలను?" అని వగచి తాను నా నిప్పులంబడి మృతుఁడయ్యెను.

అది జరిగిన నాటిరాత్రి స్వప్నమున రెడ్డికి కోమటివేమన ప్రత్యక్షమై "నేను కష్టపడి సంపాదించిన స్పర్శవేదిని హరించి యిట్లు కపటము పన్నితివి. స్పర్శవేది భూగతమగునట్లును, నీ వంశము నాశనమగునట్లును శపింపఁగలను; కాని నీవు నన్నాదరించుటవలన నీయెడ దయ కలిగె. ముందు నీ వంశజులగువారు నూరేండ్లు రాజ్యము పాలింపగలరు. నీ వంశమునఁ బుట్టినవారికెల్లరకు నా పేరు బెట్టించి వారు చేయు ధర్మములన్నియు నాకర్పణములు సేయవలయును" అని యానతిచ్చెను. అందువలననే రెడ్డిరాజులందరి నామములతో "వేమ" శబ్దము కలియుచున్నట్లు తోఁచుచున్నది. ఈవిషయము మనదేశమునఁ బ్రసిద్ధముగ వాడుకగానుండుటయేకాక దండకవిలెయందును వ్రాయఁబడినది.



ఇవ్విషయమును గురించి ఆంధ్రులచరిత్ర 3 భాగమునందు కొంత వ్రాయఁబడినది. ఇది కేవల కల్పితకథయని తద్గ్రంథకర్తగారు తీర్మానించిరి. అందుకు వారెద్దియు నాధారము జూపియుండలేదు. నమ్మఁగూడదని యసందర్భము లెవ్వియుఁ గానరావు. నమ్మకుండుటకు స్పర్శవేదియనునది ప్రపంచమందు లేనేలేదనికదా చెప్పవలయును? ఈ దిగువ నుదహరింపఁబడిన కొన్ని దృష్టాంతములనుబట్టి ప్రపంచమున స్పర్శవేది యుండినట్లు కనుపట్టుచున్నది.

(1) నేపాళమునందు ప్రభువు మేకల గొఱ్ఱెల కినుపనాడాలు కొట్టించి హిమవత్పర్వతమునందు ద్రిప్పి తిరిగివచ్చినపిమ్మట నా గొఱ్ఱెల నాడాలు తీయించగా నందు బంగారముగుపడెననియును, ఆ దేశమున నొకచోట స్పర్శవేదిమణిమయమగు లింగమొకటి కలదనియుఁ గొందఱు పెద్దలు చెప్పుచున్నారు.

(2) శ్రీ శంకరాచార్యులవారు శతశ్లోకియందు:

"శ్లో॥ దృష్టాంతో నైవదృష్టస్త్రిభువనజఠరే సద్గురోర్జ్ఞానదాతుః
స్పర్శశ్చేత్తత్రకల్ప్యస్స నయతి యదహో స్వర్ణతామశ్మసారం
న స్పర్శత్వం తథాపి శ్రితచరణయుగే సద్గురుస్స్వీయశిష్యే
స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమస్తేన వాలౌకికోపి॥"

ఈ శ్లోకమునందు స్పర్శవేది తననుఁ దగిలినదానిని బంగారు చేయఁగలదను భావము గనుపట్టును.

(3) హరివంశము. ఉత్తరభాగము. ఆ॥ ౭ న, "తే॥ పరుసవేది సోకుటయును బరుసలోహ । మధికశుద్ధసువర్ణము నైనపోల్కి."

(4) వేమనపద్యములందు,

"ఆ॥వె॥ భాగ్యహీనునకును బరుసవేదొరుకక
నదియు నిలువదెపుడు వదలుఁగాక
వానతోడఁగన్ను వదగఁగొల్లు నిల్చునా
విశ్వదాభిరామ వినురవేమ॥"

(5) బ్రౌనుదొరగారి నిఘంటువున నీశబ్దమునకు "బంగారునేయు మణి" అని వ్రాయబడెను. ఇట్టి యుదాహరణము లనేకములుం గలవు. అవియన్నియు పరుసవేది కలదనియు, నది మానవునకు లభ్యము

గునదేయనియు జెప్పుచున్నవి. మఱియు నీక వేమన విషయముననే నమ్మరాదో; స్పర్శవేదియునికినే నమ్మరాదో; ఆంధ్రచరిత్రకారుని యభిప్రాయము తెలియుటలేదు.

వేమన యరణ్యసంచారము చేసి యోగియై యోగుల కృపవలన నట్టిమణిని సంపాదించుట చిత్రమా? దానిని సంసారియగు రెడ్డి హరింపఁ బ్రయత్నించుట చిత్రమా? ఇందు కల్పితమెయ్యదియో, అసందర్భమెయ్యదియో తెలియరాదు. "కోమటి"యనియు "వేమ"యనియు పేర్లు రెడ్డివంశజుల కేలవచ్చెనో? స్పర్శవేదివిషయ మసత్యమని వాదించు చరిత్రకారులు తప్పక నిర్ధారణ చేయవలసియున్నారు. అటులేని కొంతసందియము తొలఁగెడిది.

వేమన పద్యములను (4035) చెప్పి (బాదరు) శ్రీ రామవరపు పూర్ణయాచార్యులుగారు ప్రకటించిరి. ఆ గ్రంథమునందు వారు యోగియగు వేమన రెడ్డిరాజులలోని రాచవేమారెడ్డికి తమ్ముఁడని వ్రాయుచు నందు రెడ్డిరాజుల వంశవృక్షమును స్పర్శవేది వృత్తాంతమును వ్రాసియున్నారు. అందు స్పర్శవేది రెడ్డిసంబంధమనియు, నది యతఁడు శ్రీశైలమున సంపాదించెననియు వ్రాసిరి. కాని యందుకుఁ బ్రమాణ మొద్దియు వివరింపరైరి. శ్రీశైలమందుఁగూడ స్పర్శవేదికలదని కొందఱు చెప్పుచున్నారు.

### రెడ్డిరాజుల వంశము—కాలము.

రెడ్డిరాజులవంశపు ప్రధానపురుషుఁడు మొదలుకొని ప్రభుత్వాధికారము వహించినవానివఱకుగల ప్రముఖులవృత్తాంతము లెవ్వియుఁ దెలియఁబడవు. ప్రభుత్వమునకు వచ్చినవానియొద్దనుండి వారిస్థితిగతులను దెలిసికొనఁదగు నాధారములుమాత్రము కొన్ని కలవు. దండకవిలెయందీ రెడ్డిరాజవంశమువారికి మూలపురుషుఁడు "దొంతి అల్లాడరెడ్డి" యని మాత్రము వ్రాయబడినది. అందువలన నల్లాడరెడ్డి మొదలు ప్రోలయవరకును వంశక్రమము తెలిసికొన నాధారములేదు. అల్లాడరెడ్డి మొదలు ప్రోలయవరకుగల కాలము రమారమి నూరేండ్లకు మించియుండును. ఈ మధ్యకాలమున నిరువురు ముగ్గురికన్న నెక్కువమంది



పురుషులుండరు. రెడ్డిరాజుల వంశవృక్షము లింతకుఁబూర్వము శ్రీ జయంతి రామయ్యపంతులు, బి.ఏ., బి.యల్., గారిచేతను, ఆంధ్రుల చరిత్రమునను, వేమన పద్యములం (వేమనసూక్తిరత్నావళి) దును ప్రకటింపఁబడియున్నవి. వేమనసూక్తిముక్తావళి రెడ్ల వంశావళి విషయమునఁ దక్కినవాటితో భేదపడుచున్నది. తక్కిన చరిత్రకారుల యభిప్రాయములును కాలమువిషయమున నేకీభవింపక భిన్నములుగా నున్నవి. ఆ వివరమంతయు నిందు వంశవృక్షములతోఁగూడ వివరింపఁబడినది. శాసనములందును, గ్రంథములందును నాకు దొరికినంతవరకుఁగల యాధారములతో రెడ్డిరాజవంశజుల వంశక్రమమును కాలమును తెలియఁజేయుచుఁ దక్కినవారికిఁగల యభిప్రాయభేదములను నిందు సంగ్రహముగ సూచించుచున్నాను.

వీరి యింటిపేరు దొంతివారని దండకవిలెయందు గలదు. ఈ వంశమువారిలో మొదటిరాజగు ప్రోలయ వేమారెడ్డి కంకితమీయఁబడిన హరివంశమున దేసటివారని వ్రాయఁబడినందున దొంతివారనుట తప్పని ఆంధ్రులచరిత్రయందు చెప్పఁబడినది. గ్రంథములందుఁ బేర్కొనబడినవానినిఁబట్టి యాతనికిఁ బూర్వము గతించిన తరములవారందరి యింటిపేరును యిట్లే యుండవలయుననియు, వేరొండువిధమున నుండదనియు నభిప్రాయపడుట సరికాదని నాయభిప్రాయము. వీరి మూలపురుషుఁడగు అల్లాడరెడ్డి యింటిపేరు దొంతివారియనుటకు నతని గాథలు దెల్పు గ్రంథములు దండకవిలెకన్న వేఱుగ లేనందున వ్రాతమూలకముగు నితరదృష్టాంతరములు దొరకలేదు; కాని చదలువాడ చుట్టుప్రక్కల పంటరెడ్లు దొంతివారు కలరనియు, వారందరును మా పూర్వులు ప్రభువులని చెప్పుకొనుచున్నారనియు, దొంతియనుగ్రామముగూడ చదలువాడవైపున గలదనియు నచ్చటివారు చెప్పుచున్నారు. తరములు గడచినకొలది యింటిపేళ్లు వారివారి గ్రామములనుబట్టియు, ప్రసిద్ధులగు పురుషులనుబట్టియు మారుట స్వాభావికము. ఇంటిపేళ్లకు తిక్కన యజ్వాగారింటిపేళ్లు మార్పులగుటయే ప్రమాణము. అటులనే వీరింటిపేరు దేసటివారని మారియుండును.

# రెడ్డిరాజులవంశవృక్షము.






# రెడ్డిరాజుల మాతామహవంశము.

దొడ్డయ (I ప్రభువగు పోలయ వేమన మాతామహుండు).






| ప్రభువు | | శ్రీ జా॥ రామయ్యగారు. | ఆం॥ చరిత్ర. | సూయల్ దొరవారి గ్రంథమునందును వేమనపద్యములందును. | దండకవిలె ప్రకాశము (ప్రజాపత్రిక 28-7-1918) |
|---|---|---|---|---|---|
| I | శ్రీ॥ | 1320-1349-(30) | 1324-1350-(26) | 1328 1339 | 1320-1331-(12) |
| II | ,, | 1350-1361-(12) | 1350-1362-(12) | 1339-1369 | 1332-1361-(30) |
| II | ,, | 1362-1377 (16) | 1362-1380-(18) | 1369-1381 | 1362-1373-(12) |
| IV | ,, | 1378-1398 (21) | 1380-1400-(20) | 1381-1395 | 1374-1387-(14) |
| V | ,, | 1399-1415-(17) | 1400-1420 (20) | 1395-1428 | 1388-1415-(28) |
| VI | ,, | 1416-1419-(4) | 1420-1424-(4) | 1423-1427 | 1416-1419-(4) |

ఇందు సూయలుదొరవారి గ్రంథమున II అనవేమన III అలియవేమన అని యున్నది.

## ప్రోలయ వేమారెడ్డి.

కాకతీయ భూపతులయొద్ద "ప్రోలయ" అనునతఁడు సేనాధ్యక్షుఁడుగ నుండెను. కాకతీయులలోఁ గడపటివాఁడగు ప్రతాపరుద్రుఁడు తురుష్కులకుఁ జిక్కినయనంతర మీతఁడు తన సామర్థ్యమువలన దేశము నాక్రమించుకొని పాలింపఁ గడంగెను. ఈ రెడ్డిరాజులలో సింహాసనాధ్యక్షతను వహించిన వాఁడు పోలయకుమారుఁడు పోలయ వేమారెడ్డి. ఇతనికి ఎఱ్ఱాప్రెగడకవి తన హరివంశము నంకితమిచ్చెను. ఆ గ్రంథమునం దీ రెడ్డిని "దేసటి వేమా" అని కవి పేర్కొనియున్నాఁడు. ఈతఁడు అన్నముకుమారుఁడగుటచే అన్నమ్మ వేమయ యనియుఁ వేమయ యనియు బిలువబడెను. ఇతఁడు ప్రథమమున అద్దంకి రాజధానిగఁ జేసికొని రాజ్యపాలన మొనర్చినట్లు హరివంశమువలనఁ దెలియుచున్నది. ఇదిగాక నీ వేమారెడ్డి శా॥ ౧౨౬౭ పార్థివ సం॥ చైత్ర శు ౧గిన కృష్ణాతీరముననున్న ఆతుకూరునకు వేమాపురమని పేరిడి యిచ్చిన శాసనమువలనను గనుపట్టుచున్నది. తరువాత కొండవీటికి రాజధానిని మార్చుకొనెను.

ఈతఁడు ధరణికోటయొద్ద ప్రతాపరుద్రుని జయించి తాను రాజనని ప్రకటించి కొండవీటికి వచ్చి పుట్టకోటను తిరిగి కట్టించి క్రీ॥ 1320-31 వరకు రాజ్యమేలెనని ఏన్షెంటు డక్కను 306 పుటయందు వ్రాయబడినది. కానఁ గొండవీడు రెడ్డిరాజులకుఁ బూర్వమే రాజధానిగ నుండె ననుట యొప్పిదము. ఇతఁడు కొండవీటికిఁ జేరినతరువాత నచటఁ బూర్వము గజపతివంశజులచేఁ గట్టింపఁబడిన కోటలు మరమ్మతులు చేయించెను. దుర్గమున కీశాన్యమునఁ గల రుద్రపాదపర్వతము (ఆవం మఫీకొండ)పై "కైలాసరాయఁడ"ను పేర శివాలయము గట్టించెను. మఱియు బొల్లుమారి వేంకటేశ్వరుని కొండదిగువనున్న విశాలస్థలము పూర్వము భీష్మకరాజు వసించిన కుండిననగర ముండినప్రదేశ మని విని తానుగూడ నచ్చట పట్టణము గట్టించి దానికిఁ బూర్వమువలెనే కుండిననగరమని పేరుపెట్టెనట. ఇదిగాక ధరణికోటనుండి ఎత్తి తెప్పించి పుట్టకోట కట్టెననియును కోమటివేమనకుఁ బుణ్యముగా నూట యెనిమిది శివప్రతిష్ఠలు జేసెననియు, ఇంటింట బావులు త్రవ్వించెననియు, ఇష్టదైవ



మగు శ్రీ చదలవాడ వీరరాఘవస్వామి వారికిఁ బ్రీతిగా శ్రీరామసింహాసన మను పేర నొక దేవప్రతిష్ఠచేసి దాని కగ్రహారము లిచ్చెననియు శ్రీశైలాహోబలాదిపర్వతములకు సోపానములు కట్టించె ననియు తురుష్కులచేఁ గోల్పడిన యగ్రహారములను పునరుద్ధారణచేసెననియును దండకవిలె మున్నగు కొన్ని గ్రంథములందును శాసనములందును జెప్పఁబడి యున్నది. చదలువాడ రాఘవస్వామి యీ రెడ్డివంశజుల కిష్టదైవము. ఆ స్వామికిఁ బ్రీతిగా నితఁడు విష్ణ్వాలయమును నిర్మించెను. ఆ వివరమీ దిగువశాసనము వలనఁ దెలియుచున్నది.

1 శుభమస్తు జయాద్యనేక నాకాదిలోకపాలా............

* * * *

### కొండవీటి ప్రదేశస్య రామచంద్రశాసనం.

"స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౨౯౩ అగునేటి విరోధికృతు నామ సం॥ర జ్యేష్ఠ శు ౧౦ సోమవారంనాడు కొండవీటి చదలవాడ రాఘవేశ్వరులకు బృందావనం తోటను కలను నానాతోయాల ఫలవృక్షాల సంభారముగాను కనుపడేదిన్ని సమర్పించిరి.

స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్. ఈధర్మము యెవరు పాలించినను అశ్వమేధయాగ ఫలము పొందుదురు. యీధర్మము యెవరుకల్లచేసినను పంచమహాపాపానబోదురు"

ప్రోలయ వేముని కాలమున నీతని కుమారుఁడు "అనపోత వేమారెడ్డి" సేనానియై రాజ్యరక్షణార్థమై ధరణికోటయందు నివసించుచుండెను. ఈతనికి పల్లవాదిత్యుఁడనియు, పల్లవత్రినేత్రుఁడనియు, జగనొబ్బగండడనియు, వీర నారాయణుఁడనియు, రాయచేకోలుగండడనియు, పెక్కు బిరుదములు గలవు. ఈ రాజుకడ రామాప్రెగ్గడయు, మల్లినాథుఁడును మంత్రులుగనుండిరి. ఇతని సోదరులగు అన్నయ, మల్లయయును, మేనమామయగు నూకారెడ్డియు, ప్రసిద్ధసేనానులుగానుండి రాజ్యరక్షణ మొనర్చుచుండిరి.

---

1 కొండవీటి అయ్యవారప్ప చెఱువు లోదట్టున గల శిలాశాసనము.

ఈలేఁడు సాలన గ్రామమునందలి కొంతభూమిని విభజించి హద్దులు పెట్టించి దానిని తనకుమార్తె వేమాంబకు సంక్రాంతిపండుగ నాటి ఖర్చునకు సంక్రాంతి పాడు పేరుపెట్టి యిచ్చెను.

ఈ వేమాంబ (సూరయ భార్య)* శా॥ ౧౨౭౮గి............సం॥రం మాఘమాసమున వేల్పూరులో రామేశ్వరస్వామికి గొంతధర్మము జేసియుండెను. సాలస పొలములో హద్దులుపెట్టి తనకూతురు అయిలమ్మకు పండుగఖర్చునకై యిచ్చి దానికి ఆమెపేర అయిలవరమను గ్రామము కట్టించి యిచ్చెను.

—* అనపోత వేమారెడ్డి *—

పోలయ వేమారెడ్డి యనంతరము అతని పెద్దకుమారుఁడు అనపోత వేమారెడ్డి సింహాసనము నధిష్టించెను. అనపోతునకు అనవేమయ కోమటిరెడ్డి, అను తమ్ములును, దొడ్డాంబిక, వేమాంబిక, యను చెల్లెండ్రునుగలరు. కోమటి చిన్నతనమునందే మృతినొందెను. దొడ్డాంబను కాటయయును వేమాంబను సూరయయును పెండ్లియాడిరి. వీరందరును రాజ్యరక్షణము సేయుచు దనకు మిగుల సహాయముజేయుచుండ నీతఁడు తండ్రివలె ధర్మపాలనము జేసెను.

శా॥ ౧౨౭౩ ప్లవ సం॥రం శ్రావణ బ ౧౧ గురువారమున నీవేమారెడ్డి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధికొఱకు మంత్రి (మల్లినాధపుత్రుఁడు) వేమనమంత్రివలన అమరావతియందు శ్రీ అమరేశ్వరస్వామికి పునఃప్రతిష్ట చేయఁబడినది.

అనపోతవేమారెడ్డి కాలమున సముద్రవ్యాపారము వృద్ధినొందెను. రేవుపట్టణమగు (గుంటూరుజిల్లా బాపట్లతాలూకా) మోటుపల్లికి వర్తకమునకుగాఁ జనుదెంచినవారికిఁ దగువసతుల నేర్పరిచి వారికి మిగుల ప్రోత్సాహము గలిగించుచుండెను. ఈతని మంత్రులలో నొకఁడగు సోమమంత్రివలన శా॥ ౧౨౮౦ పింగళ సం॥రం శ్రావణ బ ౮ మంగళవారమున విషయమును గురించియొక శాసనము వేయబడినది.

* వేల్పూరు శాసనము



—* సిద్ధుడు—గొల్లవానికథ *—

అనపోతవేమారెడ్డి కాలమున నొకవిచిత్రమగు (స్వప్నవేదివాటి) కథ జరిగినట్లు దండకవిలెయందు వ్రాయఁబడినది. దాని నీక్రింద వివరించుచున్నాను.

కొండవీటి కొండయొక్క యొకభాగమగు బొల్లుమూరి వేంకటేశ్వరుని కొండపై నొక యోగియుండెను. ఆయోగి యొకదినమున మేకలఁ గాచుకొనుచు నచటనున్న గొల్లవాని కంటఁబడెను. గొల్లవానిఁ జూచి యాతఁడు "నీవు నాకు దినదినము పాలు మొదలగునవి తెచ్చి యిచ్చుచుండుము నీకొక మేలుసేసెదనని చెప్పెను". వాఁడానాఁటి మొదలుగ యోగికి భోజనపదార్థములనిచ్చుచు వచ్చెను. ఇట్లుల గొన్నినాళ్లుగడచెను. తరువాత నొకనాఁడాసాధువు గొల్లనిజూచి వానితో "ఓరీ! నీవెపుడును మేకలను మేపుచుందువుగదా; మేకమేసిన వెంటనే చిగిర్చెడి చెట్టును కనిపెట్టి యది యున్నతావు తెలిసికొని దాని చుట్టు కంప మొదలగునవివైచి నాకు జెప్పు"మనెను. గొల్లఁడా చెట్టును గనిపెట్టి దానిచుట్టును వెలుగువైచి యోగికిఁజూపెను. యోగియు నాభూజమునకు ధూపదీపనైవేద్యాదులిచ్చి దానికి జుట్టువేసియున్న ముండ్లపొదలకు నిప్పంటించెను. అది యొక్క మొగిమండుచుండనాతఁడు గొల్లవాని చేయిబట్టుకొని దానిచుట్టుఁ బ్రదక్షిణముసేయుచుఁ దటాలున నాగొల్లని మంటలోనికిఁ ద్రోసెను. వాఁడు మిగుల బలముగలిగిన వాఁడగుటవలన నా త్రోపునకుఁ జిచ్చులోఁ బడకుండఁ దప్పించుకొని, మత్సరమున నాబైరాగివాని నామంటలోనికిఁ ద్రోసి తనదారిని వెడలిపోయెను. మరునాడు గొల్లవాఁడు "యోగి చచ్చెనో లేక యింకను బ్రదికియుండెనో చూతమ"ని గొడ్డలిచేఁబూనివచ్చి యచటఁజూచెను. అందుయోగి స్వరూపముగానరాలేదు; గాని యచటి యోషధుల మహిమవలన నొక బంగారపు విగ్రహము మనుష్యుని పరిమాణము గలిగి పడియుండెను. ఆ ప్రతిమనుగాంచి వెఱ్ఱిగొల్లఁడు యోగియింకను చావక మాయదారియైయిట్లు పడియున్నాఁడని యెదనెంచి, ఆకారణమున మిగులఁగోపించి "హు" మ్మని యొక్క వ్రేటున గొడ్డలిచే బంగా

ఠ బొమ్మను చేయియొకటి తెగనేసెను. అదితెగిపడి వెంటనే మరల చేయి యెప్పటట్లవచ్చెను. అది వీక్షించియిది యోగి విగ్రహముకాదని యోచి యచ్చెరువొంది యాచేతిని తీసికొనివచ్చి పురమున రహస్యముగ నొక వైశ్యునకిచ్చి తనకువలసిన వస్తువులతీసికొనెను. ఇట్లు ప్రతిదినము గొల్లఁడు విగ్రహమునుండి కొంతబంగారము దీసికొనివచ్చి యావైశ్యునకు వెచ్చించుచుండెను. అందువలన గొలఁది కాలమున సామాన్యవర్తకుఁడు గొప్ప ధనవంతుడయ్యెను. ఈ వార్త చారులవలన విని రాజు వైశ్యుని పిలిపించి దండించి, నీవింతత్వరలోనెట్టి యపారసంపద వహింపగల యాధారమేమని యడుగ నతడీ వృత్తాంతమునుజెప్పెను. ఆవల రాజు గొల్లవానిని పిలిపించి విగ్రహముండిన స్థలమునకేగి యచట యథోచితకృత్యములు (బలి) జరిపి విగ్రహమును తెప్పించి తనయింటఁ జేర్చెను. అప్పటినుండి పూర్వపుస్పర్శవేదివలనను, యీవిగ్రహమువలనను బ్రబలైశ్వర్యవంతుండై బలము నెక్కువగ గూర్చి బహుదేశముల నాక్రమించి పాలింపుచుండెను”.

ఈ వృత్తాంతము స్పర్శవేదికథను మించియున్నది. ఈ రెండు గాథలనువదంతులవలె—జనులలో ప్రబలియున్న ప్రవాదముదప్పఁదర్క నిదర్శనములు జూపట్టవు. ఇవియథార్థములని వాదింపను-కావని నిరసింపను—కూడ నాధారములు లేవు. ఇవి కథలో—గాథలో ఏవైనను గానిండు; కొండవీటి చరిత్రమును వ్రాయునపుడే చరిత్రకారునకునివి తొలఁగఁద్రోయరాని సంబంధములు. ఏలనన; రెడ్లచరిత్రముతో నీకథలకుఁ జిత్రతరములగు లంకెలువైవఁ బడియున్నవి. ఇందలి సత్యాసత్యములఁ దెలసికొను భారము చదువరులకు విడచి గాథలున్నవియున్నట్లు వెల్లడించినాను.

అనపోతవేమారెడ్డి క్రీ॥ 1361 సం॥రం న ధరణికోటయొద్ద జరిగిన యుద్ధమున రేచర్ల అనపోతనాయఁడు మాదానాయఁడు మున్నగు యోధులవలన జయింపఁబడెనని యొక గ్రంథమున వ్రాయఁబడియున్నది. కాని యందుకుఁ దగిన ప్రమాణము లుదహరింపఁ బడనందున నది నమ్మదగినదిగఁ గన్పట్టదు. ఇతనికిఁ దరువాత నీతని సోదరుఁడు పరిపాలనమునకువచ్చెను.



## అనవేమారెడ్డి.

అనపోతరెడ్డితరువాత రాజ్యమునకు వచ్చినది యతని తమ్ముఁడగు “అనవేమారెడ్డి”. ఇతఁడు మిగుల బలపౌరుషములును విద్యావ్యాసంగములును గలవాఁడు. నిజదాతయై బ్రాహ్మణులకనేకాగ్రహారములిచ్చెను. ఈతనికడ మామిడి పెద్దన మంత్రిగా నుండెను. ఈ పెద్దన ఆంధ్రనైషధకృతిపతికి జనకుఁడు. ఈరెడ్డిరాజు గోదావరిమండలములోని తుల్యభాగానదీతీరమున మన్యమాపురమును, ఇస్మాసిలంక (అనవేమపురము) కృష్ణాతీరమున కొల్లూరు, గుంటూరుమండలములోని పెదచెఱుకూరు మొదలగు ననేక గ్రామములగ్రహారములుగ నిచ్చెను. ఇతని భృత్యుడు కడియం పోత్తినాయఁడు నల్లగొండజిల్లా మిర్యాలగూడెం తా॥ వాడపల్లియందు అగస్త్యేశ్వరస్వామికి ధర్మముచేసి నిల్పిన శాసన మీక్రిందఁ బ్రకటించుచున్నాను—

“స్వస్తిశ్రీ శకవర్షంబులు *౧౨౮౯ అగు పింగళ సం॥ జ్యేష్ఠ బ ౧ ఆ॥ జగనొబ్బగండ కఠారిరాయ పాపనారాయణ కలియుగభేతాళ త్రిపురాంతకదేవ దివ్యపాదపద్మారాధకులయిన వేమారెడ్డింగారి సుపుత్రుఁడు అన్న వేమయారెడ్డింగారు పృథ్వీరాజ్యం సేయుచుండంగాను అన్న వేమయరెడ్డింగారికి నిజభృత్యుండైన కడియం పోత్తినాయుండు తమ స్వామి అనమాచంరెడ్డింగారికి పుణ్యంగాను శ్రీకృష్ణవేణిమసిసంగమమైన బదరికాశ్రమమందుల అగస్తీశ్వరదేవరకు పిల్లలమఱ్ఱి బేతిరెడ్డిగారు కట్టించిన గర్భగృహము మీదశిఖర ప్రతిష్ఠచేసి బేరశాల కట్టించిరి. కట్టించిపెట్టిన గర్భగృహము వాకిలి తలుపులుచేయించి ఆరగించే పళ్యాలు ౨ న్ను కుడుకలు ౨ న్ను గంధము సానాను యిచ్చి పట్టువస్త్రాలుం బూజించి సజ్జనముచేయ రంగిగలంతె యిచ్చి ఆచంద్రార్కస్థాయిగాను శాసనస్తంభము నిల్పిరి. మంగళమహాశ్రీ

శ్లో॥ శ్రీమద్వేమయ అన్నవేమ మనుజాధీశే మహీం పాలితే
శశ్వత్కుడ్య ముఖోతినాయక నృపాధీశే నభస్త్ర్యావృతం
అస్యాగస్త్యమహీశ్వరస్య సదనస్యాత్యున్నతంచిత్రితం”

* * *

అనవేమన పెదపడిదెరము (సత్తెనపల్లి తా॥)న దూర్పున సోమేశ్వరుని గ్రామమధ్యమున కళ్యాణగోపాలస్వామిని ప్రతిష్ఠించి భూముల నిచ్చెను. కృష్ణాసాగరసంగమమునందు కామరాజుగడ్డ గ్రామముననున్న

* ఈ కాలమునాటి శాసన మొకటి శ్రీశైలముననున్నట్టు తెలియుచున్నది.

ముక్తేశ్వరస్వామిదర్శనార్థమై ప్రతిదిన మంచగుఱ్ఱములమీఁద పోయి వచ్చుచుండెడివాఁడు. ఈ స్వామికిఁ బూర్వము గణపతిరాజిచ్చిన యీ గ్రామాగ్రహారమునకు విశ్వామిత్రునివారను బ్రాహ్మణుల కధిపత్యము నిచ్చెను.

### కవుల పొగడ్తలు

ఇతఁడనేక దానములు జేసియున్నాఁడు. ఇతని దానశాసనములు పెక్కుచోట్ల గానవచ్చుచున్నవి. అవి యన్నియు నిచట గ్రంథవిస్తర భీతిమై నుదహరింపఁ గొందఱు కవు లీతనిపైఁ జెప్పిన చాటువుల మాత్రము దిగువ వ్రాయుచున్నాను. అనవేముఁడు పండితులను కవులను మిగుల గౌరవించుచుండినట్లు లీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

1 శ్లో॥ అనవేమమహీపాలస్వస్త్యస్తు తవ బాహవే
బాహవే రిపుగోర్దండచంద్రమండలరాహవే॥

2 తే॥ ఘంటికో పెక్కి. ఫణిరాజు పడగలెక్కి। మేటికామేటివీ పెక్కి మెట్టరె
క్కివిసివి వేసారి యనవేమవిభుని జేరి। రాణివాసంబుగతి మించెరత్నగర్భ॥

3 సీ॥ రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
గీ॥ భావిభవ భోగ సత్కళా భావములను। భావిభవ భోగ సత్కళా భావములను
భావిభవ భోగ సత్కళా భావములను। భావిభవ భోగ సత్కళా భావములను॥

మఱియు వెన్నెలకంటి సూరనార్యుఁ డీతని నిట్లు పొగడియున్నాఁడు.

4 క॥ తన బ్రతుకు భూమిసురులకు। తన బిరుదులు పంటవంశధరణీశులకున్
దన వయము భూమిప్రజలకు। ననవేమున యిచ్చెఁ గీర్తి విభవుం డగుచున్॥
(నాలుగవపాదమందలి యతి చింత్యము) విష్ణుపురాణము. ౧వ ఆ.

### ముల్లగూరమ్మ.

అనవేమారెడ్డి ముల్లగూరమ్మ యను దేవతకు తన్నామమున గ్రామమేర్పరచి యచ్చటి కొండపై గుడికట్టి ప్రతిష్ఠ చేయించెను. 'ఇదియె



నూతన ప్రతిష్ఠమై యుండును. ఇది అమీనబాదను గ్రామమున గను పట్టును. ఈదిగువ శాసనమునుబట్టి పెదకోమటి రెడ్డి గుడికట్టినట్లు కనబడి నను తొలుత నితఁడు కట్టిన దానిని కోమటిరెడ్డి బలపరచి యుండవచ్చును. ఇది చక్కని పనితనముగలదై చూచువారి కన్నులకు విందొనర్చు చుండును. దీని విషయము ముందు అమీనాబాదు చరిత్రమునందు జెప్పబడును. మఱియు నీయనవేమారెడ్డి ముల్లగూరు (అమీనాబాదు) అను గ్రామమునఁ గొండమీఁదఁ గల ముల్లగూరమ్మకు (మూలాంకురేశ్వరి) 1. పడిదరము. 2. ముల్లగూరు. 3. పలకలూరు గ్రామము లంగరంగభోగముల కిచ్చెను. యాబలూరులో నుండు జలధారేశ్వర స్వామికిని గోపాలస్వామికిని ఆలయములు కట్టించెను. పిదప నితని పెద తండ్రిమనమఁడు పెదకోమటివేమారెడ్డి యీ గ్రామములను స్థిరపఱచుచు గుడియుఁ బ్రాకారములుఁ గట్టించెను. * ఆ వివర మంతయు నీ దిగువ నుదహరించు శాసనమువలనఁ దెలియుచున్నది.

సీ॥ శాకాబ్దములుసహస్రమును మున్నూటతొంబదియెన్మిది యునగు భక్తసంఖ్య
గలిగి యువత్సరా నలవత్సరంబున మాఘమాసము భార్గవవాసరమున
విశ్వామిత్రునకై వేమభూపాలుండు తన కులస్వామికి నన్నపతికిఁ
రేఖావతంసమౌ శ్రీముల్లగూరమ్మ కఖిల జగన్మాత కంగరంగ
తే॥ భోగసంసిద్ధికై ధారవోసి యిచ్చె। గ్రామములు మూఁడు శ్రీకోటభూమియందు
పడిదరము, ముల్లగూరును, పలకలూరు। దానఖచరేంద్రుఁ డా చంద్రతారకముగ॥
సీ॥ క్రమపరివ్యాప్తసామ్రాజ్యసింహాసనాధ్యాసియై యఖిల గాంగేయరాజ
వరమేశ్వరుం డాదిరాదుండు పెదకోమటన్న వేమాధీశుఁ డిద్ధిసురాధ్యు
డాతని పినతండ్రి యనవేమభూపతి సేసిన ధర్మమూర్జితముగాఁగ
నీ గ్రామములు మూఁటి కెల్లకాలంబు భోగైశ్వర్యసర్వమాన్యతలు నొసగి
తే॥ యంబికకు ముల్లగూరమ్మ కఖిల జనని। కర్థి గట్టించె భువనమోహనముగాఁగ
సమధికోన్నతి నభ్రంకషంబులైన। గుడియుఁ బ్రాకారవలయంబు గోపురములు॥

### కంచి, పేరి, పొన్ని యను వేశ్యల కథ.

ఈతనికాలమున కంచి, పేరి, పొన్ని యను వేశ్యలు అక్క- చెల్లెండ్రు ముగ్గురు సంగీతసాహిత్యవిద్యలందు ప్రవీణలై వచ్చి యీత

* ముల్లగూరమ్మగుడికి యుత్తరపువైపున గట్టుమీఁదఁ జెక్కఁబడిన శాసనము.

నిని యాచించి విద్యలచే మెప్పించి తనుపేర నగ్రహారములిమ్మని వేడిరి. దాశయకు నీత దంపులను సమ్మతించి యగ్రహారముల నొసంగెను. ఈ యగ్రహారములు యిప్పుడు నందిగామ తాలూకాలోనున్నవి.

కంచికి "కంచికంచెర్ల" గ్రామము సర్వాగ్రహార మిచ్చెను.

పేరికి, తెండ్లగుంటపాటి శివారులోని ఖండ్రికపొలమును విడతీసి గ్రామము గట్టించియిచ్చెను. దీనికి "పేరికలపాడ"ను పేరుపెట్టిరి.

పొన్నికి, జుజ్జూరుశివారులోని ఖండ్రికపొలము విడతీసి గ్రామము కట్టించి యిచ్చెను. దీనికి "పొన్నవరము"ని పేరుబెట్టిరి. ఇది తెండ్లగుంటపాటికీశాన్యమునఁ గలదు.

కంచి—తన యగ్రహారములో గొప్ప చెఱువు వేయించగా దానికిగండిపడి యెన్నిమారులు బిగించినను బిగియక తెగుచువచ్చెను. అందున కది చింతించి మఱియొకపరి బిగింపఁ బనివాండ్ర రావించి తాను సకలాభరణభూషితయై గండిలోపలఁగూర్చుండి గండి పూడ్పించుకొనెను. గండికట్టుబడెను. తరువాతను కట్టపై నొక శక్తి వెలసెను. దానికి కంచెలమ్మ యను పేరుపెట్టి యొక గుడికట్టబడి యిప్పటికినిఁ బ్రసిద్ధిగనున్నది. ఈ చెఱువు కంచెలమ్మ చెఱువని పిలువబడుచు సస్యములకుపయుక్తముగ నున్నయది.

పేరి— తనకీరఁ గట్టబడిన పేరికలపాటియం దొక చెఱువు వేయించి దానిమధ్య దిన్నె పోయించి దానిపై రావూరి వేంకటేశ్వరస్వామివారినిఁ బ్రతిష్ఠించెను. కట్టమీఁద శివాలయముగట్టించి తూర్పుభాగమున మూడుశాసనములు, దక్షిణమున రెండుశాసనములు, పడమర దిశ మూడుశాసనములు, ఉత్తరమున బోడపాటినుండి వచ్చువారికి బడమర నపులఖండం శాసనము, గుడికట్టుశాసనమును మొత్తము పది శాసనములు వేయించి కొంతకాలము సర్వాగ్రహార మనుభవించి స్వర్గస్థురాలయ్యెను. చెఱువుకట్టమీఁద పేరకలమ్మ యని గుడికట్టి దేవతగాఁ బూజింపఁబడుచున్నది.



పొన్ని—తన పొన్నవరగ్రామమునకుఁ గుడికట్టు లేర్పఱచి శాసనములు వేయించికొనుకాలమున చక్రాంకితములు వేయించికొని తన శాసనములందును శంఖచక్రచిహ్నము లేర్పరించెను. మఱియుఁ దన పేరఁ దటాక మొకటి నిర్మించి సర్వాగ్రహార మనుభవించి మృతినొందెను.

ఈ వేశ్యల వృత్తాంతము దండకవిలెనుండి గైకొనఁబడినది. వీరికీయఁబడిన గ్రామములకు నిర్ణయింపబడిన పొలిమేరహద్దులుగూడ దండకవిలెయందుఁ గలవు.

--* అనవేమయ బిరుదము *—

"స్వస్తి సకలగుణగణాలంకార, చెంజీమలచూడకార (చతురచూడాకార), విశ్వవిశ్వంభరాహీన దక్ష దక్షిణభుజాదండ, జగనొబ్బగండ, రాయచేకోలుగండ, అర్థిప్రత్యర్థి హేమాద్రిదాననిరత, ప్రజాపరిములనాభరత, అసురాభరణ, రూపనారాయణ, వీరనారాయణ, భుజబలభీమ, కోదండరామ, అపరిమితభూదాన పరశురామ, అనేకనగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహువిధారామ, సంగడిరతు పాలక, జగదపాలక, గుజ్జరితర్థివిభాళఘట్టనభుజవిరాజమాన కరవాలవృత, రామూరిదుర్గవిభాళ, అనవరతపుగోహితకృత సోమపాన, శ్రీపర్వతాహోబల(వేంకటాచల) నిర్మిత సోపానదిక్కాంతామనోహార కీర్తికుసుమామోద, కుంభిప్రభాష్యాజా గౌతమీ (కావేరి) జలక్రీడావినోద, విరోధినృపదావవన్యసింహ, పాండ్యరాజగజసింహ, ప్రజ్ఞాచతుర్విధోపాయ, కేళాధిరాయ, సత్యాహరిపాలితసత్య, కల్లవాదిత్యరిపునరపతిగోధూమ ఘట్టనఘురట్ట, అప్పయ గోపయ దిశాపట్టసంగ్రామ సముద్దండ, చండభుజాసి విఘండిత శత్రుకీలాలప్లవమానపిశాచగణస్తూయమాన యశోమండన, అళగియవ దళిరఖండన, దుర్మదవైరివీరభయంకర, బసవశంకర, అమరేశ్వరదేవ శ్రీచరణసరోరుహదత్తభాన, దండెవగోన, బ్రహ్మకుండి కృష్ణవేణ్ణా గోదావరి (కావేరి) మహానది తటిత్రయ మధ్యదేశ దత్తానేకాగ్రహార, అగణ్యపుణ్యక్షేత్రసత్రదత్త బహువిధాహార, పరపురహారణమృత్యుంజయ, సంగ్రామధనంజయ, ఉత్తుంగచతురంగబలరిపుసేనాసాధక, త్రిపురాంతక దేవది

వ్య శ్రీపాదపద్మారాధక, కేతయ మల్లినాథ పయఃపారావార పరిపూర్ణసుధాకరుండైన (శ్రీమతు వేమన్నంగారు) శ్రీమదనవేమారెడ్డిగారు."

ఈ బిరుదము దండకవిలెనుండి వ్రాయబడినది. ఇందలి కొందలీకరణములు పాఠాంతరములు. ఈ బిరుదము లీతని సంతతి రాజులందఱకును గలవు.

అనవేమయకాలమున భాస్కర శ్రీనాథులుండిరా?

అనవేమారెడ్డికాలమున భాస్కరుడు (రాయనభాస్కరుడు) మంత్రిగను, శ్రీనాథుడు కవిగను యుండిరని దండకవిలెయందు వ్రాయబడినది.

సునందాపరిణయమున "సీ॥ ఘనతరౌదార్య" యను పద్యమున

"తే॥ అన్నవేమమహీశదత్తాగ్రహార ।
మదకరాందోళికాశ్వ సన్మణివిశేష
భూషణాద్యష్టభూతి విభూషితుండు ।
భానుతేజుండు రాయన భాస్కరుండు॥"

యని రాయనభాస్కరుని వర్ణింపుచు అనవేమయవలన గౌరవ మందినట్లు వ్రాయబడినది.

దీనిని కీ॥ శే॥ గుంటుపల్లి సోమయ్యగారు ఖండించుచుం గొన్ని కారణములను రాయనమంత్రి భాస్కరచరిత్రమునందు సూచించిరి. అందు ముఖ్యములగు హేతువులు (1) కొండవీటి రెడ్లపాలనము శా॥ ౧౧౫౧-౧౨౫౧ (క్రీ॥1228-1328) వరకుననియు, కాటయవేమన మొదలగువారు రాజమహేంద్రవరమున క్రీ॥ 1328-1428 వరకేలిరనియు, కొండవీటియందు ప్రోలయవేమన క్రీ॥ 1328-1340, తరువాత అనవేమారెడ్డి క్రీ॥ 1340-1369, యితని తమ్ముడు అల్లయవేమన క్రీ॥ 1370-1381, అనవేమనపుత్రుడు అనపోతన తండ్రికి సేనానిగనుండి వెంకటగిరిరాజులచే నిహతుడైనందున నతని కుమారుడు కుమారం క్రీ॥ 1382-1395 వరకు రాజ్యమేలెననియు, ఇతని చెలియలిభర్త అల్లాడరెడ్డి రాజమహేంద్రవరమున క్రీ॥ 1415 వరకు పాలించెననియు, రెండవ చెలియలిభర్త కాటయ 137రన బుట్టి 1468 వరకు జీవించి యుండుననియు, శ్రీనాథుడు కృతియిచ్చిన వీరభద్రారెడ్డి క్రీ॥ 1468 ప్రాంత



ములందుండెననియు, నీ వీరభద్రారెడ్డి హరివంశకృతిపతియై క్రీ॥ 1340 ప్రారంభముగా రాజ్యమేలిన అనవేమారెడ్డితరువాత రెండవరాజైన కుమారగిరి చెల్లెలిభర్త యనియును, కావున వీరభద్రారెడ్డికిని యనవేమనకును 128 సంవత్సరములు వ్యత్యయముండెను కాన ననవేమయకడ శ్రీనాథుడు భాస్కరుడు లేరనిరి. (2) కాటయవేమనకడ రాయనభాస్కరుడుండినందుకు

చ॥ కలితపసిండిఘంటమునఁ గాటయవేము సమస్తుఁడు స
త్ఫలముగ రాయనప్రభుని శాచఁడు వ్రాసిన వ్రాలమోతకున్
సలుఘులుఘుల్లుఘుల్లుమనుఁ గంటకమంత్రుల గుండెలన్నియున్
ఝులుఝులుఝుల్లుఝుల్లుమను సత్కవులందరు మేలుమేలనన్॥

అను పద్యమును నిదర్శనముగ చూపిరి.

ఈ రెడ్డివంశములో అనవేమారెడ్డియనువారు పెక్కండ్రుండుటవలనఁ బ్రమాదవశమున సోమయ్యగారిట్లు వ్రాసియుందురు. ఇందుకు ముఖ్యకారణము "కొండవీటిరెడ్ల పాలనము క్రీ॥ 1228-1328 వర"కనుట. [illegible] గ్రంథశోధకులైన శ్రీజయంతి రామయ్యపంతులుగారును, శ్రీచిలుకూరి వీరభద్రరావు పంతులుగారును, దండకవిలెకారులును రెడ్లపాలన ప్రారంభము క్రీ॥ 1320 ప్రాంతమని వ్రాయుచుండగా వీరట్లో నూరేండ్లు వెనుకకు లెక్కించి వ్రాసిరి. అనవేమయమంత్రి మామిడిపెద్దన కుమారుడు సింగనకు శ్రీనాథుడు కృతినిచ్చెను. రెడ్ల వంశవృక్షమునందలి కాలములఁబట్టి అనవేమయకును, శ్రీనాథుని ప్రభువగు పెదకోమటి వేమయకును 50, 60 యేండ్లు వ్యత్యయము గనుపట్టును. రమారమి యెనుబదేండ్లకుఁ బైగా బ్రతికిన శ్రీనాథుడు ఏబదేండ్లకాలములో తండ్రికొడుకుల మధ్యకాలమునం దుండరాదా?

శ్రీనాథుని చరమదశ దెల్పు పద్యమున "తే॥ గీ॥ భాస్కరుడు మున్నె దేవుని పాలికరిగె" నను వాక్యానుసరణముగ భాస్కరుడను నొక వదాన్యుడు శ్రీనాథునికి మున్నె యుండెననుట నిస్సంశయము కావున పైనుదహరించినట్లు అనవేమారెడ్డి కాలమున భాస్కరుడు, శ్రీనాథుడు లేరని త్రోసివేయుట పొసగదు.

మఱియు నీ రెడ్డిరాజుల చరిత్రలు వ్రాయుటలో నాధారములు దొరకినకొలఁది వాదములు పెరుగుచు నేవిషయమును నింకను నిశ్చయముగాకున్నది. అలవడిన నిదర్శనము లొండొంటికి సంబంధింపక నింకను సంశయము గలిగించుచున్నవి. కాన చరిత్రకారు లీ విషయమును నింకను చర్చించి సత్యమును గనుగొన వలసియున్నారు.

కుమారగిరి వేమారెడ్డి.

అనవేమారెడ్డికిఁ బిమ్మట నతని యన్నకుమారుఁడు (కొమరగిరి) కుమారగిరి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు పూర్వుల మార్గము నవలంబింపక అక్రమప్రవర్తనుఁడై జనకంటకముగఁ బ్రజాపాలన మొనర్చెననియు, నితనికాలమున స్పర్శవేదియు, సువర్ణవిగ్రహమును మాయమయ్యెననియు దండకవిలెయందు వ్రాయఁబడినది. ఈ విషయ మితరగ్రంథములయందు వేరువిధముగ నున్నది. ఇతఁడు రాజ్యాసక్తిలేక వసంతోత్సవాసక్తుఁడై యుండెను. ఇతని మఱఁదియగు కాటయవేమారెడ్డి రాజకీయ వ్యవహారముల నెరవేర్చుచుండెను. ఇతఁడు విద్వాంసుఁడై విద్యావ్యాసంగములఁ బ్రొద్దులుపుచ్చుచుండెను. ఇతనికి "వసంతనృపాలుఁ"డను బిరుదము గలదు. వసంతరాజీయమను నాట్యశాస్త్రమును రచించెను. తన మఱఁది కాటయకు రాజమహేంద్రవర రాష్ట్రమును బంచియిచ్చెను. అప్పటినుండి రాజమహేంద్రవర రాజ్యము కొండవీటి పరిపాలనమునుండి విడిపోయెను. కాటయ వేమన కుమారగిరిరెడ్డిపేర * నహోబిలము కడఁ గొమరగిరిపురము గట్టెను. కుమారగిరి వేమయకాలమున అవచి తిప్పయ యను వైశ్యుఁడు ప్రబలవర్తకుఁడై యుండి యన్యదేశములనుండి సుగంధద్రవ్యములను, సింహళమునుండి యేనుగులను తెప్పించి విక్రయించుచుండెను. హరవిలాస మితనికి శ్రీనాథునివలనఁ గృతియీయఁబడెను.

—* పెదకోమటి వేమారెడ్డి *—

కుమారగిరిరెడ్డియనంతర మాతని పెదతాత మనుమఁడగు పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఈతనికడ కవాటం వెంక

* కర్నూలుజిల్లా సిరివెళ్ళతాలూకాలోని యొకపుణ్య క్షేత్రము.



య్యపంతులు మంత్రిగ నుండెనని వేమనపద్యములగ్రంథమున పూర్ణయ్యాచార్యులుగారు వ్రాసియున్నారు. మఱియు మామిడి పెద్దనయొక్క తృతీయపుత్రుఁడు సింగన యితనికడ మంత్రిగనుండి శ్రీనాథునివలన నైషధమును కృతినొందెను. శ్రీనాథుఁ డితనికడ విద్యాధికారి (సంస్థానకవి)గ నుండి బహుగ్రంథముల రచించుచు విద్వాంసుఁడైన తన రాజునకు "సర్వజ్ఞచక్రవర్తి" యని విద్వాంసులచే బిరుద మిప్పించెను. ఈ సంస్థానమున వామనభట్టను మఱియొక కవిగలఁడు. శ్రీనాథుఁడు ప్రబలవిద్వాంసుఁ డగుటచే తా నన్యసంస్థానములకుఁ బోవుచు నచ్చటి విద్వాంసులతో విద్యావాదములుచేసి జయమునందుచు వచ్చెను. ఈ రాజున కిది యెంతయుఁ గీర్తికరమై యుండెను. ఇతఁడొకపరి విద్యానగరమునకు బోయియచటి విద్వాంసుఁడగు గౌడడిండిమభట్టునువిద్యావాదమున నోడించి ప్రతిజ్ఞానుసారముగ నాతని కెంతకాలమునుండియో బిరుదముగ నిల్చియుండిన కంచుఢక్కను పగులఁగొట్టించెను. దీనికి వేరొక చోట్ల బ్రకటింపబడిన శ్రీనాథుని "దీనారటంకాల" యను పద్యమే నిదర్శనము.

—* గృహరాజు మేడ *—

"ఒకప్పుడు శ్రీనాథుఁడు రాజాజ్ఞచొప్పున విద్యానగరము(బళ్ళారి జిల్లా ఆనెగొందియొద్ద విజయనగరము)నకు బోయి రాజసభ నలంకరించెను. మీ రేసంస్థానభూషణులని యడుగ నాతఁడు దటాలున నీక్రింది పద్యముచే నుత్తరమిచ్చెను.

సీ. పరరాయ పరదుర్గ పరవైభవశ్రీలఁ గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథిరాజన్య బలముల బంధించు గురుతైన యురిత్రాడు కొండవీడు
ముగురురాజులకును మోహంబుపుట్టించు కొమరుమీరిన వీడు కొండవీడు
చటులవిక్రమకళాసాహసంబొనరించు కుటిలాత్ములకు నూడు కొండవీడు
తే. గీ. సాధుసైంధవభామినీ సరసవీర। భటపటానేక హాటకప్రకటగంధ
సింధురాద్భుత మోహనశ్రీలఁ దనరు। భూమి నమరావతికి జోడు కొండవీడు.

అని చెప్పగా వారందఱును సంతసించిరి. ప్రసంగవశమున నచటి రాజగు హరిహరకుమారదేవరాయలు (హరిహరరాయలు) సభ్యులఁ

జూచి "విద్వాంసులారా! మేమొక యొంటి స్తంభము గృహరాజుమేడ గట్టింప నెంచితిమి. అట్టి దిదివర కెవరైనఁ గట్టించిరా? అట్లు గట్టించి యుండ మరల నిచట గట్టించుట శ్రేయస్కరము కాదుకదా. మీర నేక సంస్థానముల వీక్షించినవారు గాన నీ సందియము దీర్పుఁ" డనెను. సభ్యులందరు లేచి "మహాప్రభో! అట్టిపనికి దేవరవారు దక్క నెవరు సమర్థులు? ఇదివర కెప్పుడును అట్టి విషయము కని వినియుండలే" దనిరి. శ్రీనాథుఁడు లేచి "మహారాజా! మా స్థానపతియగు పెదకోమటి వేమారెడ్డిగా రట్టిమేడను కొండవీటియందు గట్టించి" రని బల్కెను. అది విని దాని విశేషములెల్ల శ్రీనాథునివలన విని తన యుద్యమము మాని కొండవీటిమేడను జూచిరండని కొందఱుభృత్యులను బంపెను. శ్రీనాథుఁడు లేనివిషయమును ప్రకటనగాఁ జెప్పెను గానఁ దన మాట భంగముగాకుండ యోజించి తనరాజున కొక యుత్తర మిట్లని వ్రాసెను. "ఇచటఁ బ్రసంగవశమున ఒంటిస్తంభము గృహరాజుమేడ మారాజు కట్టెనని చెప్పితిని. నవులూరు పోతరాజుగుడియొద్ద మిక్కిలి పూర్వకాలమునాటిదగు తుమ్మచెట్టుగలదు. దానినిఁ గొట్టించి నేనిపుడు పంపునట్టి యీయుత్తరమును పోతరాజుముందుంచి వత్తురేని తెల్లవారువరకది పోతరాజుయొక్క యోగబలమున గోటలోనికిఁ జేరును. దానిని చెక్కించి శీఘ్రకాలమున మేడగట్టింపుడు. ఈ సంస్థానమునుండి కొంద ఱది చూడవచ్చుచున్నారు. వారు వచ్చుతఱికది సిద్ధపడి వలసియుండును. మీరు తత్క్షణంబ యట్లుసేయవలయు"నని రాజుపేర నొక యుత్తరమును, పోతరాజు దేవత పేర నొక యుత్తరమును వ్రాసి పంపెను. అంతట రాజును సంతసించి యట్లే చేసి తొమ్మిదిదినములలో మేడ సిద్ధపఱిపించెను. విద్యానగరసంస్థానమునుండి భృత్యులు వచ్చుతఱికి మేడ చిత్రవిచిత్రవైఖరులతో నిర్మించి మేడ మధ్యమున "ఆదిలక్ష్మీకామేశ్వరీ"అమ్మవారిని కొలువుతీర్చి దివ్యవైభవములతో నొప్పఁ జేసెను. దీని శిఖరమునకును బొల్లుమూరి వెంకటేశ్వరుని గుడి శిఖరమునకును సువర్ణతోరణమును గట్టించెను.

వారదిచూచి యత్యద్భుతమొంది తిరిగి విద్యానగరమునకుఁ



బోయి యీ వృత్తాంతమంతయుఁ జెప్పగా రాజును మిగుల సంతసించి శ్రీనాథునకు బహుసత్కారముల నొనర్చి మెతుకుసీమ కైలాసకోట సీమ జాగీర్లు నిచ్చెను.

అవి గైకొని శ్రీనాథుడు మరలివచ్చి తన రాజునకా సీమల నొప్పగించెను. రాజు సంతసించి పూర్వమున రుక్మిణి పూజించిన పార్వతి యని చెప్పఁబడు ముల్లగూరమ్మ (అమీనాబాదు) కు నాలయమునుగట్టించి నిత్యనైవేద్యదీపారాధనకై కడగలకొండపై ముల్లగూరగ్రహారము గట్టించి దీనిని ములకలూరును ధారవోసి యిచ్చి అమ్మవారి పసుపు కుంకమకై బండారుపల్లె అగ్రహారమిచ్చెను. ఇదిగాక కొండవీటియందు నాగారమ్మ వేములమ్మ దుర్గమునఁ గల పుట్టలమ్మ ముత్యాలమ్మ మొదలగు దేవతలందఱికిని మహోత్సవములకు వసతులేర్పఱచెను. ఈవిషయము దండకవిలెయందుఁ జెప్పఁబడినది. ఆంధ్రుల చరిత్ర 3 వ భాగమున శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఈ విషయమును వ్రాసి "దీని యాథార్థ్య మెంతవరకు విశ్వసనీయమో చదువరులె నిర్ణయింతురుగాక" అని వ్రాసిరి. ఈ కాలము ననుసరించి పోతరాజున కుత్తరము వ్రాయుట మొదలగు విషయములు నేటివారు నిరసించినను గృహరాజు మేడనిర్మించుటయందేమి యసంభవము గలదు? సర్వసమర్థుఁడగు శ్రీనాథుఁడు పరసంస్థానమున భాషించుటలో, నెచటను లేదనుకొనిన విషయమును తాను తమసంస్థానమునఁ గలదని కీర్తిప్రకటనకై చెప్పి దానిని నిల్పుటకై మేడ నిర్మించునట్లు చేసియుండవచ్చును శీఘ్రకాలమున మేడ నిర్మింపఁబడియుండవచ్చును. దీనిని కేవలమసత్యమని త్రోసివేయుట కెంతమాత్రము వలనుపడదు. ఏలయన ఫిరంగిపుర శాసనమునగల "అశ్రాంతం గృహరాజసౌధ" యను శ్లోకార్థమును జూడ దీని సత్యము వేద్యమగును. మఱియు నిప్పటికిని కొండవీటిన గృహరాజుమేడ దిబ్బలు గనుపట్టుచున్నవి. అచ్చటిజనులు వాటిని "గుర్రాజు మేడలు" అని చెప్పుచున్నారు.

## శ్రీనాథుడు సర్వజ్ఞ సింగమనాయునికడ కేగుట.

శ్రీనాథుఁ డొకప్పుడు కార్యాంతరమున రాజాజ్ఞపై వేంకటగిరి

ప్రభువగు సర్వజ్ఞసింగమనాయనియొద్దకుఁబోయి యాతఁడు గొప్ప విద్వాంసుఁడగుటచేఁ దన కేమి తప్పుపట్టునో యని జంకియో లేక యేలనో ముందుగ నిష్టదేవతయగు శారద నిట్లు స్తుతించెను.

"సీ॥ దీనారటంకాల తీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్యనైషధగ్రంథసందర్భమునకు
పగులగొట్టించి యుద్భటవివాదప్రౌఢిగాఢడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద
గీ॥ తే॥ మెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద రావు సింగమహీపాలు ధీవిశాలు
నిందుకొలువున నెలకొనియుండి నీవు । సరససద్గుణనికురుంబ శారదాంబ"

ఇట్లు చెప్పి పిదప ప్రసంగవశమున సింగభూపాలునిపై నిట్లు పద్యము చెప్పెను.

క॥ సర్వజ్ఞ నామధేయము ।
శర్వునకే రావుసింగజనపాలునకే ।
యుర్విం జెల్లును తక్కరు ।
సర్వజ్ఞుండనుట కుక్కసామజమనుటే ॥

శ్రీ నాథుఁడచటికిఁజనినకార్యము కవిజీవితమున నిట్లు వ్రాయఁబడినది.

"పెదకోమటి వేమనపై నసూయవలన సర్వజ్ఞసింగమనీఁడు తమ్మ తసుకొకటి చేయించి దానియందు వేమారెడ్డి విగ్రహముచెక్కించి దినదినమును వేమారెడ్డియని తలంచి యుమ్మివేయుచుండెను. అది యితఁడు విని బలవంతుఁడగువానిని దండింపజాలక మఱియొకరీతి నది మాన్పింపుమని సమర్థుఁడగు శ్రీనాథుని బంపెను. అతఁడీపద్యములు చెప్పి రాజును మెప్పించి యేమి కోరెదువన నాతఁడి నీచకృత్యము మానుడని కోరగా నాతఁడట్లె మానెను. పై "సర్వజ్ఞపద్యమును చెప్పి"నట్లు వేమన విని శత్రుని నీ వట్లేల పొగడితివని యాగ్రహింప దాని కాతఁడు నేను చెప్పినదానిని వా రర్థముచేసికొనరయిరి. సర్వజ్ఞపదము శివునకు దక్క యితరులకేయుర్విని జెల్లును. అట్లనుట కుక్కనుయేను గనుటే అని చెప్పితినని చెప్పి రాజునుసమాధానపరచెను."

ఆంధ్రులచరిత్రమునందు శ్రీయుత చిలుకూరు వీరభద్రరావు పంతులుగారీ విషయమును జర్చించి—



"(1) కంచుఢక్కఁ బగులగొట్టించినంతటి శ్రీనాథుఁడు సర్వజ్ఞసింగమనాయనికి జంకి "దీనారటంకాల" యను పద్యము చెప్పుట హాస్యాస్పదము.

(2) తనచే సర్వజ్ఞబిరుద మియ్యబడిన వేమయను కుక్కయని భావము వచ్చునట్లు విరోధిసభలో "సర్వజ్ఞ" పద్యము చెప్పెననుట హాస్యాస్పదము.

(3) సర్వజ్ఞపద్యమునకు తనరాజుకడ వేఱర్థము చెప్పి సమాధానపరిచెననుటయు విశ్వాసపాత్రము కాదు.

(4) విద్వాంసుడై సర్వజ్ఞనామమునొందినంతటి ధీవిశారదుడగు సింగమనాయు డుమ్మియూయునంతటి నీచమునకుఁ బాల్పడునా?"
అను నాలు గాక్షేపణలను జూపి యీగాథ హాస్యాస్పదమైనదనియు అవిశ్వసనీయమనియు వక్కాణించి యున్నారు. వారి యూహ సరి కాదని నా యభిప్రాయము. కారణము లీక్రింద నుదహరించుచున్నాను.

సమాధానములు.

(1) ఎంతటి కవియైనను తాను కవితారచనాక్రమంబున కుపక్రమించునపుడెల్లను, తొలుదొలుత నిష్టదేవతాస్తుతి యొనర్చుట, ముఖ్యముగ వాణీస్తవమునర్చుటయు; సంప్రదాయమై యున్నది. డింపిమ భట్టు ఢక్కఁ జెక్కలుచేసిన నాఁడిక్కవి శారదాంబాస్తవమునర్చి యుండఁడా? డిండిముని జయించిన మాత్రమున శ్రీనాథుఁడిక సారస్వతాధిదేవతయగు సరస్వతిఁగూర్చి నతియొనర్పరాదో? సాధారణముగ దర్శనార్థముగాని, వేరొండు కార్యమునకుఁగాని గొప్పవారిసన్నిధికి అందును రాజుల యోలగంబులకుఁ జనుచుండువారు, కార్యసిద్ధికొఱకు దైవమును లోఁ దలంచుచు పెక్కు మ్రొక్కు లర్పించుచుందురు. ఇది యాంధ్రులపద్ధతికి వ్యతిరేకము గాదు. అట్టిచో మహాకవియగు శ్రీనాథుఁడు, బలవత్తరకార్యభారము పై వైచుకొని తన చతురకవితా రచనాయుతంబగు వింత పొగడ్తచేఁ దనరాజువిషయమును గూర్చి, సర్వజ్ఞసింగమనాయనితో ముందలింపఁ జనునపుడు, తన యభిమతం

దీర్చుమని వానినొక్క పద్యముతోఁ బ్రార్థించుట కూడదా? ఇది హైందవాచారధర్మములకు విరుద్ధమగునా? ఇందు సంశయము గలిగించు వింత యేమున్నది?

(2) పగఁబూని కత్తిగట్టిసాధింప నలవిగాని కార్యమును శత్రురాజకడ ననుకూలముగఁ దీర్చుకొనుట కిట్టి విచిత్రాభిప్రాయగర్భితంబగు రచనాచతురిమగల పద్య మొనర్చుట హాస్యాస్పదమనుట మిగుల హాస్యాస్పదమే యగును. నిరంకుశులగు కవు లిట్టి కల్పనలకు సందర్భానుసారముగ వింత వింత యర్థములఁ గల్పించి మెప్పించుచుండుట సహజము. సర్వజ్ఞబిరుదము సింగమనాయనికిఁ గూడ నుండుటచేతంబున దానిఁ బురస్కరించుకొని శ్రీనాథుఁ డట్లు వ్రాసినాఁడు; గాని తత్సాక్షాత్కారమున తన తేలి నిందింప వొరకొనలేదు. మఱియు నా సభలో నట్లు చెప్పవలసిన యక్కర యుంటచేఁ దన భావమంతయు "సర్వజ్ఞ" బిరుదముపైఁ జూపి యున్నాఁడు; గాని యప్రస్తుతమగు వేమయ "సర్వజ్ఞ చక్రవర్తి" బిరుదమును దృక్పథమునఁ బెట్టుకొని యట్లు వచించి యుండఁడు.

(3) ఈ కాలమున చరిత్రకారులకుఁ గల్గిన యనుమానమే నాడు వేమయకును గలిగి యాతఁ డట్లేలఁ జెప్పితివని శ్రీనాథుని నడుగుటలో యసంభవమేమున్నది? మహాకవి యగు శ్రీనాథుఁడు చమత్కారార్థసమన్వితమగు నా పద్యమందలి తన నిజాభిప్రాయము నాతనికడ వెల్లడించుటలో నేమి యసందర్భ మున్నది?

(4) విద్వాంసుఁడైనను, సర్వజ్ఞబిరుదమండితుఁడైనను, ధీవిశారదుఁడైనను "సింగమనాయఁడు" ప్రాపంచికసౌఖ్యాభిలాషియు, బల, పౌరుష, యశోధనార్జనాభిమానియును నగు మనుష్యుఁడు; గాని తిట్టినను కొట్టినను లాగినను సూరకొనునట్టి సాధువును, శత్రులపై ద్వేషములేనట్టివాఁడును కాడు. అయినను ఉత్తముఁడు గాకపోలేదు. అంత మాత్రమునఁ దన శత్రువును కొంచెపఱుప నాతఁడు ప్రయత్నింపలేదనరాదు. నీచమో ఘనమో శత్రువు నెవ్విధముననైనను నవమానపఱచుటయే యాతనికిఁ గావలసిన కార్యము. రాజుగాన నాతఁ డట్లు



చేసినను పాపమురాదు. ఇవ్విధము నెఱింగియే సర్వజ్ఞసింగమనీఁడట్టి యమ్మెయి యాయు కృత్యమునకుఁ బాల్పడియుండును.

పెదకోమటి వేమనధర్మములు.

ఈతఁడు ముల్లగూరమ్మకుఁ జేసిన ధర్మములు ముల్లగూరమ్మను గూర్చి వ్రాసినచోట నుదహరింపఁబడినవి.

పొన్నపల్లి కసువూరు (కృష్ణాతీరమున) శా॥ ౧౩౨౫ సం॥ పుష్య బ 30 న గ్రహణకాలమున బ్రాహ్మణులకిచ్చి శ్రీనాథునిచే శాసనము * వ్రాయించి యిచ్చెను. విద్వాంసుఁ డగు నీతఁడు అమరుకకావ్యమునకు, "శృంగారదీపిక" యను వ్యాఖ్యానము వ్రాసెను.

సంతాన సాగరము.

ధరణికోట (ధాన్యవాటి) ప్రభువగు గన్నమహీపతికూతురును సీతసిభార్యయు నగు సూరమాంబ సంతానసాగరమను పేర నొక గొప్ప తటాకమును వేయించి శ్రీనాథునిచే నీ క్రింది (శా॥ ౧౩౩౧ విరోధికృతు ఫాల్గుణ బ ౨ శుక్రవారమునాడు) శాసనము వ్రాయించెను. ఈ చెఱువు ఫిరంగిపురము మొదలు మేడికొండూరు వరకును గలదు. కట్ట ఆఱుమైళ్ళపొడవు. తూము లచ్చటచ్చటఁ గనుపట్టుచున్నవి. ఎన్నియో తెలియరాదు. సూరమాంబ కొండవీటికి వాయవ్యదిశ విద్యాపూడియని పూర్వనామముగల ఫిరంగిపురముచెంత సూరమాంబాపురమని యూరుగట్టించెను. ఈ గ్రామమిపుడు నామావశిష్టము.

§ ఫిరంగిపురము శాసనము.

శ్లోకములు—

1 కల్యాణం జగతాం తనోతు సవిభుః కాదంబినీమేచకః
క్రీడాక్రోడతనుః పయోధిపయసో విశ్వంభరాముద్వహన్
భాగో పేతఫణీవివర్తనకలానౌకాదాయయస్యాభవ
నిర్యత్నా భుజగేంద్రమౌళిమణిభిర్నీరాజనప్రక్రియా ॥

2 తమోహారిం తాంతదపువ్యకంతౌ । రాకాముఖ్యాకాల్యావరశైలభాజౌ ।
రథాంగలీలామివదర్శయంతౌ । పురాపురారేః పృథివీరథస్య ॥

---

* మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ లోకల్ రికార్డుల 48 వాల్యూం పుట.

§ ఫిరంగిపురమున వీరభద్రుని దేవాలయమునందున్న శిలాస్తంభమునం గలదు.

3 మానుషాకారకిమ్మీర । స్తంబేరతు వపుర్మహా ।
ఉన్నీయతు భద్రాణి రుద్రాణీయోవనుప్రజా

4 యస్మాత్కౌనిహితం చిరాయనిగమైర్థేయంచ యద్యోగిభి
ర్లక్ష్మీమృదుపాదపద్మయుగళీ సంవాహనైర్లాలితం
జాతాయాత్రవియన్నది త్రిజగతీసంతాపనిర్వాపణీ
తస్మాత్క్రౌంచభిదఃపదాదభవదర్ణోగుణార్ణోనిధిః ॥

5 తత్రాభవస్సప్తమచక్రవర్తీ వేమక్షితీశోజగదేకపాలకః
ఏకాదశీతిప్రతిభాతిశంకా యేనావతారాఃపరమస్యపుంసః ॥

6 రాజ్యం వేమస్సచివమకరో త్ప్రాజ్యదానైకతానో
భూమీదేవైర్బుధమురుభుజో భుక్తశేషానుభుజ్జ
శ్రీశైలాగ్రాత్ప్రభవతి పథిప్రాప్త పాతాళగంగ
సోపానాని ప్రమథపదవీ మారురుక్షుశ్చకార ॥

7 మాచక్షోణిపతి ర్మహేంద్రమహిమా వేమక్షితీశాగ్రజో
రామాద్యైః సదృశోబభూవసుగుణై స్తస్యాత్రయోనందనాః
కీర్త్యాజాగ్రతి రెడ్డిపోతనృపతిః శ్రీకోమటీంద్రస్తతో
నాగక్ష్మాపతి రిత్యుపాత్తవపుషో ధర్మార్థకామాఇవ ॥

8 అనూతపుత్రం పెదకోమటీంద్రో । విశ్రాణనే కర్ణమనూనపుత్రం
వేమాభిధానం సుగుణైకధానం । పాథోనిధిర్నాథమివాపదీనాం ॥

9 ధాటీదుందుభిభాంకృతింకలయతో నిర్ఘాతరావం రిపూ
నామానిద్రుత మజ్జనస్య జపతో యస్యాజిగాండీవినః
సంగ్రామోపపదానితానిభవతాం రక్షాకృతేస్సర్వదా
వర్ణ్యంతామితి బోధయంత్యధిపతిం ధీయంత్రిణోమంత్రిణః ॥

10 శ్రీశైలస్థిరమూలతాముపగతా వృద్ధింతుమారాచలే
పంచారామతలే ప్రదానకుసుమా సింహాచలేంద్రేతతః
శ్రీకూర్మే పురుషోత్తమే కుసుమితా యద్ధర్మకీర్త్యోర్లతా
కాశ్యాం విశ్వపతేః పురఃఫలవతీ నిత్యోపహారోచితం ॥

11 అభిమన్యకరగ్రాహ్య ముత్తరాం ఖడ్గపుత్రికాం
నర్తయత్యాహవేరంగే యస్సంగ్రామధనంజయః ॥

12 అక్రాంత్వాం గృహరాజసౌధనివస ల్లక్ష్మీకరాభ్యంతర
క్రీడాంభోరుహతాళవృంతనటన ప్రస్తావవిస్తారితః
వాయుఃకేసరవాసవాసురభితో యస్యార్థిచింతామణే
ర్దారిగాచామతిదానకేళిజనితం స్వేదాంభసంజాలకం ॥

13 సప్తసంతానవత్యాసీ ద్యేనసర్వంసహేత్యలం
స్పర్ధయేవద్ధ్రతాఃకీర్త్యా గర్భేలోకాశ్చతుర్దశ ॥



14 రాజ్ఞస్తస్యమహాదేవీ రాజమాతేతివాంబికా
రత్నసింహాసనస్యార్ధే రాజతే సూరమాంబికా ॥

15 శాకాబ్దే శశి రామ రామ ధరణీ సంఖ్యే విరోధ్యాహ్వయే
వర్షే ఫాల్గుననామ్నిమాసిబహుళే పక్షే ద్వితీయాతిథౌ
దేవీ సా పెదకోమటీశ్వరభువః శ్రీవేమపృథ్వీపతేః
శ్రీసంతానపయోనిధేః కృతవతీ స్వస్యకప్రతిష్ఠావిధిం ॥

16 లీలాలీఢతరంగశీకరకణం రాకావిధారంతుణా
హారంచేణమదోన్మకాంతివిధయే హేలావగాఢంముహుః
రాజీవాంసకరధ్యహంసపరివ చ్చంచూపుటేచర్వితా
స్వచ్ఛాంభోజమృణాళికా కిసలయ చ్ఛేదంయదీయంపయః ॥

17 ఘోటీగ్రాకంఠ కఠోరగర్భకుహాళీ పాళీమధూళీరస
స్రోతస్సారభటీకమానమధులి ఢ్ఘంకారకోలాహలైః
వాచాలాని వనాని యస్యసవిధే సోయంసుధానిర్మల
శ్రీసంతానసముద్రనామపయసాం రాశిర్జయత్యద్భుతః ॥

18 వైదూర్య రత్న కమలామల వారిపూరే
మజ్జంకిమత్రభగవాన్ మధుకైటభారిః
అంగీచకార జగతా మవనచ్ఛలేన
పాఠీన కచ్ఛప వరాహ మహావతారాన్ ॥

శ్రీ మహా భారతే :—

19 దేవా మనుష్యాఃపితరో గంధర్వోరగరాక్షసాః
స్థావరాణిచభూతాని సంశ్రయంతి జలాశయం ॥

20 తటాకేయస్యగావస్తు పిబంతితృషితాజలం
మృగపక్షిమనుష్యాశ్చ సోశ్వమేధఫలంలభేత్ ।

21 ఆస్ఫోటయంతిపితరః ప్రనృత్యంతిపితామహాః
అపినస్సకులేజాతో యస్తటాకం కరిష్యతి ॥

22 విద్యాధికారిశ్రీనాథో వీరశ్రీవేమభూపతే
అకారోదాకరోత్తాచాం నిర్మలం ధర్మశాసనం ॥

సీ॥ శాకాబ్దములు సహస్రమును మున్నూటముప్పదియొకండును నైన భవ్యసంఖ్య (1331)
వఱలు విరోధిసంవత్సరంబున ఫాల్గునంబున బహుళపక్షంబువిదియ
శుక్రవారంబున శుభముహూర్తంబున శ్రీధాన్యవాటిపురాధిపతియు
కృష్ణవేణ్ణాజలక్రీడావినోదుండు నగు గన్నభూపాలు వనుగుబుత్రి
తే॥ వీరనారాయణుడు వేమవిభునిదేవి । భూరిసద్గుణనిధియంబ సూరమాంబ
జగము వినుతింప సంతానసాగరాఖ్య । వరతటాకప్రతిష్ఠోత్సవంబొనర్చె॥

సీ॥ జాహ్నవీ యమునాది సకలపావననదీ విమల తీర్థాంభః పవిత్రితంబు
సవిధదేశస్థాయి శివమౌళిబాలేందు కౌముదీ సంఫుల్ల కైరవంబు
బహుమహాపరివాహ పాథోభవద్ఘన ఘుమఘుమాయితదశాగోళకంబు
జలసారణీనేక సంవర్ధితానేక వనవినీతాధ్వగాధ్వశ్రమంబు
తే॥ బలవదురు మత్స్య కచ్ఛప ధుళిధుళీక : తిమితిమింగల విక్రమక్రమవిహార
తరళతరతుంగ భంగకదంబ చుంబి ।। తాభ్రవీథి సంతాన మహాపయోధి॥

సీ॥ కపటసూకరమైన కైటభాసురవైరి ఖురపుటంబులఁ బరిపూర్ణమయ్యె
రఘుకులోద్భవు ధనుర్యంత్రముక్తమౌ చిచ్చుటమ్ముల వేడిఁ జేవదేఱ
కుంభసంభవుని హస్తాంభోరుహంబున నాపోశనంబయి ప్రాదకొందెఁ
పాషాణముల నచ్ఛభల్ల గోలాంగూల కపియూథములచేతఁ గట్టుబడియె
తే॥ వనధి యేభంగి సరివచ్చు ననగవచ్చు । వారసారల గంభీరవారియగుచు
నగతాపాయమగుచు శోభాఢ్యమగుచు । ననుపమంబైన సంతానవనధి తోడ॥

## రాచవేమారెడ్డి.

పెదకోమటివేమయకుఁ దరువాత రాజ్యమున కాతనిసుతుఁడగు రాచవేమన సింహాసనమెక్కెను. ఈతఁడు క్రూరుఁడై అనేకవిధములగు పన్నులు యేర్పరచి ప్రజలను బాధపెట్టుచు జనకంటకుఁడై యుండెను. అందు "పురిటిపన్ను" అనునది యొక్కటి. ఆ పురిటిపన్ను తుదకు రాచవేముని మరణమునకు గారణమయ్యెను. ఎట్లన; సోమయల్లప్పయను బలిజనాయకుఁడు పురిటిపన్నుకొరకు బలవంతపెట్టఁబడి ఆతఁడు బలత్కారపద్ధతిఁ దొలగించుకొన వేఱుమార్గముగానక ముత్యాలమ్మగుడి (గుండ్లు) యొద్ద కటారున రాచవేముని బొడిచి చంపెను. ఈవిషయము దండకవిలెయందు గలదు. దీని నిజస్థితి యెట్లున్నను రెడ్డిరాజులందఱిలో నితఁడు మిగుల క్రూరుఁడనియును, ఇతని పాలన కాలమున దేశమశాంతిభూయిష్ఠమై, జనుల కిక్కట్లుమెండై యుండెననియు; రాజ్యాంగమువారిలోఁగూడ నీతని విషయమున భిన్నాభిప్రాయములు గలవనియు నూహింపవచ్చును. రెడ్డిరాజుల పాలన మీతనితో నంతరించుటయే యిందుకుఁ దగిన నిదర్శనము.



* ఈతఁడు తనతల్లియగు సూరమాంబ వేయించిన తటాకమునకు "జగనొబ్బగండకాలువ" యను నొక వరువకాలువం ద్రవ్వించెను. రాచవేముని యనంతరము రాజ్యము గజపతుల కధీనమయ్యెను.

## వేమన యోగి.

వేదాంతియై పద్యములుచెప్పిన వేమన కొండవీటివాఁడనియు, రాచవేమన తమ్ముఁడనియు, చిన్నతనమున నతివ్యభిచారియై పిదప యోగియై పద్యములు చెప్పెననియు మొదలగు విషయములను శ్రీ పూర్ణయాచార్యులుగారు "వేమనసూక్తిరత్నావళి"యందు వ్రాసిరి. యోగి వేమన యిచటివాఁడని తెలుపు నిదర్శనము లెందును జూపట్టవు. వారేయాధారమునుబట్టి యట్లు వ్రాసిరో తెలియరాదు.

## రెడ్డిరాజుల కాలమున గల దుర్గపాలక నాయకులు.

రెడ్డిరాజుల కాలమున దుర్గసంరక్షణార్థమై నియమింపఁబడిన నాయకులపేర్లు దండకవిలెయందు వ్రాయఁబడినవి. కాని యేయే రాజుల కాలమున నెవరుండినదియు తెలుపఁబడలేదు. ఈ నాయకుల నామములు వీరి తరువాత వారిసంతతివారికి గృహనామములై యొప్పుచున్నవి.

## వెలమనాయకులు.

| | |
|---|---|
| 1 ఉదయరావు | 4 జన్నపనేడు |
| 2 రంగపతిరావు | 5 భూషణరావు |
| 3 సూరపనీడు | 6 కటికినేడు |

---

* (అమీనాబాదువద్ద పుల్లరిబోటిపైగల శాసనము) (1387)

సీ॥ "శాకాబ్దములు సహస్రంబును మున్నూటముప్పదియేడును నొప్పుమిగుల
మహనీయమైన మన్మథవత్సరంబున మాఘమాసము బూర్ణిమాదినమున
హేమాద్రిదానచింతామణి యరిరాయ బసవశంకరు డాజిఫల్గుణుండు
సమదారిరాయ వేశ్యాభుజంగుండు వేమయరాచవేమన క్ష్మావరుండు
తే॥గీ॥ తల్లిసూరమాంబచే సముత్పన్నమైన । జరగు సంతానవార్ధికి వరువగాగ
నొనరు గిరివాహినుల జగనొబ్బగండ । కాలువ ఘటించె నాచంద్రతారకంబుగాగ"

శ్రీ[illegible]

7 రాజనరావు　　9 గణపతిరావు　　11 పేర్నీడు.
8 మాచనేడు　　10 నాయకరావు

బలిజనాయకులు.

1 వినోదరావు　　11 విప్పలకొండనాయకుడు
2 మహీపతిరావు　　12 పంద్రంగి గామానాయకుడు
3 భూపతినాయకుడు　　13 శ్రీగిరినాయకుడు
4 బల్లెనాయకుడు　　14 బీరం రంగానాయకుడు
5 అక్కనాయకుడు　　15 జక్కానాయకుడు
6 రామానాయకుడు　　16 తులువా వెంకటాద్రి
7 ఇక్కుర్తి తిమ్మానాయకుడు　　17 విశంశెట్టుడు
8 ముత్యాలనాయకుడు　　18 అంపట చంద్రానాయకుడు
9 శింగనాయకుడు　　19 కుందనీడు
10 సూరానాయకుడు　　20 మంగరౌతు
　　21 బీసాబత్తుడు

తురకనాయకులు.

1 భజత్ నాయకుడు　　5 అబ్దుల్ నాయకుడు
2 కరీంనాయకుడు　　6 దావల్ జీనాయకుడు
3 హస్సన్ నాయకుడు　　7 అల్లినాయకుడు
4 ఖాదాఖండ్ నాయకుడు　　8 బాదానాయకుడు

వీరు * హాంశంనాయకులుగా నుండి దుర్గములను కాచుచుండినవారు.

* రెడ్డిదత్త అగ్రహారములు.

శ్లో॥ అబ్దం వేమమహాభుజాశరవే శ్రీభోగలింగస్య చ

---

* కొమ్ములు ౧౨౦౦౦ అయితే యొక కొత్తడం. రెండు కొత్తడములైన నొక హాంశము. చూ. దండకవిలె.

* రెడ్డిదత్తాగ్రహారములు నలుబది నాలుగని యుదహరించుచు నంతకు మించిన సంఖ్యగల నామములు దండకవిలెయం దుదహరింపబడినవి. ఈ వ్యత్యాసమునకు గారణము మృగ్యము. మఱియు నీ జాబితాయందలి యూళ్లు అగ్రహారములని కొన్ని దృష్టాంతరములు ధృవపడుచున్నవి.



త్సంతస్తే సహనూర నార్యసుధియా ధారాపయః పూర్వకం
అగ్రేయేన వసుంధరైక విభునా స్వయ్యాప్యభోగాష్టకః
పాతుం చిర్వవినామకం శిరిపురి ప్రఖ్యాత మోతద్భువి॥ (ఇందు తప్పులున్నవి.)

శ్లో॥ త్రయో వేగినులేనేభ్యో ద్రావిడేభ్యోపి పంచచ
వెలనాటికులేభ్యశ్చ షట్త్రింశద్గ్రామసత్తమాః
శ్రీకృష్ణ వేణితటీపుష్య మేషు శ్రీతుంగభద్రాతటీపుష్య మేషు
శ్రీరెడ్డిభూపాలక రాజవర్యైః బాహ్యాగ్రహారా గతివేగసంఖ్యాః

దీనివలన రెడ్డిరాజులు వేగినాటి బ్రాహ్మణులకు 3. ద్రావిడులకు 5. వెలనాటివారికి 36. వెరశి 44 అగ్రహారములను కృష్ణా తుంగభద్రా (గుంటూరుమండలము తెనాలితాలూకాలోనిది) నదీతీరముల నిచ్చినట్లు దండకవిలెయందు వ్రాయబడినది. కాని 44 గ్రామములును యే కాలమున నెవరికి యెవరు దానముచేసినదియు స్పష్టముగా లేదు. కొన్ని శాసనములు మున్నగు నాధారములను బట్టి కొన్నింటి గురుతులుమాత్రము తెలియగలవు. అగ్రహారములపట్టిక యొకటి దండకవిలెయందు వ్రాయబడినది. దాని నీ దిగువ ప్రకటించుచున్నాను.

అగ్రహారములు

1 చినపులివర్రు　　4 పెనుమూడి
2 గురువిందపల్లి　　5 అనంతవరం
3 అద్దేపల్లి　　6 పెనుమర్రు
7 పెదకోకిపర్రు (పెదకోడిపర్రు అనియు గలదు)
8 పెరవలి, వేమారెడ్డి శా॥ ౧౨౯౬ పార్థివ కార్తికమాసమున కొందఱు బ్రాహ్మణుల కిచ్చెను.
9 పొన్నపల్లి (పెదకోమటి వేమన శా॥ ౧౩౩౦ సర్వధారి నయిచ్చెను.)
10 ఆరేపల్లి　　13 గుండ్లపల్లి
11 గూడవల్లి　　14 క్రాప
12 నడింపల్లి　　15 కొల్లూరు

16 పిడపర్రు
17 చిలుమూరు
18 అంగలకుదురు
19 వలివేరు
20 పెదకొండూరు
21 తుమ్మపూడి
22 శృంగారపాడు
23 కురగల్లు
24 పెదవడ్లపూడి
25 బ్రాహ్మణకోడూరు (మాధవపెద్ది నాగేశ్వరశాస్త్రికి అనవేమారెడ్డి యిచ్చెను)
26 పెదచెరుకూరు (శా॥ ౧౨౯౩ విరోధికృతు ఆషాఢ శు ౧౫ కొందఱు బ్రాహ్మణులకు అనవేమారెడ్డి యిచ్చెను)
27 మంచాళ (దేసటివేమారెడ్డి శా॥ ౧౩౨౧ న శిష్టా వల్లభశిష్టునకిచ్చెను.)
28 కసువునూరు (పెదకోమటి వేమన శా॥ ౧౩౨౫ తారణలో పుష్య బ ౩౦ నిచ్చెను.)
29 నాగండ్ల (శా॥ ౧౨౮౭ న కంభంపాటి కొండుశాస్త్రికిని బిజిముళ్ళ సోమశాస్త్రికిని అనపోతవేమన యిచ్చెను.)
30 రాచపూడి
31 కొణిదెన
32 యక్కటిలపెనుమర్రు
33 చిన్నులూరు
34 పెదరావూరు
35 పెదపూడి
36 పినపాడు
37 కొండతాటిపర్రు
38 తూర్పుదండమూడి
39 దక్షిణగుడిపూడి
40 దక్షిణమర్రిపూడి
41 ధరణికోట
42 ఉత్తరగోరంట
43 గరికపాడు (కుడమటి)
44 కొల్లిమర్ల
45 ముట్లూరు
46 పెనుమూడి
47 పెనుకుదురుపాడు
48 గడ్డిపాడు
49 బండారుపల్లి

---

## అయిదవ ప్రకరణము.

---

### లాంగూలగజపతి.

రెడ్డిరాజులకుఁ బిమ్మట కొండవీటినిఁ బాలించినవాడు లాంగూల గజపతి. ఇతనికి రెడ్డిరాజులయొద్దనుండి రాజ్యమెట్లువచ్చెనో తెలియరాదు. కాని రెడ్డిప్రభువులలో చివరవాఁడగు రాచవేమునకుఁ గలిగిన దుర్మరణమువలన దేశమరాజకమైయుండ నీతఁడు వచ్చి యాక్రమించియుండవచ్చునని చెప్పవచ్చును. ఈతని కాలము మొదలగు విషయములనుగూర్చి తెలిసికొనఁదగు నాధారములెవ్వియు గానరావు. ఇతఁడు కొండవీటికొండపై పెద్దమాలెముకోట, చిన్నమాలెముకోటయను రెండు కోటలు కట్టించి శా॥ ౧౩౪౨-౧౩౫౩ (క్రీ॥ 1420-1431) వరకు బాలించెననిమాత్రము దండకవిలెయందు వ్రాయఁబడినది. కాని శా॥ ౧౩౬౪ వరకేలెనని వినుకొండ కైఫియ్యతున వ్రాయఁబడినది. ఈ కాలము రాచవేమన చరమకాలమునకు సంబంధించుచున్నది. కాన నిది సరియైయుండును. ఈతఁడు సింహాచలమునందు వరాహనరసింహస్వామినిఁ బ్రతిష్ఠించెననియు, నితనికి తోక కలదనియు, అందువలన నీపేరు వచ్చెననియు శ్రీ మెకంజీదొరవారువ్రాయించిన కైఫియ్యతులందున్నది.

"రెడ్డిరాజుల తరువాతవచ్చిన మహమ్మదీయుల సంగతి నురచి లాంగూలగజపతి రాజ్యమునకు వచ్చెనని చరిత్రకారులు వ్రాసిరి" అని సూయల్ దొరగారు వ్రాసియున్నారు. కాని యీరాజునకును, రెడ్డిరాజులకును మధ్య కాలవ్యవధి యేమియుఁ గానరాదు. కావున నీ యూహకవకాశ ముండదు.

### ప్రతాపదేవరాయలు, హరిహరదేవరాయలు.

లాంగూలగజపతికిఁ బిమ్మట నరపతి సింహాసనస్థులగు విద్యానగరరాజులలోని వారగు ప్రతాపదేవరాయలు, హరిహరదేవరాయలును

కొండవీటిరాజ్యము నాక్రమించి యొకరు 17 సంవత్సరములును, మరి యొకరు 5 యేండ్లును మొత్తము 22 సంవత్సరములు (క్రీ॥ 1431-1454 వరకు) పాలించిరి. వీరెట్లు కొండవీటిరాజ్యమును సాధించినదియు తెలియదు. వీరి శాసనములు పెక్కులుగలవు.

శాసనముల కాలములకును పైఁజెప్పఁబడిన నీకాలమునకును సంబంధించుచున్నది. వీరికాలమున కొండవీటిరాజ్యము కర్ణాటరాజ్యమునఁ జేర్పబడినది.

## కపిలేశ్వర గజపతి.

నరపతి సింహాసనస్థుల తరువాతఁ గొండవీటిరాజ్యమునకు లాంగూలగజపతి కుమారుఁడగు కపిలేశ్వరగజపతి ప్రభువయ్యెను. ఇతడు బెజవాడయొద్దగల పాపవినాశనస్వామికిని, రుద్రపాద స్థలమునకును భూదానములుచేసెను. ఆవివరము *శాసనములవలనఁ దెలియుచున్నది.

* బెజవాడలోని ఇంద్రకీలపర్వతముకడ నిలువురాతిమీఁది శాసనము.

శ్లో॥ శ్రీమద్విజయవాడాఖ్యాం పురీకృష్ణవిభూషణే
ఇంద్రకీలాద్రిమూలాది వాసేపాపవినాశనే
ఈశానాదిపదాదీనాం గయాంకోటిశతానిచ
క్షేత్రప్రయాగకాశీభ్యాం సత్యంశతగుణాధికం
శకా శ్రీమచ్ఛకాబ్దేత్రి వసురగ్నిశశిక్రమాత్ (౧౩౮౩)
రాజాగజపతిక్ష్మాభృ ద్విఖ్యాతో కపిలేశ్వరః
తతస్సరాజ్యమధ్యేతు కొండపల్లిస్థలాంతరే
దత్వాపాపవినాశేన భోగరంగాదికారణం
గ్రామంరమ్యనిపుణ్యాదౌ రుద్రపాదార్చనాదికం
జక్కురేట్పలినామేవా గ్రామందద్యాత్ప్రయత్నతః
అనాశీరేవిభోగార్థం నాగవారమవారితం
తతః క్షేత్రో బ్రాహ్మణేభ్యః జగమళ్ళతసమ్మితం
భోజ్యాధరంలంకపల్లి నాసరంచసయోజితం



కపిలేశ్వరుని కుమారుఁడు "అంబగజపతి" కూడ నీ స్థలములకు మఱికొన్ని భూములనిచ్చెను. కొండవీటిరాజ్యమున కితఁడు తనతండ్రియ తరము ప్రభువైనట్టు చరిత్రలవలనఁ గానరాదు. కపిలేశ్వర గజపతి కుమారుడు వీరభద్రగజపతి (లేక విద్యాధార) యనునతఁ డుండి విద్యాధారపురమును గట్టించెననియు, ఇతనికి భార్య భవానమ్మ, కుమార్తెలు ముత్యాలమ్మ, పైడమ్మ కలరనియు వీరుముగ్గురు దమ నామములతో భవానిపురము, ముత్యాలమ్మపాడు, పైడూరిపాడు (బెజవాడతాలూకా) గ్రామములు కట్టించిరనియుఁ దెలియుచున్నది.

కపిలేశ్వరగజపతి జేసిన విశేషకార్యము లేవియుఁ గానరావు. గోదావరీతీరమునఁ గపిలేశ్వరపురమును గట్టించెనని మెకంజీదొరగారు వ్రాయించిన కైఫీయతులందు గానవచ్చుచున్నది. నూజివీడుయొద్ద కపిలేశ్వరపురమును గట్టించినట్టు కృష్ణాడిస్ట్రిక్టు మ్యాన్యుయలున వ్రాయఁబడి యున్నది.

## ఒక వింత వృత్తాంతము.

ఈతనినిఁగూర్చి మెకంజీదొరవారు వ్రాయించిన గ్రంథములందొక వింతవృత్తాంతము గానవచ్చుచున్నది. దాని నీక్రింద నుదహరించుచున్నాను.

ఇతనిరాజ్యమున క్షామమువచ్చి వర్ష కాలమునఁ దరుణమునకు వర్షములులేక ప్రజలు బాధనొందుచుండగా దేవేంద్రునకు వర్షముకురిపించుమన ట్లొక పత్రికవ్రాయించి పంపి వర్షమును దెప్పింపుమని మంత్రి కాజ్ఞనొసగెను. మంత్రి యట్లు పొసగదనినను వినక, లేఖ వ్రాసి చారులను బంపవేని నిన్ను శిక్షించెదనని పట్టుబట్టెను. అపుడు మంత్రి దేవేంద్రున కుత్తరమువ్రాసి చారులచే నంపెను. చారు లిందులకు రిచ్చవడి

దేవతాభ్యోబ్రాహ్మణేభ్యః భోగభోజనకారణం
దానంసదక్షిణాకంతు గ్రామపంచకతత్క్షణం
ధారాపూర్వమిదంధర్మం శాసనాచంద్రతారకం
మంగళమహా శ్రీంజేయును.

రాజుచే ప్రాణాపాయమగునని చింతిల్లి యేమితోఁచక వారు పత్రిక గొంపోయి జగన్నాథుని యాలయముంజేరి యచట స్వామికోవెల యందు దొంగతనముగఁ బ్రవేశించి యర్చకులువచ్చి పోవువరకు డాగి యుండి పిమ్మట స్వామికిఁ బ్రాణాచారములుపడి "స్వామీ, రాజు దేవేంద్రునియొద్దకుఁబోయి తన పత్రికంజూపి వర్షమును తెండు, లేదేని మీా శిరములు తీయింతునని శాసించె. సంసారములువదలి వచ్చితిమి. మరల వారికడకుఁ బోకతీరదు. రక్షింపు"మని భక్తియుక్తులై తదేకచిత్తులై మ్రొక్కిరి. వారిదైన్యమునకు స్వామి కరుణించి, దేవేంద్రుడువ్రాసినట్లొక పత్రిక వర్షమును బంపెదననివ్రాసి వారికడ పడవైచి స్వప్నమున "వర్షముకురియును, మీాపురములకు బొం"డని చెప్పెను. తత్క్షణము వారువెడలి పత్రికఁగొని తెచ్చి రాజునకిచ్చిరి. తత్క్షణము సమృద్ధిగ వర్షము కురిసి కాలము సుభిక్షమయ్యెను.

కపిలేశ్వరునికాలము.

కపిలేశ్వరగజపతి శా౹౹ ౧౩౭౭-౧౩౮౩ (క్రీ౹౹ 1455-1461) వరకు రాజ్యము పాలించినట్లు దండకవిలెయందుఁ గలదు. పైశాసనము వలనగూడ నీకాలము ధృవపడుచున్నది. ఈతని ప్రతినిధి (గవర్నరు) గండదేవుఁడను నాతఁడు శా౹౹ ౧౩౭౭ నఁ గొండవీటికి వచ్చెననియుఁ, గపిలేశ్వర గజపతి క్రీ౹౹ 1434 - 1469 వరకుఁ బాలించె ననియును Epigraphy G. O. No. 920-Pub. 4-8-1914 న వ్రాయఁబడినది. కాని దీనికిని పైకాలమునకును యిరువదేండ్ల వ్యత్యాయముగలదు. శాసనాదులనుబట్టి దండకవిలెలోని కాలమే సరియని తోఁచెడిని.

పురుషోత్తమ గజపతి.

కపిలేశ్వరగజపతియనంతర మాతని కుమారుఁడు పురుషోత్తమ గజపతి రాజ్యమునకు వచ్చెను.



ఈతఁడు రాజ్యమును విస్తరింపఁజేసెను. మఱియుఁ దన పిత్రార్జితంబగు కొండవీటిసీమ ప్రజల కుపకారార్థమై పెండ్లిసుంకములు తీసివేయించి నిల్పిన శాసనము నీక్రింద పొందుపఱచుచున్నాను.

* "స్వస్తి చతుర్దశభువనాధిపతి శ్రీమత్పురుషోత్తమ దివ్యచరణసేవనానవరత పుంఖానవైరిపరిదర్పమర్దన భుజబలపరాక్రమ, పరమవైష్ణవ పరమభట్టారక జగమూలకారణ, శ్రీపురుషోత్తమపుత్ర శ్రీదుర్గాపుత్ర సూర్యవంశోద్ధార మహారాజాధిరాజ రాజపరమేశ్వర ఇక్ష్వాకుకుల పరమేశ్వర రామచంద్ర చరిత్రాలంకృత పాకనాటి చోళమహామండలేశ్వర నవకోటి కర్ణాట కలబరగేశ్వర పంచగౌళేశ్వర శ్రీవీరప్రతాప పురుషోత్తమదేవ మహారాజాలంకార విజయరాజ్య సమస్తప్రశాహీకన్యా శుద్ధపంచమీ శుక్రవారము స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౪౧౧ అగు కీలకనామసంవత్సర భాద్రపద శుద్ధ ౫ పంచమి శుక్రవారము దుర్గాప్రసాద కొండవీటి సమస్తదేశాల గ్రామాల అష్టాదశవర్ణాల ప్రజలకున్ను పెండ్లిసుంకాలున్ను, అడ్డగడ పేటసుంకాలున్ను ఆచంద్రార్కస్థాయిగా మానితిమి. ఈసుంకములు కరణములు, తెలుగురాజులు యెవరైన తప్పితే గోహత్య బ్రహ్మహత్య శిశుహత్య చేసిన పాపానబోదురు. తురకరాజులు తప్పితే పందినిదిన్న పాపాన బోదురు."

ఇదిగాక భాస్కరమంత్రి చరిత్రమున నీక్రిందివిధమున కీ౹౹ శే౹౹ గుంటుపల్లి సోమయ్యగారొక శాసనము నుదహరించిరి.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౧౪ అగు నేటి విరోధినామ సం౹౹ర మార్గశిర శు ౧౫ లు రాజాధిరాజ మహారాజశ్రీ శ్రీమన్మహామండలేశ్వర శ్రీ వీరప్రతాప గజపతిపురుషోత్తమదేవ మహారాయిలుగారు రాయనభాస్కరునికి యిచ్చిన కరిణీకపు దానపత్రము. మీకు స్థలకరిణీకానకు నడిచివచ్చే వినుకొండసీమలోను కంచర్ల గుడికట్టులోను గట్టిన చినకంచెర్ల వేంకటేశునిపాలెం రఘునాథరాజుపాలెం తిరుమలరాజుపాలెం మాదవరం పెరుమాళ్ళపల్లె మదమంచిన్ని, అయినకంచర్లగ్రామ కరిణీకము యేకభోగంగాను మీకు దయచేయు నౌఖరిస్తిమి గనుక అగ్రామానకు లెక్కవ్రాసుకొని శిలగమేర రక్ష తేజోపార్జనలు మొదలయిన అష్టభోగ తేజస్వామ్యాలు ఆచంద్రార్కస్థాయిగాను మీపుత్ర పౌత్ర పారంపర్యంతరం అనుభవించి సుఖాన వుండుకునేది".

మఱియు 'కోడ' అడవిస్థలమునుఁ గొట్టించి బందరు సమీాపమున నాగులపల్లెమొదలు, యెలమంచి పర్యంతము పూడామడ వైశాల్యముగల స్థలము నేర్పరచి సముద్రతీరమున "పురుషోత్తమపుర"

* కొండవీటిలో ఏనుగులబావియొద్ద దక్షిణపువైపునగల శిలాశాసనము.

అను గ్రామము కట్టించి జగన్నాయకులను బ్రతిష్ఠించి యాగ్రామ మ గ్రహారము చేసెను.

ఇవిగాక (గుంటూరుజిల్లా) నర్సారావుపేట సమీపమున మఱి యొకటి పురుషోత్తమ పట్టణము గలదు. దీనినిగూడ నితడు కట్టించెనని చెప్పుదురు.

ఈతఁడు శా॥ ౧౩౮౪-౧౪౧౮ (క్రీ॥ 1462-1496) వరకు రాజ్యము బాలించినట్లు దండకవిలెయందుఁ గలదు. పై శాసనకాలములుగూడ దీనితో సరిపోవుచున్నవి.

## ప్రతాపరుద్రగజపతి.

పురుషోత్తమ గజపతికిఁ దరువాత నాతని సుతుఁడు ప్రతాపరుద్ర గజపతి రాజ్యమునకువచ్చెను. ఈతఁడు కటకపురి మొదలు ఉదయగిరివఱకుఁగల రాజ్యమును పరిపాలించెను. ప్రతాపరుద్రగజపతి తన పినతండ్రియగు తిరుమల కాంతారాయని ఉదయగిరిదుర్గమున కధిపతిగ నియమించెను. వీరు విద్యానగరపరిపాలకుండగు కృష్ణదేవరాయునకు సమకాలికులు. కృష్ణరాయఁడు దండెత్తివచ్చి ప్రతాపరుద్రుని, ఆతని పినతండ్రిని జయించి, ప్రతాపరుద్రుని కొండవీటిదనుక వెన్నంటి తరిమెను. ఈ వివర మీ క్రిందిశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. కాని దీనికాలము కొండవీటియుద్ధమునకుఁ బూర్వ మొక సంవత్సరము ముందగుచున్నది. కావునఁ గొండవీటి యుద్ధకాలమునకుఁబూర్వ మొక సంవత్సరము ముందునుండియె రాయల దండయాత్ర ప్రారంభమైనట్లూహింపవలసియున్నది.

### ఉదయగిరి శాసనము.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా॥ ౧౪౩౬ చెల్లంగా నామీదవడిచే భావ సం॥ర జ్యేష్ఠ బ ౨ లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణ దేవరాయలు ఉదయగిరి దుర్గముమీద విడిసి ప్రతాపరుద్రగజపతిని కొండవీడుపర్యంతం విరుగఁబొడిచి ఉదయగిరిదుర్గానకు మేసాదవేయించి దుర్గంపుచ్చుకొని ప్రతాపరుద్ర




గజపతివారి పిన్నతండ్రి తిరుమలకాంతారాయనిఁ బట్టుకొని తిరిగి విచ్చేసి యిప్పుడు ఉదయగిరి కోనవల్లభరాయనికి సమర్పించిన నెల్లూరుసీమలోని శికల్లుగ్రామం. యీ గ్రామం వల్లభదేవునికి పూజ పునస్కార నైవేద్య సర్వభోగాలకున్ను ఆచంద్రార్క స్థాయిగా నడుపంగలవారు."

ఇతఁడు శా॥ శ॥ ౧౪౧౯ (క్రీ॥ 1497) మొదలు కొన్ని సంవత్సరములు దేశము పాలించినట్లు దండకవిలెయందు వ్రాయబడినది.

సూయల్ దొరవారు (క్రీ॥ 1496-1497) ఇతడొక సంవత్సరము మాత్రమే రాజ్యమేలెనని వ్రాసిరి. పై శాసనముల ననుసరించి క్రీ॥ 1514-15 వరకును రాజ్యమేలుచుండినట్లును, యితని కుమారుఁడగు వీరభద్రగజపతియు తండ్రితోనే రాజ్యపాలనముసేయుచుండి కొండవీటియందు తానుండి పాలింపుచున్న సమయమున కృష్ణరాయలతో యుద్ధము తటస్థించియుండినట్లు గనుపట్టుచున్నది.

## వీరభద్రగజపతి.

ప్రతాపరుద్రగజపతి కొమరుఁడగు వీరభద్రగజపతి కొండవీటికి రాజై యుండినట్లు శాసనములయందు గనుపట్టుచున్నది. సూయలు దొరవారితనికాలము క్రీ 1497-1515 వరకని వ్రాసిరి.

ఈతని కాలమున కృష్ణరాయలయుద్ధముమాత్రము జరిగినదని తెలియుచున్నది.

---

ఆరవప్రకరణము.

## కృష్ణరాయల దండయాత్ర.

ఆనెగొంది (విజయనగర) ప్రభువగు కృష్ణదేవరాయలు శా॥ ౧౪౩౧ శుక్ల మాఘ బ ౧౪ న పట్టాభిషిక్తుఁడై రాజ్యమేలుచుండి తూర్పుదేశముపై దండయాత్ర వెడలి ఉదయగిరి మొదలు కటకము పర్యంతము గల దేశము నంతయు జయించి గజపతి కొమార్తెను బరిణయమై మరలిపోయెను. ఈ విషయములు యుద్ధానంతరమున వ్రాయబడిన రాయలశాసనములవలన దెలియును. ఈ యుద్ధయాత్రయందు కొండవీటిని శా॥ ౧౪౩౭ (క్రీ॥ ౧౫౧౫) యువసం॥ ఆషాఢ శు ౧౧ శనివారమున ముట్టడించెను. ఈ ముట్టడి మంత్రియగు సాళువతిమ్మరుసు యొక్క సేనాధిపత్యముక్రింద వేయఁబడి యాతనిచే దుర్గము పట్టుకొనబడెనని కొండవీటి రఘునాయకుల యాలయమునందలి శాసనమువలన దెలియుచున్నది. ఈ దండయాత్ర కొక హేతువు దండకవిలెయందు వ్రాయఁబడినది. ఇతర చరిత్రలం దది గానరాదు. దాని యథార్థ మెట్టిదైనను హృదయరంజకముగ నుంటచే ఇం దుదహరించుచున్నాను.

## గాండ్లసంగ కథ.

రాయ లొకనాడు యేనుఁగుపైనెక్కి నగరమున విహారము సేయుచు నొక భోగస్త్రీయ (గాండ్లసంగ) ను జూచి మోహించి దానిని తన యంతఃపురమునకు రప్పించి భోగించుచుండెను. ఇట్లుండ నొకతరి రాయలు తన పట్టపుదేవితో భాషింపుచుఁ దన భోగకాంత నామెకు సరిగాఁబోల్చి యేదో ప్రశంసించెను. అందుల కాయమ రోషమూని "తెచ్చినది గజపతివారి కుమార్తె కాదు. భోగకాంతయె కదా" అని నిరసనభావము సూచించెను. అది రాజు గ్రహించి పౌరుషావేశము నొంది "గజపతిపుత్రికను నేతేఁజాలనా? తెచ్చెదనుగాక" అని ప్రతిజ్ఞఁ బలికి తత్క్షణంబ మంత్రియగు సాళువ తిమ్మరుసునుబిలిపించి "పూర్వ



దిగ్విజయయాత్రకుం బోదలంచితిమి. ముహూర్తము నిశ్చయించి సేనల రావింపు" మనవుడు వల్లెయని తత్క్షణంబ వచ్చి యుపశ్రుతియను నొక శకునమునుఁ జూచెను.

## ఉపశ్రుతి.

ఎట్లనిన; జ్యోతిషశాస్త్రానుసారముగ మంత్రాక్షతలు గొని యొక చాకలివానియింటిపైఁ జల్లి యింటివా రేమనుకొందురో ఆ మాటలు వినుటకై రహస్యముగ డాగియుండెను. అప్పు డా రజకుఁ డుల్లాసమునఁ బుత్రుని మంచమునఁ దన యుదరముపైఁ గూర్చుండబెట్టుకొని యాడింపుచు "కొండవీడు మనదేరా, కొండపల్లి మనదేరా, కాదన్న వాడుంటే కటకముదాకా మనదేరా" అని పాటగా బాడుచుండెను. అది మంత్రి విని యిది శుభసూచకమని తలచి వెంటనే వెడలి యిది యె సుముహూర్తమని రాజున కెఱింగించి సేనలఁగూర్చి తాను సేనానియై దండు వెడలించెను. వెడలినకాలమేదియో సరిగఁ గనుపట్టదు కాని భావసంవత్సరమైనట్లు ఉదయగిరిశాసనమువలనఁ దెలియుచున్నది. ప్రథమమున ఉదయగిరిని ముట్టడించి వినికొండ అద్దంకి బెల్లముకొండ నాగార్జునకొండ తంగెడ కేతవరము మొదలగు దుర్గములను బట్టికొని పిదపఁ గొండవీటిపై వెడలినట్లు శాసనాదులవలన గనుపట్టుచున్నది.

కొండవీటిని విడిసినప్పు డచటి రాజగు వీరభద్రగజపతి తక్కిన వారివలె సాధారణముగ లొంగక యుద్ధోన్ముఖుఁడయ్యెను. అపుడు రాయలకును వీరభద్రగజపతికిని గొప్పయుద్ధము కాగా గజపతి నిలువజాలక రాయల శరణువేడెను. అంతట రాయలు కరుణించి వారి కభయదానమిడి దుర్గము స్వాధీనపఱచుకొని కృష్ణకుత్తరముననున్న దేశముపై వెడలి బెజవాడయందు కొన్నిదినము లుండి వెడలి సింహాచలపర్యంతము గల సంస్థానముల జయించుచు పోయి సింహాచల నృసింహునికిఁ దానును భార్యలును కొన్ని కైంకర్యములు చేసిరి. (ఈ విషయము కవులచరిత్రయందుగల శాసనము వలన దెలియును.) పిమ్మట కటకపురమును ముట్టడించి దానినిఁ గాల్చి యచ్చటి రాజును

గలవరపెట్టెను. అపుడా రాజుఁ (ప్రతాపరుద్రగజపతి) వెరగుపడి పాఱిపోయి మరలి వచ్చి రాయలను శరణుజొచ్చి తనకూతు రగు తుక్కాదేవి నొసంగి సఖ్యము జేసికొనెను. (ఈ యమపేరు దండకవిలెయందు వరదరాజమ్మ యని వ్రాయఁబడినది) ఈ విషయము కృష్ణదేవరాయల ప్రతినిధియగు నాదెండ్ల గోపయ వ్రాసిన ప్రబోధచంద్రోదయవ్యాఖ్యలోని యీ శ్లోకము వలనఁ దెలియుచున్నది.

"శ్లో॥ ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య । పుత్రీం పవిత్రీం కృతభూతధాత్రీం
ప్రత్యగ్రశౌర్యప్రకటప్రతాపో । భద్రాం సుభద్రాం ఇవగోపాణీయం॥"

గజపతి తన కూతును మనఃపూర్వకముగ నిచ్చి వివాహ మొనర్చినట్లు కృష్ణరాయవిజయము మొదలగు గ్రంథములవలనను, కృష్ణరాయలమరణము విని కటకపురాధిపతి విజయనగరముపై దాడివెడలి రాగా అతనిఁ గూర్చి పెద్దన రచించిన చాటువువలనను కనుపట్టును. కాని దండకవిలెయందు "బలాత్కారముగా గొనితెచ్చె" నని వ్రాయఁబడి యున్నది.

కొండవీటియుద్ధకాలమున దుర్గమునందున్న నాయకుల పేర్లును, యుద్ధానంతరమున మన దేశమున రాయలు చేసిన ధర్మములును దెలుపు శాసనము నిందుదహరించుచున్నాను.

## శ్రీశైలశాసనము.

(శ్రీశైల మల్లికార్జునని గర్భగుడికి పూర్వముఖమంటపమున గల దిన్నెపై ఖఱచిన శాసనము.)

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా॥ ౧౪౩౮ అగునేటి యువనామ సం॥ శ్రావణశు ౧౫ బుధవారము చంద్రగ్రహణపుణ్యకాలమున శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయరగండ ఆదిరాయవిభాడ అష్టదిక్కులరాయ మనోభయంకరభాషిగె తప్పువరాయరగండ పూర్వపశ్చిమసముద్రాధీశ్వర యవనరాజ్యస్థాపనాచార్య గజపతిదత్తవిభా శ్రీ వీరప్రతాప శ్రీ కృష్ణదేవమహారాయలు విజయనగరానుండి పూర్వదిగ్విజయయాత్రకువచ్చి వుదయగిరిదుర్గము సాధించి తిరుమలకాంతరాయ మహాపాత్రునిం బట్టుకొని అద్దంకి వినికొండ బెల్లంకొండ నాగార్జునికొండ తంగెడ కేతవరము మొదలయి



న గిరిదుర్గాలు స్థలదుర్గాలు యేకదాడిని గైకొని కొండవీటిదుర్గం మీద విడిసి లగ్గలు పట్టించి దుర్గము పుచ్చుకొని ప్రతాపరుద్రగజపతి రాయనికుమారుడు వీరభద్రారాయఁడు కుమారహంవీరపాత్రుని కొడుకు నరహరిదేవు రాచూరియల్లుఖానున్ను వుద్దండఖానున్ను జన్నావుల కసవాపాత్రుడు, పూసపాటి రాచిరాజు శ్రీనాథరాజు లక్ష్మిపతిరాజు, తుమ్మపాల చంద్రమహాపాత్రుడు వీరు మొదలయిన పాత్రసామంతులున్నూ మన్నెవారినిన్నీ జీవగ్రాహంగా పట్టుకొని అభయదానము వారికిచ్చి ధరణికోట అమరేశ్వరానకు వచ్చెను. కృష్ణవేణీనదీతీరమందు అమరేశ్వరదేవుని సన్నిధిని తులాపురుష మహాదానమున్ను చేయ నవధరించి తాము దేవులు చిన్నాదేవమ్మగారిచేతను రత్నధేను మహాదానమున్ను, తిరుమలదేవమ్మగారిచేతను సప్తసాగరమహాదానమున్ను చేయించ నవధరించి అందుండి శ్రీపర్వతానకు వేంచేసి యా దేవుని తిరువీధి శిలామంటపాలు కట్టించి ఆ శ్రీముఖ సం॥ వైశాఖ శు ౧ గురువారానను మధ్యాహ్న అవసరము మహానైవేద్యానకు పాఱుమంచాల అనే గ్రామమున్నూ ఆత్మకూరు అనే గ్రామమున్నూ సమర్పించిరి. శ్రీశైలయాత్రకు వచ్చిన కాశికావడి సుంకము గుఱ్ఱము, యెద్దు, గాడిదె తల మోపు మొదలయినవారిచేత సుంకము గొనకుండా మన్నించి యింతమట్టుకు ఆచంద్రార్కస్థాయిగా నడవగలదు. యీ ధర్మము యెవరు తప్పక నడిపిరి ఆ పుణ్యపురుషుల పాదాలు మా శిరసున నవధరించెదము."

ఈ విజయయాత్రాదిక విషయములు సింహాచలము కంచి మొదలగు స్థలములందుఁ గల శాసనములందును గనుపట్టుచున్నవి.

## కంభము చెఱువు.

ఈ దండయాత్రానంతరము గజపతివారికొమార్తెను తీసుకొని విజయనగరమున కేగుచు మార్గమధ్యముననున్న కంభము (స్తంభపురి) యొద్దకుఁబోగా నపుడు "కృష్ణరాయలు దాసిపుత్రుఁడని వరదరాజమ్మకు తెలిసి సత్కులప్రసూతయగు తానట్టివాని నెటుల నంటఁదగునని యెంచి చింతిల్లి వైరాగ్యమున తానచట నేనిల్చి తనవారిచ్చిన ద్రవ్యము వలన విశాలమగు గొప్పతటాకమును వేయించెను." అని దండకవిలెయందుఁ గలదు. అచ్చటివారు కృష్ణరాయనిభార్య వరదరాజమ్మ యీ చెరువు వేయించెననియు, గండినిలువనందున తాను గండిలోఁబడుండి పూడ్పించుకొనెననియు మొదలగు నంశములఁ జెప్పుకొనుచున్నారు. ఈ విషయమును బలపఱచగల యితరనిదర్శనము లెవ్వియు గానరావు. వరదరాజమ్మ (తుక్కాదేవి) కృష్ణరాయనియెడ నసూయకలిగి విసర్జిం

చెనను విషయమును గ్రోసివేసినను, వరదరాజమ్మ చెరువు వేయించిన ది మాత్రము నిజమయియుండును. లేకున్న చెఱువున కీ పేరు రాదు. "ఈ వరదరాజమ్మ యెవరో" అని యోజింపవలసియుండును.

ఈ చెఱువుపైఁ బెక్కు శాసనములు గలవు. వానిలో నొకదాని యందు గోపన్న అను నతఁడీ చెరువు వేయించెనని యున్నది. ఈ విష యమింకను పరిశోధనీయమై యున్నది.

## కృష్ణరాయల ధర్మములు.

కృష్ణరాయలవలన యుద్ధానంతరమునఁ బెక్కుధర్మములు చే యఁబడినవి. యుద్ధానంతరమున బహుజీవహింసజరిగించిన దోషశాంతి కై పెక్కు దానధర్మములు చేయు నాచారముకలదు. అందువలన రాయ లు పుణ్యక్షేత్రములందెల్ల ననేక కైంకర్యములు చేయించియు, యో గ్యులగు బ్రాహ్మణుల కనేకాగ్రహారములనిచ్చియు భార్యలచేత నిప్పిం చియు ననేక శాసనములు వేయించెను. అందనేక శిలాశాసనము లు మహాస్థలములందు గనుపట్టుచున్నవి. అనేక తామ్రశాసనములును గలవు. వీని వృత్తాంతములు తెలియుటకై సూయల్ దొరవారొక పట్టి కను ప్రకటించిరి. దాని ననుసరించి కవిజీవితంబున శ్రీ గురుజాడ శ్రీరా మమూర్తి పంతులుగారును ప్రకటించిరి. మంగళగిరి నృసింహస్వామికి మంగళగిరి, నంబూరును అగ్రహారములిచ్చెనని దండకవిలెయందు వ్రా యబడినది. రాముపాలెం శ్రీరాములవారికిచ్చెను. ఈ శాసనములలో చరిత్రకారుల కందకపోయిన వెన్ని యోకలవు.

మంత్రియగు తిమ్మరుసుచేతను పెక్కుదానములు చేయించెను. అవి మనదేశమున చేజెర్ల, కొండకావూరు మొదలగు స్థలములందు గనుపట్టుచున్నవి. కృష్ణరాయని దానమునుగూర్చి దండకవిలెయందీ క్రిందివిధమున వ్రాయఁబడినది.

"కృష్ణరాయలు మునుపు పడమటి వేల్పూరు (గుంటూరు జిల్లా లో సత్తెనపల్లి తాలూకాయందలిది) గజరాయఁడు అను నతనికి మొకాసా యిచ్చెను. గనుక ఆ గ్రామము "గజరాయని వేల్పూరు"



అందురు. ఆ గజరాయుడు చనిపోయినవెనుక భోగముదానికి మొకా సా యిచ్చెను. ఆ భోగముది తనకు వేల్పూరిపొలము చాలదని రా యలదేవుని అడిగినంతలో నీ మనసువచ్చినంత పొలము ఒకనాడు యె న్నిపూళ్ళు తొక్కి నడుస్తున్నావో అన్నియూళ్ళపొలం ఆ యూరిక్రింద యిప్పిస్తున్నాననెను. గనుక అదివచ్చి తొక్కిన పొలము ౧ రోకంటి గుండ్లపురము, ౧ సిద్దాపురము, ౧ అనంతవరము, ౧ చినపాడు, ౧ పె దపాడు, ౧ లక్ష్మీనారాయణపురం యీ ఆరుపూళ్ళు తొక్కివచ్చి వే ల్పూరిలో భోగముది ఆవేళనే అంతరించెను. గనుక దాని కా గ్రామా దులతోకూడిన పొలము పాలెములు చేసి వేల్పూరు దానివాండ్లకు నడిపించెను."

"సదాశివరాయలు ఆ వేల్పూరిపొలము పాలెములుకూడా జం పనివారను రాచవారికి కొలువుబడిక్రిందను యిచ్చి పంపెను. జంపని వారు భోగమువాండ్లకు యిచ్చిన గ్రామాదులు అని విచారించిరి గను క వారికి కొండవీటిసీమలో ౧ కోసూరు, ౨ చామర్రు, 3 ఉత్తరచిం తపల్లి, ౪ తాడువాయి, ౫ గింజుపల్లి, ౬ కుంటమద్ది, ౭ జటపల్లి, ౮ మాదిపాడు, ౯ చల్లగరిగె, ఈ తొమ్మిది గ్రామాలు జంపనివా రికి మొఖాసా యిచ్చెను. గనుక జంపనివారిక్రిందను అలాయిదా ఆయెను."

దండకవిలెయందు కృష్ణరాయల విషయిక భాగమున నీతఁడీ క్రిం దఁ జూపిన యగ్రహారము లిచ్చినట్లు వ్రాయబడినది కాని యితఁడే కాక యితరప్రభువు లిచ్చినవైనట్లు కూడఁ గనుపట్టును. వాని విమర్శించుట దుర్లభము.

వినుకొండసీమలోని మిన్నికల్లు తాళ్ళపాక చిన్నయ్యగారికి.

గొడవర్రు - అన్నదానభొట్లవారికి, పొన్నికంటి గోపినాధునికి. కుక్కపల్లివారికి.

పొన్నికంటిలోని పొలము విడదీసి హద్దులుపెట్టి పొన్నికంటి గోపినాధునికి.

వెన్నాదేవి పొలములో ౨ పాలెములుచేసి 1 గాజులవారికి కంకణాలపల్లి యను పేరుపెట్టి యిచ్చెను. రెండవపాలెము భట్టుపాలెమని పేరుపెట్టి భట్రాజులకును, రుద్రవరం, జంగాలపల్లి జంగాలకును యిచ్చెను.

గజరావు వేల్పూరు భోగముదానికి, తూర్పురుద్రవరం జంగాలకు.

అద్దంకిసీమలోని వలపర్ల - తాళ్ళపాక చిన్నయ్యగారికి.

దిడుగు - తాళ్ళపాక తిరువెంగళయ్యగారికి.

ఉత్తరగుండవరము - తాళ్ళపాక వెంకటాచార్యులగారికి.

కాశిపాడు - సిద్ధిరాజు వెంకట్రాజు, తాళ్ళపాక కోనేటయ్యగార్లకు యిచ్చెను.

1 పాకాల, 2 తుమ్మపెంట, 3 బింగినపల్లి, 4 కరేడు కందుకూరిక్రిందను, ఈతముక్కల మన్నూరు పెళ్ళూరుక్రిందను కలిపెను.

తూర్పు శ్రీరంగపురము ఆరుయిండ్ల వైష్ణవులకిచ్చెను.

## కృష్ణరాయలు గ్రామయజమానిపెత్తనము లిచ్చుట.

ఈ క్రిందివిధమున గ్రామములకుఁ బూర్వము యజమాని పెత్తనదార్లు నిర్ణయింపఁబడి యుండగా నీ రాయలు కొండవీటి సీమను స్వాధీనము చేసికొనిన పిదప వీరందఱును రాయలను దర్శించి యజమాని పెత్తనములు మావి మాకేయుంచుడని వేడుకొనగా రాయలనుగ్రహించి యట్లే జరుగుచుండునట్లు నిర్ణయించెను.

కొల్లిపరకు—1 మాచర్లవారు, 2 మహాంకాళివారు.

మున్నంగి—
దంతెలూరు— } బేతనభొట్లవారికి.

ఈమని—నగరమువారికి.

ఆతుమూడి—శిష్టవారికి.

తెనాలి—1 పిల్లలమర్రివారికి, 2 నందులవారికి.



మంచాల—శిష్టవారికి.

సుద్దపల్లి—దంటువారికి.

జంపని—రంగవీటివారికి.

కుంచవరం—అత్తోటవారికి.

పడమటిజొన్నలగడ్డ
పోతవరము } రూపాకులవారికి.

అన్నవరము—మాగంటివారికి.

గొడవఱ్ఱు—పీసపాటివారికి.

నందివెలుగు—
కఠెవరం— } పన్నాలవారికి.

కరివేడు—వంగలవారికి.

పెదపలకలూరు—బొడ్డుపల్లివారికి.

దుగ్గిరేలపూడి—మెట్టవారికి.

నల్లూరు—
కామరాజుగడ్డ—
చాట్రగడ్డ— } కొత్తపల్లివారికి.

వెల్లటూరు—తంగిరేలవారికి.

చినతాళ్ళూరు—గుండెపూడివారికి.

పాలడుగు—వేదాలవారికి.

## కృష్ణరాయల రాజ్యపాలనము.

రాయలు దిగ్విజయయాత్రానంతరము తానుజయించిన దుర్గములన్నిటికిని తగువారిని పాలకులనుగా నియమించెను. అన్నిదుర్గముల యధిపతులపేర్లు తెలియరావుగాని గుత్తికి సాళువ తిమ్మరుసు మేనల్లుడగు నాదెండ్ల అప్పయను, కొండవీటి కితని తమ్ముడగు నాదెండ్ల గోపయను, తంజావూరికి రఘునాధరాజును, మైసూరునకు వీరభద్రగజపతిని యేర్పరచినట్లు తెలియవచ్చుచున్నది.

## నాదెండ్ల గోపయమంత్రి.

కొండవీటి పాలకుఁడగు నాదెండ్ల గోపయ కొండవీటికిఁ బ్రవేశించి శా॥ ౧౪౩౭-౧౪౫౫ (క్రీ॥ 1515-1533) వరకు పాలించినట్లు దండకవిలెయందు వ్రాయఁబడినది. ఈతఁడొక విష్ణ్వాలయము గట్టించి శాసనము వేయించెను. దీనివలన నీదేవాలయ ప్రతిష్ఠాపనకాలము మొదలగు విశేషాంశములు తెలియును.

### కొండవీటి పోలేరమ్మగుడియొద్ది (గోపయమంత్రి) శాసనము.

“శ్లో॥ శ్రీరామచంద్ర శ్రియమాతనోతు సీతాసహాయో మునిధర్మపత్న్యాః
యస్యాంఘ్రిపంకేరుహరేణురాసీ దశ్మవ్రతోద్యాపనకర్మహేతుః ॥
బ్రహ్మేంద్రాదిశిరోమణిచ్ఛవిరవిప్రాతర్మయూఖారుణం
భూపావృత్రభిదశ్మరశ్మిలహరీ భృంగాళిశృంగారితం
మంజీరక్వణితైర్మరాళనివితా మంజుస్వనైరంచితం
వందే రామపదారవిందమనఘం వందారుకల్పద్రుమం ॥
యత్కటాక్షశ్చకరుణా క్రోధాభ్యాంశబలీకృతః
విభీషణే రావణే చ స వః పాయాద్రఘూద్వహః
అవ్యాదాదివరాహో వ స్సరసాముర్వ్యహన్మహీం
నిజాంగసంగసంజాత సాంద్రస్వేదోదయాదివ ॥
ఉరసి నిహితలక్ష్మీ బాహువల్లీయుగేన । స్వకరయుగళమేకీకృత్య కేళీపనోదే
కువలయదళదామా నద్ధమందారమాలాం । దధదివవితనోతు శ్రీకళాం కాకుళేశః
అస్తి శ్రీకృష్ణరాయాఖ్య నరనాథశిరోమణిః
రాజన్యమాళికారత్న నీరాజితపదాంబుజః
సింహాసనానర్హతయా ద్వాపరే లజ్జయా హరిః
కలౌ బ్రహ్మసనాసీనః కృష్ణరాయ యదూద్వహః ॥
శ్రీకృష్ణక్షితిపాలదత్తమణిభి ర్దివ్యత్కవీశాంగృహాః
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వంగతాః
అబ్ధిః కేవలసీరపూరనిలయ స్సంభావ్యతే సజ్జనై
రంభోధిర్జలధిః పయోధిరుదధి ర్వారాంనిధి ర్వారిధిః ॥
ఆలానాంరిపుదంతినామరిపుశో యూపస్సమీక్ష్యధ్వరే
వైరిస్వాంతనిఖాతశంకురుదితో దీప్రప్రతాపాంకురః
పాతాళాద్ధరణీం వరాహవపుషా దంష్ట్రాధరన్నుద్గతః
శ్రీకృష్ణక్షితిపస్య భాతి విజయస్తంభః కళింగాంగణే ॥
మహాప్రధాన శ్రీసాళ్వతిమ్మస్సచివశేఖరః



శ్రీకృష్ణరాయనృపతేస్సామ్రాజ్యమధితిష్ఠతి
శ్రీసాళ్వతిమ్మసచివో కౌండిన్యకులశేఖరః
వేమయామాత్యతనయ రాచయామాత్యనందనః ॥
విద్మోనైకం విశేషం వితరణవిభవై ర్విద్వదగ్రేసరాణాం
పద్మావాణీవిలాసైః ప్రగుణమణిగణైః పక్ష్మలాక్షీసహాసైః
సమ్యప్రాకారహారై శ్శ్రీరతులమణికశైరశ్వహస్త్యాదియానైః
సమ్యత్తైర్భోగ్యవిభేదం సమరవిజయతే సాళ్వతిమ్మస్సజానే
సప్తాంగోపేతశక్తిత్రితయచతురుపాయైక్యే మంత్రీశసాళ్వ
తిమ్మాఖ్యే కొండవీట్యాం గజపతినిహితాన్ రాజహంసాన్ గృహీత్వా
శాకాబ్దాన్ మార్గయంతే గిరి, పుర, జలధి, క్ష్మా, సుగూఢం ప్రవీణాః (౧౪౩౭)
సాళువాంక శకవత్సరగణ్యే మాఘ శుద్ధహరివాసర సారా (౧౪౩౭)
సాళ్వతిమ్మసచివేన గృహీతం కొండవీటినగరం నగరాజం
పుత్రా రామతటాక దేవసదన బ్రహ్మప్రతిష్ఠానిధిః
కారుణ్యామృతపూరపోషిత కవీంద్రప్రోతకృత్యుజ్జ్వలః
దీనానాథకృపాత్తకీర్తిఃకృతవా నాసేతుసీతాచలం
శ్రీకృష్ణక్షితిపాలమౌళిసచివ శ్రీసాళ్వతిమ్మప్రభుః ॥
కాశికాన్వయసంభూతో నాదెండ్లకులశేఖరః
అస్తి తిమ్మయమంత్రీశ స్సమ్మతస్సర్వబంధుషు
కృష్ణాంబారుంధతీనూనం భర్తృవాక్యమరుంధతి
అనసూయాహి సర్వత్ర హ్యనసూయేతి గణ్యతే
నాదెండ్లతిమ్మయామాత్య కళత్రేసూతవాన్ సుతౌ
తత్పుత్రావప్పయామాత్యో గోపయామాత్యశేఖరా ॥
జంభద్విట్కుంభికుంభద్వయసచివ శచీచారువక్షోజకుంభ
వ్యక్తవ్యాప్తానులిప్తప్రసృమరమసృణక్షోదశర్వాగపూరా
యత్కీర్తిః కార్తికేందుం పరిహసతి విశాలైశ్వర్యసంప్రీతిధీమాన్
సోయం నాదెండ్లయప్పప్రభుమణి రఖిలస్తుత్యకీర్తిప్రతాపః ॥
యద్ధాటీఘోటకోటీఖరఖురదళిత క్ష్మాతలోద్ధూతధూళీ
పాళీపాతాళకేళీకృతధరణితలే ఖడ్గయోగ్యస్యబాహుః
జిహ్వాలాభీలభూభృద్భుజగపరివృఢో లక్ష్యతే సిద్ధసంఘైః
సోయం నాదెండ్ల యప్పప్రభురవనిధరాధారబాహుప్రతిష్ఠః ॥
గోపో నాదెండ్లగోపశ్చ తుల్యావితి కథం బ్రువే
ఏకసంతానవాన్పూర్వ స్సప్తసంతానవాన్పరః ॥
ఏకే చాద్యాపి తారే వితరణనిగమా న్వేదితుం సింధుచంద్రా
స్త్రీత్వాజాడ్యం ప్రపన్నాః కతిచపశుదృషద్దారుజాత్యాతిమూఢాః
ధత్తేచాద్యాపయస్తాన్ వితరణనిగమాన్ గోపయార్యః కరేద్ధిం

కల్పద్రుం కామధేనుం హ్యాదివదనదృశో శ్చంద్రచింతామణీచ ॥
యద్వైరిక్షోణిపాలప్రకరమహాచంద్రశాలాగ్రహాంతః
శ్రీఖండ స్తంభకుంభద్భుజగపరివృఢాఘరీదేహార్క వాహః
మూర్ధన్యోహాస్కలంతస్సలదిగతవిషా వైనతేయేన
*  *  దుతిభాతి నాదెండ్లగోపః ॥
శ్రీకృష్ణక్షితిపాళమౌళిసచివః శ్రీసాళ్వతిమ్మప్రభుః।
జామాతృప్రవరే ధురంధరవరే శ్రీ గోపమంత్రీశ్వరే
ప్రాదత్తాఖిలకొండవీటినగరీ సామ్రాజ్యధారేయతాం
మత్తేభాశ్వపదాతిసైన్యకలితాం పల్యంకికాంచామరీం
శ్రీకృష్ణరాయనరనాథశిరఃప్రధానః । శ్రీసాళ్వతిమ్మసచివేశ్వరభాగినేయః
నాదెండ్లగోపసచివోనయతత్వవేదీ । శ్రీకొండవీటినగరైకధురం ధరోభూత్ ॥
రాఘువాయగణితే శకవర్షే (౧౪౪౩)
రాఘువాయరచితాచలపుణ్యం
వప్రగోపురయుతర్నవహాస్త్రిశ్
గ్గోపమంత్రితిలకేనసపర్యా॥
శాకాబ్దేక్షియుగాబ్ధిచంద్రగణితే సంవత్సరే విక్రమే (౧౪౪౩)
శ్రీకృత్క్షితిపాలమౌళిసచివ శ్రీసాళ్వతిమ్మాజ్ఞయా
ప్రాకారాన్నవభిశ్చ హేమకలశైరత్యున్నతం గోపురం
ప్రాకారోత్సవమంటపైరుపచితం శ్రీరామభద్రాయచ
రామాయోత్సవవిగ్రహాంశ్చకనకాం కల్పాంశ్చ ముక్తావళిః
ముఖ్యంచాభరణౌఘముజ్జ్వలతరం శ్రీకొండవీటిపురే
ద్వ్యాసప్తత్యధికాంని యోగరచనాం నాదెండ్లగోపప్రభు
గ్లక్ష్మీవాయక సాళ్వతిమ్మవిభవే పుణ్యాయకృత్వాదిశత్ ।
శ్రీయజ్ఞవాటిపురనాయక రాఘువాయ శ్రీకొండవీటి సకలైర్వ్యనుమూలవీసాః ॥
లెంబల్లె శ్రీమైందవోల్వ్యనుపాలెమాదీన్ శ్రీసాళ్వతిమ్మవచసాథితగోపమంత్రీ॥
యావజ్జహ్నుసుతాత్రియంబకసుతా శ్రీకృష్ణవేణీపయః
పూరాస్తేపునతైభువంచవిపులాం శ్రీకొండవీటీపురీం
యావత్కావ్యసుధాంబురాశిలహరీ హేలాంవిధత్తేకవి
స్తావత్సాళువతిమ్మకీర్తిలతికాపుష్యత్వజస్రంభువి॥
మహోపాధ్యాయపంచాగ్ని దీక్షితోద్వాదశాహకృత్
లొల్లాలక్ష్మీధరోవ్యాజ్యాప్రాహైతద్ధర్మశాసనం॥ శ్రీశ్రీశ్రీ

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౪౩ అగు నేటి విక్రమసంవత్సర వైశాఖ శుద్ధ ౧౫ లు సోమపుణ్యకాలమందు కొండవీటి శ్రీయజ్ఞవాటికా రఘునాయకులకు శ్రీకృష్ణదేవమహారాయల సామ్రాజ్యధురంధర శ్రీమన్మహాప్రధాన సాళువతిమ్మరుసయ్యంగారి మేనల్లుడైన కౌశికగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యయులైన నాదెండ్లతిమ్మరాజుంగారి కుమారుడయిన గోపరుసయ్యంగారు దేవునికి శిఖరము కట్టించి శిఖర మంటప గోపురాలు సన్నపనులుచేయించి వైడికుండలు యెత్తించి తిరుచుట్టుమాలెను ప్రాకారమున్ను కట్టించి వుత్సవవిగ్రహాలసమర్పించి అంగరంగవైభవాలకున్ను అమృతపడికున్ను వుత్యవాలకున్ను పూర్వాన సాగివచ్చే లెంబల్లె గ్రామము. (యిదియే లేమల్లెయై యుండును.) సాగించి మైందవోలుగ్రామము సమర్పించి కొండవీటిసీమలోను సుంకము సాగినచోట నల్లానుమూల వీసాలు కొండవీడు ముందువసంతఘురువులోను ఆరువంట్యాలలోను  *  *
తిరుమలపర్వతాలు మొదలైనవి యిచ్చి  *  *  *
పుప్పు, మామిడికాయలు, వుసిరికాయలు, వంకాయలు, ఇందుపుకాయలు, మావిసె వీనికి గోనెవకటింటికి అరవైశము లెక్కను. పెసలు మినుములు సెనచలు వులవలు కందులు గోధుమలు నువ్వులు ఆముదాలు కారామళ్ళు అనుములు ప్రత్తిచింతపండు కరక్కాయ వుసిరికపప్పు కంద చామ చిరుగడం వీనికి గోనె వకటింటికి వైశమున్ను వుల్లి పసుపు గుగ్గిలం మెంతి జీలకర్ర ఆముదాలు కొత్తగోనెల సలగ అల్లం నిమ్మపండ్లు టెంకాయలు గోనె వకటికి దమ్మమున్ను బెల్లము దూది నెయ్యి ఆముదం సంగడిపప్పు శొంఠి ఇనుము వుక్కు వులులు వీనికి గోనె వకటింటికి దమ్మాలు రెండున్ను మామిడితాండ్ర గోనె వకటికి దమ్మాలు మూడు పంచదారపోకలు నూలు తమలపాకులు వీటికి గోనె వకటికి దమ్మాలు నాలుగు. పిప్పలి మిరియాలు గంధము కరాజులు జాజికాయ జాజిపత్రి సీసము తగరము రాగి వీనికి గోనె వకటికి దమ్మాలు ఆరు. శోకలమలగకు చదివెలె మర్యాదన వేమంద్రచాతిమూలవీసాలు యిప్పించి శ్రీమన్మహాప్రధాన సాళువతిమ్మరుసయ్యంగారికిన్ని వారిదేవులు లక్ష్మమ్మగారికిన్ని పుణ్యముగాను నాదెండ్ల గోపరుసయ్యంగారు సమర్పించె. ఈ ధర్మానకు వద్దిరాజులు తప్పిరా గంగలో గోహత్య చేసినదోషానకు బోవువారు. తురకరాజులు తప్పిరా పందినితిన్న దోషాన బోవువారు.
ఏకైవభగినీలోకే సర్వేషామేవభూభుజాం । నభోగ్యానకరగ్రాహ్యాదేవదత్తవసుంధరా దానపాలనయోర్మధ్యేదానాచ్ఛ్రేయోనుపాలనం । దానాత్స్వర్గమవాప్నోతిపాలనాదచ్యుతం పదం॥ శ్రీశ్రీశ్రీ"

ఈతడు శా॥ ౧౪౪౩ వృష సం॥న సత్తెనపల్లితా॥ పేరూరులో శివకేశవులకు భూదానముచేసినట్లు వ్రాయబడినది.

ఈతడు తిరిగి కొండవీటిలో బరివారపట్టాభిరామ విగ్రహముల బ్రతిష్ఠించి ఈ క్రింది శాసనము వేయించెను. (ఇవి దండకవిలెనుండి వ్రాయబడినవి)

"శ్లో॥ శాకాబ్దేపురవేదవార్ధిశశిభూగణ్యాచపార్ణేదినే (౧౪౪౭)
ఫాల్గున్యేవిధువాసరే శుభదినే శ్రీకొండవీటీపురే
నాదెండ్లాన్వయగోపమంత్రితిలకా శ్రీసాళ్వతిమ్మప్రభు
ర్జామాతారఘునాయకస్య కృతవాన్ సమ్యక్ప్రతిష్ఠాద్విధిం॥

సుగ్రీవలక్ష్మణవిభీషణజాంబవద్భిః । శత్రుఘ్నయుక్తభరతేచహనూమతాచ
సీతాపతింసపరివారకమంగదేచ । రామశ్చగోపసచివోకృతసుప్రతిష్ఠం ॥
సీతారామసమన్వితస్సభరతా శేషాహ్వయోధ్యాతతః
శత్రుఘ్నాదికలక్ష్మణావిజయతే శ్రీకొండవీటీపురే
సుగ్రీవోహనుమాన్విభీషణయుత శ్రీజాంబవత్యంగతా
రామాసావరణంప్రతిష్ఠితమతా నాదెండ్లగోపప్రభో॥"

---

## ఏడవప్రకరణము.

### అచ్యుతదేవరాయలు.—రామయభాస్కరుడు.

కృష్ణరాయల పిమ్మటఁ గర్ణాటరాజ్యాధిపత్యమును వహించినవాఁ డతని సవతితల్లికుమారు డగు అచ్యుతదేవరాయలు. ఈతఁడు కొండవీటిరాజ్యమునకు రామయభాస్కరుని ప్రతినిధి (గవర్నరు) గ నియమించెను. ఈ భాస్కరుడు నందవరీకబ్రాహ్మణుడు. దాతయగు భాస్కరుని వంశజుడు. (ఈ విషయము వంశవృక్షమునందు గనుపట్టును). రామయభాస్కరుడు ప్రభుత్వమునకు వచ్చి పూర్వము రెడ్డిరాజులు గట్టించిన కోటలయొక్క రాతితో కొండక్రింద కోటగట్టించి అందు "గోపినాథపుర"మను పేర నొక పేటఁ గట్టించి అందు గోపినాథస్వామివారి కాలయము గట్టించెను. ఈతడు బ్రాహ్మణుడైనను మిక్కిలి బలపరాక్రమములు కలిగి కార్యవాదము ఖడ్గవాదముగూడ నేర్చి ప్రసిద్ధుఁడై రాజ్యమేలెను. ఈతని శక్తిసామర్థ్యంబులు కోటసింహద్వారముకడ గోడలోని ఱాతిమీద వ్రాయబడియున్న యీ దిగువ పద్యమువలనఁ దెలియుచున్నవి.

"సీ॥ నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకారనవకంబుగా గోపినాథపురము
నిలిపినా డేమంత్రి నియతవైభవముల గోపికావల్లభుఁ గూర్మి వెలయ
పాలించె నేమంత్రి ప్రకటధర్మఖ్యాతి మహిమమీఱఁగ నాంధ్రమండలంబు
గెలిచినా డేమంత్రి లలితవిక్రమమునఁ బ్రబలుడై యవనులబలము నెల్ల॥
తే॥ నతడు భూపాలమంత్రీంద్రసతతవినుత
ధీనిశాగదు డచ్యుతదేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్యమహితయశుడు
భానుతేజుండు రామయభాస్కరుండు"॥

కృష్ణరాయలకాలమునా డణగియుండిన శత్రువులు అచ్యుతదేవరాయలకాలమున బెదిరిలి దేశమం దంతటను కల్లోలములు గలిగించుచువచ్చిరి. అచ్యుతదేవరాయ లట్టివారిని దండించుటయేగాక దురుష్కులదాడివలన దేశమున కెట్టి క్షోభమును గలుగకుండునట్టుల పరిపాలనమొనర్చెను.

### పాలెగాండ్రను కత్తులబావిని ద్రోయించుట.

ఇట్లుండ నీదేశములోని సామంతులగు డెబ్బదిద్దరు పాలెగాండ్రు దుర్వర్తనమునకుం బాల్పడి తమ ప్రభువును లెక్కసేయక మదాంధులై జనకంటకులై ప్రబల నారంభించిరి. అందువలన నచ్యుతరాయల ప్రతినిధియగు రామయభాస్కరుని సామ్యపరిపాలనమున కొంతయు ననర్థము వాటిల్లెను. వారిని దండించుటకు కెన్నివిధముల యత్నించినను నిరుపయోగము లయ్యెను. అందున కితం డెంతయు జింతిలి యెట్టకేల కొక క్రూరకృత్యము నొనర్ప తీర్మానించుకొనెను. ఏమన; తాను గట్టించిన గోపినాథస్వామిగుడిలో గర్భాలయమునకు ముందుభాగమున గల యంతరాళమున నొక యగాధమగు బావినితీయించి దానికిం జికిలి కత్తులతో కలుజుగట్టించి యెవడేని లోపలికి వచ్చుద్వారముదాటి యడుగుబెట్టుచుండగనే వాడు బావిలోపడునట్లు కీలుతో నొక బండ నమర్పించి స్వామికి బ్రహ్మోత్సవము సేయించి, వని నేర్చిన స్వామి వేణువు పూరించునట్లుచేసి యుత్సవదర్శనార్థ మందఱిని పిలిపించి యీ పాలెగాండ్రను గూడ రప్పించి దర్శనమున కొకరొకరిని గుడిలోనికిం బోవునట్లేర్పరచి పోయినవానినిం బోయినట్లు ద్రోయించెను. 68 మంది పోయిన పిదప మిగిలిన నలుగురు వారు తిరిగిరానందునకు సంశయించి పలాయనులైరి. ఈ బావి గుడిలోపలగాక వెలుపల దక్షిణద్వారము కడ గలదని యచ్చటివారు చెప్పుచున్నారు. అట్టి చిన్నము లిపు డెవ్వియుం గానరావు. ఆలయమును గూర్చి మొదటి ప్రకరణమున వ్రాయం బడినది. మన దేశమున నింత పవిత్రముగల దేవాలయము గానరాదు. ఇది కేవలము శత్రుహత్యకై కట్టినదికాక విస్తారకాలము పూజాదులు జరిగినదైనట్లు కనుపట్టుచున్నది.

ఈ విషయము దండకవిలెయందు వ్రాయబడినది. దీనిని స్థాపింప నితర నిదర్శనము లేవియు లేవు. కాని కొండవీటిదేశమువారాబాల గోపాలము పురాతనమునుండి పరంపరగా నీ గాథను చెప్పుకొనుచున్నారు. ఇది నిజమైనను కాకున్నను మొత్తముమీఁద రామయభాస్కరునివలన శత్రునిర్మూలనమున కా కాలమున దీనిని బోలిన



ఘోరకృత్య మింకొకటియైనను జరిగి పాళెగాండ్రందరు దానికి గురియై యుందురు. లేనియెడలం జిరకాలమునుండి వచ్చుచున్న జనప్రవాదము తగు కారణము లేకుండ బుట్టియుండదు.

మఱియు భాస్కరుఁడు గోపినాథపురమున వెన్నముద్దకృష్ణస్వామి, మూలస్థానేశ్వరుని, అంగడివీరభద్రుని, మున్నగు దేవప్రతిష్ఠలు చేయించెను. వీటిలో వెన్నముద్దకృష్ణస్వామి యిప్పుడు లింగిస్కార్ పేటయందు గల స్వామియేయై యుండును. మూలస్థానేశ్వరుని శాసన మొకటి గుంటూరున నరసింహస్వామివారి వేంచేపుమంటప దక్షిణ స్తంభమున గనుపట్టుచున్నది. అది యితని కాలమునకు యేబదేండ్లకు ముందు వ్రాయబడినది గాన నీ పేరిటి గుడి మఱియొకటి గలదో లేక పూర్వనిర్మితాలయమునకే యితఁడు పునఃప్రతిష్ఠ ఆలయనిర్మాణము చేయించెనో తెలియరాదు. మఱియు బాచమరుసయ్య అను నతఁడు అచ్యుతరాయల మంత్రియై కొండవీటి నేలినట్లు (శా॥ ౧౪౫౬ విజయ సం॥ కార్తీక బ ౧౧ గురువారము) నాటి చందలూరి శాసనమువలన గనుపట్టుచున్నది. (బట్టర్ వర్తు వాల్యూం చూడుడు.) దీనికి నిదర్శనముగ అప్పకవీయమున పలకలూరి గోపన చాటుధార.

"ఆ॥ గోలకొండ మలకగోవుల భక్షించు
కొండవీటి విప్రవరులము సెల్ల
బాచమరుసుచేరి భక్షింపుచున్నాడు
మలకమేలో బాచమరుసుమేలో॥"

అని యుదహరింపబడినది.

### గుంటూరు నృసింహాలయమునగల శాసనము.

"శ్రీ మూలస్థానం మల్లికార్జునదేవరకును స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౪౦౭ అగు నేటి విశ్వావసుసంవత్సర మార్గశిర బ 3 గు॥ సంతేశ్వర కుమారగురువు మహాపాత్రుల కుమారుండు తిరుమలదాసు మహాపాత్రుడు సమర్పించిన ఆవులను ఉరటపూటపాలు మధ్యరంగంమీదంబడ బిదుకువారు. మాపటిపాలు దేవరకు సమర్పించి తమ్మళివారు అనుభవించువారు. యీ ఆవులకోడెలను ఆంబోతులంజేసేది. పెయ్యలను కదుపులం గూర్చేది. యీ మర్యాదను చెయ్యక తమ్మళివారు తప్పిరా వారి రొమ్మున యీశ్వరుని త్రిశూలము విఱుగును. యీ యావులను వడ్డెరాజులు తురకరాజులు కరణరాజులు తెలుగురాజులు వీరల పనులవారు యెవ్వరుగనుక అపహరించినను గో

హత్య బ్రహ్మహత్య చేసిన దోషానం బోవువారు.”.

## అచ్యుత దేవరాయలకాలము.

అచ్యుతరాయలు శా॥ ౧౪౫౬-౧౪౬౩ (క్రీ॥ 1534-1541)వరకు రాజ్యమేలెనని దండకవిలె నుడువుచున్నది. ఈతఁడు శా॥ (౧౪౫౧ క్రీ॥ 1529) విరోధి సం॥ కార్తిక బ ౧౫ న పట్టాభిషిక్తుఁడైనట్లు Epegraphy G. O. No, 920/pub 4-8-1914 నందు వ్రాయబడినది. ఈ రెంటికిని 5 సం॥లు వ్యత్యాసము గనుపట్టుచున్నది. క్రీ॥ 1526 మొదలుగ నీతని శాసనము లగుపడుచున్నవి. ఈ యల్పవ్యత్యాసములు విచార్యములుకావు.

## రామయభాస్కరుని చెల్లెలు చిన్నమాంబ ధర్మములు.

ఈ రామయభాస్కరుని సోదరి చిన్నమాంబ మిగుల ధర్మాత్మురాలై గోపినాథజలధియను పెద్దచెఱువును వేయించెను. ఈ చెఱు విపుడు “వంకాయలపాటి పెద్దచెరువు” అని వాడబడుచు మిగుల యుపయోగపడుచున్నది.

మఱియు కొండవీటికి మూఁడు గడియలదూరము (మూఁడుక్రోసులు) రామచంద్రపుర మను గ్రామము కట్టించి అందు పరమేశ్వరుడను పేర శివప్రతిష్ఠచేయించి సాతులూరు కగ్రహారము నిచ్చెను. పైరామచంద్రపురమును వంకాయలపాడును బ్రాహ్మణుల కగ్రహారముల నిచ్చెను. ఈ యమ ధర్మముల వివరణము నీదిగువ శాసనమున విరళముగాఁ దెలుపబడెను.

* శ్రీ గోపికావల్లభా!

శ్లో॥ శ్రీకృష్ణస్సతతంకరోతుకుశలం శ్రీగోపికావల్లభో
యన్నాభీజలజంజగజ్జనికృతో జన్మస్థయద్గ్రహం
దేవానామనపాయదాననిపుణం తల్పంయదీయ్యంవచ
శ్చాతుర్వైకనిధీయ్యదత్తుయుగళం రాత్రిందివంజ్ఞాపకం॥
శ్రీమానభూద్రామయమంత్రిబాచ ప్రధానకార్యప్రథితప్రతాపః
కర్ణాటభూపాచ్యుతరాయరాజ్య ధురంధరోశ్వైర్యధరాధిరాజః ॥
అరాతిరాజరాజీవ రాజితే జారరాజయః

* వంకాయలపాటి పెద్దచెరువు కట్టక్రిందనున్న నలువురాతిమీదఁ జెక్కబడిన శాసనము.



ధరాజన రుజాధ్వాంత సంతతేర్భానుమానివ
ఆశాదశాంతకీర్త్యగ్ని హతాహితపురాహుతిః
నితమానీతరహితం హితమాంధ్రమహీతలం
గోపినాథసనాథంశ్రీ యోగభోగశుభాశ్రయం
యోగోపినాథనగరం నిర్మమేనిర్మమోధనే
యవనాయోధనేయోధ నీత్యాజగ్రాహాదుర్గ్రహా
జీవగ్రహంమహోదగ్ర మండలాగోగ్రసాధినః
పుండరీకార్జునయశో ప్రహ్లాదవ్యాసభాసురః
యోభాత్యమహాదాంభీష్మః పుణ్యభాగవతాకృతిః
సహోదరీతస్యగుణోజ్వలస్య ప్రతాపయుల్లప్రభుధర్మపత్నీ
అరుంధతీముఖ్యసతీయశాంసి నిరుంధతీ రాజతిచిన్నమాంబా ॥
సప్తసంతానసంపన్నా యస్యాఃకీర్తిసుధాంబుధిః
ఏకసంతానమాభాతి హసన్నివసుధాంబుధిం
తయాశివశ్శైలసుతాసనాథః ప్రతిష్ఠితఃపార్వతినాథనామా
నిత్యోత్సవోరాజతిసాతులూరు గ్రామాధికారాసుముఖోపచారైః ॥
కృతాగ్రహారోవంకాల పాటిగ్రామోగుణాఢ్యయా
తయాసద్ధర్మపంథేయ రామచంద్రపురాహ్వయః ॥
గోపినాథసముద్రాఖ్య తటాకోనిర్మితస్తయా
రామచంద్రపురాఖ్యస్య నికటీతస్యరాజతీ ॥
భానోర్యూభరిమయూఖపుంఖముదిత ప్రఖ్యాతతృష్ణాంభస
స్సంతీదందురగర్దిగంతకరిభి శ్శోద్యస్సమైతైస్సంతతం
ఆకాశాంతరచారిదేవవనితా ద్రాకర్ణపూరీకృతాం
భోజోదంచితరాజరాజితనభో జాగర్తియజ్జీవనం ॥
మాకందోత్కరకుందబృందలవలీ ముఖ్యద్రుమోద్యల్లతా
నిర్యచ్చారుమరందనిర్మలధునీ నీరంధ్రసంచారిభిః
అభ్యర్ణాంచితచంచరీకనిచయై ర్వాచాలయజ్జృంభితే
వార్ధిర్యాభువిగోపినాథజలధి ర్వస్తూయమానోపమః ॥
వజ్రాధిరాజితమణీకలావకీర్ణ । నిత్యానపాయకమలే నిరతంనివాస్తుం
నారాయణఃకిలబభూవజలేయదీయ్యే।వ్యాజాద్విచార్యరఘుమకూర్మకిరీంద్రరూపః॥
చిన్నాంబికాధర్మసుధాప్రవాహః । శ్రీగోపికానాథసముద్రనామ్నా
ఆచంద్రతారకమార్యపదైర్మః ॥ పుణ్యస్తటాకోభవతాత్ప్రవృద్ధః ॥
శాకాబ్దేక్షిరసశ్రుతేంరుగణితే (౧౪౬౨) శార్వర్యభిఖ్యాయుతే
చైత్రోదంచితపూర్ణమాసుదివసే యెల్లార్యచిన్నాంబయా
వేదాద్యాధికవిప్రదత్తవిలస ద్వంకాలపాటీపురా
భ్యర్ణేవర్ణితపుణ్యయావిరచితో భూయాత్తటాకస్థిరః ॥

శ్రీమహాభారతే—

దేవామనుష్యాః పితరో గంధర్వోరగరాక్షసాః
స్థావరాణిచభూతాని సంశ్రయంతిజలాశయాః
తటాకేయస్యగావస్తు పిబంతితృషితాజలం
మృగపక్షిమనుష్యాశ్చ సోశ్వమేధఫలంలభేత్
ఆస్వాదయంతిపితరః ప్రనృత్యంతిపితామహాః
అపినస్సకులేజాతో యస్తటాకంకరిష్యతి ॥

సీ॥ చతురజనానీత సప్తపావననదీ తీర్థపవిత్రితాధికజలంబు
సవిధదేశవిశాల సరసరసాలాది ఫలరసజంబాల భాసురంబు
కలకంఠచంచరీక శుకీకలాలాప కలితపాంథమనోజ కౌతుకంబు
ఘటితకుల్యాగత ఘననీరసంచార సంవర్ధితానేక సస్యచయము
తే॥ చక్రవాళచలోపమ చారుసేతు । బంధబంధురనీరంధ్రభాసురోర్మి
చుంబితాంబరమత్యంత సుకృతమవని । నాథ శుభనిధి శ్రీగోపినాథజలధి ॥

సీ॥ జనతృష్ణమాన్పని జలముబూనకయున్న పవనజుచేదాటు బడకయున్న
మంథానభూధర మధితంబుగాకున్న మాటిమాటికినుబ్బ మరలకున్న
గరళంబుతనలోనఁ గల్గి మెల్గకయున్న నొకవేళలోబడి యుండకున్న
బడబాగ్నికీలలఁ బరితపింపకయున్న నోడగూడినవారి నోఁగయకున్న
తే॥ జలధిసరివచ్చు మాధుర్యచారుజలము । నపగతాఖిలదోషంబు నగుచుధరణి
దనదీనత్వమహిమచే ననుదినంబు । వెలయు శ్రీగోపినాథాబ్ధి జలధితోడ ॥

సీ॥ శ్రీమీరు కన్నడ క్షితివరాచ్యుతరాయ సన్మంత్రిరత్నంబు జలజనాభు
పాదాబ్జసేవా విభాసురహృదయుండు కొండవీటిధరామండలేంద్రు
డైన రామయభాస్కరామాత్య సోదరి యనఘప్రతాప యల్లార్యపత్ని
పార్వతీశ్వరదేవు భక్తిఁబ్రతిష్ఠించి గ్రామాదిభోగముల్ గలుగజేయు
తే॥ చిన్నమాంబిక నిజకృతస్థిరతరాగ్ర । హార వంకాలపాటి శుభాపరాఖ్య
రామచంద్రపురాభ్యర్ణ సీమయందు । నిప్రసత్ఫలసంథాన విమలమతిని ॥

సీ॥ కర్ణాటభూపాల ఘనకృపాకలిత విస్తీర్ణగజాంత లక్ష్మీవయుండు
చండప్రతాపభాస్కరుడు భాసురదండనాథు సోదరి మహోన్నతగుణాఢ్య
పూని షోడశమహాదాన విద్యాప్రౌఢి చిరకీర్తిఁగన్నట్టి చిన్నమాంబ
దుగ్ధాంబునిధితోడఁ దులదూగు గోపికానాథు సముద్రంబు నలువుమీర
తే॥ ధరణికట్టించె నాచంద్రతారకముగ । నఖిలహితమైన యీ ధర్మమాచరించె॥

**          శ్రీ శ్రీ శ్రీ మంగళంమహా శ్రీంజేయును*

## భాస్కరు లనువారి వివరణము.

చరిత్రములందు భాస్కరుడని వచ్చినప్పుడెల్ల భాస్కరులనువా



రు పలువురుండినందున నే భాస్కరుడెవరో తెలియక పలుమంది పలు తెఱగుల నభిప్రాయముల నొందుచున్నారు. ఈ ప్రమాదము కవుల చరిత్రము మొదలగువాటియందుఁ దఱచుగఁ గలుగుచు వచ్చినది. ఎట్లనిన,

"మ॥ సరిచేసైరిపుడేల భాస్కరులు భాషానాథపుత్రా! వసుం
ధరయందొక్కడు మంత్రియయ్యె, వినుకొండన్ రామయామాత్యభా
స్కరుఁడో; యా, నయినన్ సహస్రకరశాఖల్లే, వదేయున్న వే
తిరమై దానముసేయుచో రిపులహేతిన్ వ్రేయుచో వ్రాయుచోన్"॥

అని అప్పకవీయమున నుదహరింపబడిన యీ పద్యమునఁ శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగా రుదహరింపుచు "రామయామాత్య" యను దానికి బదులు "రాయనామాత్య" యని మార్చిరి.

ఆంధ్రకవుల చరిత్ర 129 పుటయందు "వితరణమునుగూర్చి ప్రసిద్ధుడైన మంత్రిభాస్కరుడు రాయనభాస్కరుడు" అని వ్రాసిరి. ఇందువలన మంత్రిభాస్కరుఁడని ప్రసిద్ధికెక్కినయతడె రాయనభాస్కరుడని బోధపడును. మంత్రిభాస్కరుడని ప్రసిద్ధికెక్కినవాడు, తిక్కన యజ్వ పితామహుడు (ఆరువేలనియోగి); దాతయగు భాస్కరుడు (రాయనభాస్కరుడు) నందవరీకి.



ఈ రాయనభాస్కరుని "రాయనిభాస్కరుడని"యును పిల్చుచుండిరి. ఏలయన, రాయని మంత్రియగుటవలన నిట్లు "రాయని" యను పదము వచ్చినదని చెప్పుదురు. ఇది సరికాదు. రాయనకుఁ బుత్రుడగుటవలన రాయనభాస్కరుడని పేరుకలిగెను. ఇతని యింటిపేరు రాయనవారని కొందఱనుచున్నారు. కాని *హరిదాసువారని కొన్ని నిదర్శనములవలనఁ దెలియుచున్నది. ఈ వంశక్రమమంతయుఁ దెలియగల వంశవృక్ష మిందు వ్రాయఁబడినది. ఇది తద్వంశజులగు కీర్తిశేషులు బ్ర॥ గుంటుపల్లి సోమయ్యగారు ప్రకటించిన భాస్కరచరిత్ర మొదలగు బహుగ్రంథశోధనవలనను, విమర్శనలవలనను దెలిసిన విషయముల ననుసరించి వ్రాయఁబడినది.



* విష్ణుమిత్రోపాఖ్యానము ప్రథమాశ్వాసము చూడుము.

# ఏనిమిదవ ప్రకరణము.

## సదాశివరాయలు.

అచ్యుతదేవరాయల పిదప సదాశివరాయలు విజయనగర రాజ్య సింహాసన మధిష్ఠించెను. ఈతనిని బాల్యమునందు సింహాసన మెక్కించి కృష్ణరాయల మేనల్లుఁడగు అళియరామరాజు ప్రభుత్వము నడిపించుచుండెను. సదాశివరాయలు యిరువదేడు వత్సరములుమాత్రము రాజ్యమేలెననియును, తదుపరి రామరాజు స్వయముగ రాజై (యే డేండ్లు) దేశము పరిపాలించుచుండెననియు, ఇటులుండగా శా॥ ౧౪౯౩ (క్రీ 1571) న నతఁడు తురుష్కులవలనఁ జంపఁబడెననియును దండకవిలెయందు వ్రాయఁబడినది.

* రామరాజు శా॥ ౧౪౬౩-౧౪౮౬ వరకుఁ బాలించుచుండి ౧౪౮౬ (క్రీ 1564) రక్తాక్షి సం॥ వైశాఖమునఁ దురుష్కులచే తళ్ళికోటయొద్దఁ జంపఁబడెనని సందవాదిగ్రామ కైఫియ్యతునందు వ్రాయఁబడినది.

రామరాజు మృతుఁడైన బీజపురయుద్ధము (క్రీ 1579) న జరిగననియును, అచ్యుతదేవరాయలు మొదలు వెంకటపతిరాయలవరకును గడచిన కాలము (క్రీ 1543-1579) వరకనియు నింతటితోఁ దెలుగు రాజ్యము పూర్ణముగ తురుష్కులస్వాధీనమయ్యెననియు మరియొక కైఫియ్యతున వ్రాయబడినది.

సదాశివరాయల కాలమున లిఖింపఁబడిన శాసనములు చాల గలవు; కాని రామరాజునాటివికూడ సదాశివరాయలపేరుననె కనుపట్టుచున్నవి. ఇవియన్నియు క్రీ 1542-1564 వరకుఁ గానబడుచున్నవి. అందువలన వీరి యుభయుల కాలమును విభజించుటకు వీలులేదు. మొత్తముమీద 7-8 సం॥లు వ్యత్యయము గానబడుచున్నది.

* లోకల్ రికార్డు వాల్యూం 40 పేజి 301.

## సదాశివరాయల ధర్మములు.

ఈతని దానశాసనములు దొరతనమువారి పుస్తకభాండాగార (Government Oriental Manscripts Library) నం దనేకము లు గనుపట్టుచున్నవి. ఇంకను గొన్ని శాసనములు దొరక లేదనియును జెప్పవచ్చును. సదాశివరాయలను గూర్చి దండకవిలెలోఁ గొన్ని శ్లోకము లుదహరింపఁబడి యున్నవి. వాటి నీదిగువఁ బ్రకటించుచున్నాను.

శ్లో॥ "రసాంగార్ణవశీతాంశు (౧౪౬౬) శాకాబ్దే శాలివాహనే
క్రోధిసంవత్సరేవర్షే ప్రాస్వశాకపురందదౌ
చిలకమర్తికులేజాతం వల్లభాచార్యదేశికం
ప్రాస్వశాకప్రతిసదాశివరాయపురందదౌ ॥
శరఋత్వాబ్ధిభూసంఖ్యే (౧౪౬౫) శాకాబ్దే శాలివాహనే
శ్రీసదాశివరాయేంద్ర శ్శోభకృన్నామవత్సరే
వల్లభాచార్యవర్యాయ దదౌ గోవాటికాపురీం ॥
సప్తపంచాబ్ధిభూసంఖ్యే (౧౪౫౭) శాకాబ్దే శాలివాహనే
శ్రీసదాశివరాయేంద్రో విశ్వావసుశరద్రపి
వల్లభాచార్యవర్యాయ చిలకమర్తికులాయచ
ఈశ్వరార్పణబుద్ధ్యావై హనూమాల్లపురందదౌ ॥"

పై శ్లోకములవలన చిలకమర్తి వల్లభాచార్యులకు సత్తెనపల్లి తాలూకా చినకూరపాడును, తెనాలితాలూకా గోవాడయు, హనుమాల్లపురమును సదాశివరాయలు దానమొసగ్చినట్లు కనుపట్టుచున్నది. మఱియు,

"ఉత్తరనారాకోడూరు కందాళ్ళ అయ్యావార్లగారికి యిచ్చెను. వీరు వాధూలగోత్రులు. నుదురుపాటిపొలములోను తూపలు ౨౫, వేమవరము (నుదురుపాడు) పొలములోను తూపలు ౨౫, రేగులగడ్డ పొలములోను తూపలు ౨౫, మొత్తము ౭౫ (డెబ్బదియైదు) తూపలు కండ్రికయేర్పరచి ముకుంబి అయ్యావార్లగారికి యిచ్చెను." "తాళ్ళూరి పొలములోని తూపలు ౫౦ కండ్రికచేసి శ్రీరంగపురమను నామమిడి వైష్ణవులు ౫ యిండ్లవారికి యిచ్చెను. ఎడ్లపాటిపొలములోను తూపలు 30 కండ్రికచేసి విశ్వనాథు అను బ్రాహ్మణునకిచ్చెను." (ఇది విశ్వనాథుని కండ్రికయని పిలువబడుచు కొలచెలములవారను వైదికబ్రాహ్మణులకు భుక్తమగుచున్నది. వీరు కొలచల మల్లినాథుని వంశమువారమనుచున్నారు. పైవిశ్వనాథుని యింటిపేరును యిదియేయైయుండును.

"ఈవని పొలములో తూపలు ౭౫ (డెబ్బదియైదు) శ్రీ రఘునాయకస్వామివారికి నైవేద్యదీపారాధనల కిచ్చెను."

"వినుకొండసీమలోని మిన్నెకల్లు, వరపర్ల, కృష్ణరాయలు తాళ్లపాక చిన్నయ్యగారికి యిచ్చెను" అని దండకవిలెయందు గలదు. దానికి వ్యతిరేకమ్ముగ మిన్నెకంటియందు శ్రీ యాంజనేయస్వామివారి గుడియొద్దగల యీ దిగువ గన్పట్టు శాసనమువలన నీ గ్రామము తాళ్ళపాక అన్నమయ్యగారికి సదా శివరాయలిచ్చినట్లు తెలియుచున్నది.



శ్రీమతే రామానుజాయనమః.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౮౮ అగు పరాభవ సం॥ జ్యేష్ఠ శు ౧౫ గురువారము శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యులయిన తాడపాక తిరుమలయ్యగారి కుమారుండు అన్నమయ్యగారికి, శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరసదాశివదేవమహీపతిరాయలు విజయనగరమందు పృథ్వీసామ్రాజ్యము చేయుచు కొండవీటిదుర్గానకు చెల్లివచ్చే వినుకొండసీమలోని మిన్నికల్లు అనే గ్రామము సహిరణ్యోదకధారాపూర్వకముగాను వారికి యిచ్చిన అగ్రహారము.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతంపదం ॥ శ్రీశ్రీశ్రీంజేయును"

మఱియు సత్తెనపల్లితాలూకా గరికెపాడను గ్రామము తర్కశాస్త్రవేత్తయగు మామిళ్ళపల్లి అన్నంభట్టునకు శా॥ ౧౪౬౧ సిద్ధార్థి ఆషాఢ శు ౧౨ న యిచ్చెను. ఇది యిప్పటికిని వారిసంతతివారికె భుక్తమగుచున్నది. దండకవిలెయం దీ క్రింది గ్రామముల నగ్రహారములుగ నిచ్చినట్లు వ్రాయబడినది.

గరికెపాడు, కొల్లిమర్ల, బండారుపల్లి, ముట్లూరు, పెనుగుదురుపాడు, చివులూరు, పెదరావూరు, కోడితాడిపర్రు, దండమూడి, దక్షిణాగుడిపాడు, దక్షిణమద్రిపూడి, గడ్డిపాడు, పెదపూడి, చినరావూరు, పినపాడు. ఇవిగాక బ్రాహ్మణకోడూరు, పెదచెరుకూరు, మంచాళ, కసుపునూరు, నాగండ్ల కూడ నిద్దుఁ జేర్పబడినవి కాని యివి రెడ్డిరాజు

లిచ్చినట్లు గనుపట్టుచున్నది. అయినను వీరు పూర్వపుదానములఁ బున రుద్ధారణ చేసియుందురు.

"ఈ రాయలదేవుడు చనినతరువాత యీయన అల్లుడు గామరాజు యేలెను. అటుతరువాత శ్రీ మహామండలేశ్వర 'జటమూరి మాగరాజు' యేలెను. ఈ మాగరాజు స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా॥ ౧౩౩౭ అగు నేటి స్వభాను సం॥న అత్తోట పొలములో తూపలు ౧౫ యీావని పొలములో తూపలు ౧౫ యీ ౩౦ తూపలు పొలిమేర హద్దులు పెట్టించి కుంచవరమను పేర అగస్తీశ్వరలింగానకు నిత్యనైవేద్య దీపారాధనలకు కుంచవరం అమ్మసానివశాన యిచ్చెను" అను నీ వాక్యములు దండకవిలెయందు వ్రాయబడినవి. కాని యీ మాగరాజు యెవ్వడో తెలియరాదు.

సదాశివరాయలు 1 క్రోసూరు, 2 చామర్రు, 3 ఉత్తరచింతపల్లి, 4 గింజుపల్లి, 5 కుంటిమర్ది, 6 జటపల్లి, 7 మాపాడు, 8 తాడువాయి, 9 చల్లగరిగె. యీ గ్రామములు జంపనివారికి మొఖాసాగా యిచ్చెను.

### సదాశివరాయల ప్రతినిధులు.

సదాశివరాయలు రాజకీయవ్యవహారములు సక్రమముగ నడచుటకుగాను కొందఱు ప్రతినిధుల నియమించెను. వారు 1 కృష్ణప్పనాయకుడు, 2 సూరప్పనాయకుడు, 3 యెరబొమ్మనాయకుడు, 4 నలబొమ్మనాయకుడు, 5 దళవాయి కృష్ణమ్మనాయుడు, 6 రామానాయకుడు, 7 విఠలయ్యదేవరాయలు. ఏ భాగముల కెవరు పాలకులుగ నియమింపఁబడినదియు తెలియరాదు. కాని విఠలదేవరాయలను గొండవీటికిఁ బ్రతినిధిగ నియమించినట్లుమాత్రము తెలియుచున్నది.

### విఠలయ్య దేవరాయలు.

ఈ విఠలయ్యదేవరాయలు ఆత్రేయగోత్రుడు. సోమవంశ క్ష



త్రియుడు. శ్రీమన్మహామండలేశ్వర కందనవోలి రామరాజుగారి పౌత్రుడు. మూర్తిరాజుగారి పుత్రుడు. (ఈ బిరుదము రాజ్యపాలనమునగాక గౌరవార్థముగ వచ్చినదైకూడ యుండును) ఈతడు కొండవీడు ప్రభుత్వమునకు వచ్చినతరువాతి విశేషము లేవియుఁ గానరావు. కాని శా॥ ౧౪౭౩ విరోధికృతు ఆషాఢ శు ౧౦ లు కొండవీటి కొండసింగరయ్య (నృసింహస్వామి) కు కొండపల్లి చెఱువు పడమరగ నాలయము నిర్మించి ప్రతిష్ఠించినట్లు తెలియుచున్నది. ఈ స్థల మిపుడు కానరాదు. ఈ విరోధికృతు సంవత్సర కార్తిక శు ౧౦ల నాటి శాసన మొకటి పొన్నూరు భావనారాయణస్వామివారికిఁ దోట సమర్పించినట్లు కందనవోలి రామరాజయ్య పేరటఁ గన్పించుచున్నది.

### కుమారకొండ రాజయ్యదేవరాయలు.

విఠలయ్య పిదప కుమారకొండ రాజయ్యదేవరాయలు కొండవీటికి పాలకుడుగ వచ్చెను. ఈతనికాలమునఁగూడ జరిగిన విశేషములు కానరావు. కాని యీతనివలన నీయబడిన రెండు దానశాసనములు మాత్ర మగుపడుచున్నవి. వాటి నిం దుదహరించుచున్నాను.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా॥ ౧౪౮౩ దుర్మతి మాఘ శు ౧౫ స్థిరవారమున శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప సదాశివదేవమహారాయలు విద్యానగరమందు పృథివీసామ్రాజ్యము చేయుచుండంగాను సోమవంశోద్భవులైన, ఆత్రేయగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యయులైన శ్రీమన్మహామండలేశ్వర రామరాజు పెదకొండరాజయదేవ మహారాజులుంగారి పౌత్రులున్ను, వేంకటేశ్వరునింగారి పుత్రులున్ను అయిన కుమారకొండరాజయ్యదేవమహారాజులుంగారు వసిష్ఠగోత్ర ఆశ్వలాయనసూత్రుల ఋుశ్శాఖాధ్యయులైన రామయభాస్కరుని అన్నమయగారి పౌత్రులు తిరుమలయగారి పుత్రులు అయిన కొండప్పగారికి......యిచ్చిన ధర్మశాసనము యేమనగా.—

శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమలరాజయ్యదేవ మహారాజయ్యదేవ మహారాజులుంగారు మా నాయకరానకు యివ్వనవధరించిన వినుకొండసీమలో అదివరకు జరుగుతూవుండే స్థలకరిణీకము యేకసంప్రతిపూర్వము సాగివచ్చే యేకభోగగ్రామములు, సీమలోని దేవతాగ్రామాలు, అగ్రహారములు, వృత్తిక్షేత్రములు, అమరపుంబళిక సంజాతగుత్తగ్రామాలున్ను గలిగిన వెలిపొలం, నీరుపొలం, తోటలు సహితం సర్వమా

న్యపు కమతాలున్ను మొదలుగాను మీకు సాగివచ్చే వర్తన తేజోపార్జనస్వామ్యాలు న్ను తిరుమలరాజయ్యగారు పూర్వము నడిపించిన మర్యాదను మేమున్ను యీతిథా తిథిగ్రహణపుణ్యకాలమందు తుంగభద్రాతీరమున విఠలేశ్వరసన్నిధిని వినుకొండలోను మేము ప్రతిష్ఠచేసిన శ్రీరఘునాయకులకు ప్రీతిగాను, త్రివాచకముగాను, త్రికరణశుద్ధి గాను, సహిరణ్యోదకదానధారాపూర్వకముగను ధారపోసి యిస్తిమి గనుక మీ స్థల కరిణీకాలకు చెల్లివచ్చే గ్రామాలు, కమతాలు, అగ్రహారపు వృత్తిక్షేత్రాలున్ను, వర్తన లు, రశ్మితేజోపార్జనలు మొదలైన నానాస్వామ్యస్వతంత్రాలున్ను మీ పుత్రపౌత్రపా రంపర్యం ఆచంద్రార్కస్థాయిగాను సుఖాను అనుభవించేది”

ఈ కొమారకొండ రాజయ్య పాలనమును నిరూపింపఁగల మఱి యింకొక శాసనము గనుపట్టుచున్నది. దాని నీ దిగువ బ్రకటించుచున్నాను.

రొంపిచెర్లకోటలో శివాలయమున కెదురుగ గల శాసనము.

“స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా॥శ॥ ౧౪౭౯ అగు నేటి పింగళసం॥ మాఘ బ౧౪ సోమవారము శ్రీమన్మహామండలేశ్వర కుమారకొండరాజయ్యవారి కార్యకర్తలైన కడి వేటి మారప్ప లింగప్పంగారు శంకరలింగానకు దండంబెట్టి యిచ్చిన ధర్మశాసనము... తథాతిథి మహాశివరాత్రిపుణ్యకాలమందు దేవరకు అమృతపల్లెకు రొంపిచర్ల పడమటి పొలాన పూర్వానంగల కుచ్చళ్ళు ౨ న్ను, మేముయిచ్చినవి దక్షిణపుపొలాన కుచ్చ ళ్ళు ౬ న్ను, పాత్రవైభవానకు కుచ్చళ్ళు ౪ యిస్తిమి. ఇందుకు తప్పినవారు యీ మాన్యాలు కోటేసున పెట్టించినవారు మేరలు ఆదిని......రాచ ఆడుకోలు మోహించి నవారు తల్లిని పట్టుకున్న పాపానబోవువారు. ఈ శాసనం కందమూరి అన్నంరాజు కుమారుడు చన్నయ్య వేయించెను. శ్రీశ్రీశ్రీ.”

మృత్యుజాఖానుడు.

సదాశివరాయల యనంతరమున లేక చరమదశయందుగాని (క్రీ॥ 1564 లేక 1570 న) రామరాజు మృతుఁడుకాగా నీదేశమంతయు బీజపుర తురుష్కుల స్వాధీనమయ్యెను. అప్పుడు చక్రవర్తి ఇబ్రహీం పాదుషా యనుమతిని కొండవీటికి మృత్యుజాఖానుడు పాలకుడుగ వచ్చెను. ఈతఁడు దుర్గము స్వాధీనముచేసికొని హిందువులనెల్ల యుద్యోగములనుండి తొలగించి తనవారిని నియమించెను. దేవాలయ ములఁ బాడుచేసెను. విగ్రహముల భిన్నముచేసెను. గోపినాథపురము నకు “మృత్యుజానగర”మని పేరుపెట్టెను. ఈ పేరే రాజకీయవ్యవహార



గ్రంథములందును వ్రాయ నిర్ణయించెను. ఈ యలవాటు మొన్న మొన్నటిదనుకను వచ్చుచుండెను. మఱియు “శా॥ ౧౫౦౦ ప్రమాది సం॥ చైత్ర శు ౫ వుదయం జాముప్రొద్దెక్కి అశ్వపతులు (తురకలు) కొండవీడు దుర్గమును తీసికొనిరి” అని దండకవిలెయందు వ్రాయ బడినది.

తిరుమలరాజు.

ఇట్లుండ మృత్యుజాఖానుడు వచ్చిన సంవత్సరమునందే అళియ రామరాజు తమ్ముఁడు తిరుమలరాజు (వసుచరిత్ర కృతిపతి) ప్రబలుఁడై సేనలఁ గూర్చుకొని కృష్ణదక్షిణదిశగల మహమ్మదీయులఁ బాఱఁద్రోలి దేశము స్వాధీనము జేసికొని రాజధానిని పెనుగొండకు మార్చుకొని రాజ్యము పాలింప నారంభించెను. కాని యప్పటికి తురుష్కులవలని యలజడి దేశమునకుఁ బోయియుండలేదు. దేశమునఁ గొన్ని భాగములు గూడ తురుష్కులకువశమై యుండెను.

ఈతని ప్రభుత్వకాలమునఁ గొండవీడు మొదలగు రాష్ట్రములు తురుష్కులబారినుండి తొలగింపబడినట్లు మాత్రము కనుపట్టుచున్నది. పాలకుల మారుపాటువలన మరల గోపినాథపురము గోపినాథపుర మనియే పిలువఁబడఁదొడంగెను.

శ్రీరంగరాయలు.

తిరుమలరాయలు తురుష్కులకు వశమైన రాష్ట్రమును పున రుద్ధారణముచేసి యొకటి రెండేండ్లుమాత్రము రాజ్యమును పాలించెను. ఇతనికి రామరాయలు, శ్రీరంగరాయలు, రఘునాధరాయలు, వేంకట పతిరాయలు అను నలుగురు పుత్రులు గలరు.

శ్రీరంగరాయలకుఁ దరువాత నతని రెండవకుమారుడు (రెండ వరంగరాయలు) రాజ్యమునకు వచ్చెను. ఇతడు శ్రీరంగరాయలకాల మననే కొండవీటికి బాలకుఁడుగ నియమింపఁ బడెను. కొండవీటియం దీతని శాసనములు మూడు గనుపట్టుచున్నవి. ఈతని ధర్మములం దెలు పు శాసనములు దొరికినంతవరకు నిందు బ్రకటించుచున్నాను. ఈతడు

శా॥ ౧౫౦౬ న భోగవతినది కానకట్ట గట్టించి నట్లొక శాసనము గలదు.

శ్రీరంగరాయలశాసనములు. (*గంగాధర రామేశ్వరుని) శాసనము.

1

"శుభమస్తు అవిఘ్నమస్తు.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా॥ శ॥ ౧౪౯౪ అగు నేటి అంగీరసనామ సం॥ వైశాఖ శు ౧౨ లు శ్రీమద్రాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీతిరుమలదేవ మహారాయలు పృథివీసామ్రాజ్యము చేయుచుండగాను కొండవీటి గోపినాథపట్టణము లోని గంగాధరరామేశ్వరుల నైవేద్య అంగరంగవైభవాలకు ఆత్రేయగోత్రం ఆపస్తంబ సూత్రం యజుశ్శాఖాధ్యాయులున్న శ్రీమన్మహామండలేశ్వర ఆనెగొంది తిరుమలదేవ మహారాయలపుత్రులైన శ్రీరంగరాజయ్యదేవమహారాయలుగారు దండం పెట్టి యిచ్చిన భూదానధర్మశాసనపత్రికక్రమ మెట్లన్నను.

స్వామి మాకు నాయకరానకు పాలించిన కొండవీటిరాజ్యములోని కృష్ణాతీరము మోరుంపూడి అనే గ్రామంలో తథాతిథిద్వాదశి పుణ్యకాలమందు సహిరణ్యోదకదాన ధారాపూర్వకముగాను నైవేద్యానకు ధారవోసి యిస్తిమి గనుక మాగ్రామానకు చెల్లే నిధి నిక్షేప జల తరు పాషాణాది అక్షీణ ఆగామి సిద్ధి స్వాస్త్యంబులనెడి అష్టభోగ తేజోస్వామ్యంబులున్ను స్వజాతముగాను యిస్తిమి గనుక దేవరనైవేద్యం అంగరంగ వైభవాలకు చేసుకునేది

శ్లో॥ స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణ స్వదత్తంనిష్ఫలం భవేత్॥
స్వదత్తాపరదత్తం వాయోహరేతు వసుంధరా
షష్టిర్వర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః
మద్వంశజాః పరమహీపతివంశజావా
యో వంశజా సతత ముజ్వలధర్మచింతాః
మద్ధర్మమేవ పరిపాలనమాచరంతి
తత్పాదపద్మయుగళం శిరసాం వహామి
శత్రూణాం బహుకృతో ధర్మంపాలనాని ప్రయత్నతః
శత్రురేవద్ధ్వశత్రు ధర్మశత్రు సశత్రుజిత్
స్తత్వాధార మిదం గిరేః నరహరి
పశ్చాంచీ మంగళాద్రిప్రభు మపిగృహాణాం ముప్పాద్యేశ్మకృత్యాం
గంగాధారాఖ్యరామేశ్వరమిల * * * యోర్కుతారం
శ్రీపాత్యం కొండవీట్యాం జయపి * * రఘునాథప్రమాఖ్యాయతింద్రా

---

* కొండవీటిఖిల్లా మధ్య గంజికాలువయొద్ద గంగాధరరామేశ్వరస్వామిగుడి యుత్తరపు స్తంభముమీది శాసనము.



2

గోపినాథస్వామిధ్వజమున గల శాసనము.

"శ్రీ గోపికావల్లభా (శంఖచక్రనామములు గలవు.)

శుభమస్తు! స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౯౯ అగు నేటి యీశ్వరనామ సం॥ కార్తీక శు ౧౦ లు శ్రీమద్రాజాధిరాజరాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీరరంగదేవ మహారాయలు అయ్యవారు విద్యానగరమందు రత్న సింహాసనారూఢులై పృథివీసామ్రాజ్యము చేయుచుండంగాను మార్తాండపుత్రుండైన కాలకర్మనిరూపాత్మునికి యిచ్చిన ధర్మశాసనము

కొండవీటిరాజ్యములో గొరిజవోలుగ్రామం ప్రతినామమైన శ్రీరంగరాయపురము నను సర్వమాన్యపు అగ్రహారంగా పాలించి యిస్తామని ధర్మం యిస్తిమి గనుక మా గ్రామాన వుండే అష్టదిక్కులకున్ను శిలాస్తంభాలు తూర్పునకు సంక్రాంతిపాడు ఆగ్నేయానకు సొలస నైఋతిభాగానకు జంగాలపల్లె పడమర చందవరం వాయవ్యానకు పాణుకుపాడు వుత్తరానకు మేరికపూడి యీశాన్యానకు నుదురుపాడు యీ అష్ట దిక్కులు యిక్కడికి సరి."

3

అమీనాబాదు ముల్లగూరమ్మగుడి దక్షిణద్వారం తూర్పుగోడమీది శాసనము.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౯౬ అగు నేటి భావ సం॥ పుష్య శు ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ రంగరాయదేవమహారాయలు రత్నసింహాసనాసీనులై పృథివిసామ్రాజ్యము చేయుచుండగాను మహాపరమేశ్వరి అయిన ముల్లగూరిశక్తికి శ్రీమన్మహామండలేశ్వర చుత్తమ గోత్రపవిత్రులైన వెంగళ నాయుడుగారికి పౌత్రులైన శేషమనాయునింగారికి పుత్రులైన నాగమనాయనింగారు వ్రాయించియిచ్చిన ధర్మశాసనక్రమ మెట్లన్నను

అమ్మవారు మాకు పాలించి యియ్య నవధరించిన కొండవీటిసీమలోను పూర్వా ననుంచి సాగివచ్చే ముల్లగూరిగ్రామం 1కి అగ్రహారము ధర్మప్రకారము నగరికిదేవతా
* * * (మిగతాభాగము శిథిలమయినది)

---

## తొమ్మిదవ ప్రకరణము.

---

### వెలిగోటి తిమ్మన.

శ్రీ రంగరాయలవలనఁ గొండవీటికి వెలిగోటి తిమ్మన (తిమ్మపనాయుడు) పాలకుడుగా నంపఁబడెను. ఈ విషయమును దెలుపు శాసన మొకటి యీ క్రింద నుదహరింపఁబడినది. ఈతని పాలనమున జరిగిన విశేషవిషయము లేవియుఁ గానరావు.

### నెల్లూరు శాసనము.

నెల్లూరి రంగనాయకుల గుడిలో నుత్తరపుగోడమీఁది శాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౯౫ అగు నేటి శ్రీముఖ సం॥ వైశాఖ శు ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీరంగరాయదేవమహారాయలు అయ్యవారి కార్యకర్తలయిన వెలుగోటి తిమ్మపనాయనింగారి ముద్రకర్త వెంకటప్పనాయండు రాయలవారికిన్ని తిమ్మపనాయనికిన్ని పుణ్యముగాను నెల్లూరి పవికొండనాథునికి తిరుగ నిప్పించి తిరునాళ్ళకు పంచహాణం వారికి నడిపి మర్యాదకు కట్టడించేసిన వివరం—తేరుయెక్కివచ్చినయందుకు తిరుపతి మర్యాదను పంచమహాణంవారికి నడుపంగలవారము యీ మర్యాదకు స్థలకరిణీకులున్ను కాపులనున్ను శెట్టిపాళగడ్లనున్ను వొప్పించి యీ యీ మర్యాదకు యెవ్వరుతప్పినాను గంగకర్తను గోబ్రాహ్మణులకు పుట్టిన శిశువులనున్ను వధించిన పాపాన బోవువారలు శ్రీ శ్రీ కరణము ముత్తరాజు వెంకటాద్రి చేసిన శాసనము".

### రాయరావు.

తిమ్మపనాయడు రాజ్య మేలుచుండగా ఇబ్రహింపాదుషా గోలకొండనవాబుగ నుండి కొండవీటిసీమపైకి "రాయరావు" అను మహారాష్ట్రబ్రాహ్మణుని (ఫౌజుదారు) పదివేలగుఱ్ఱములు, ఏబదివేల కాల్బలము, నూరు యేనుగులు, ఫిరంగుల బండ్లు, బాణాసంచు మొదలగు సన్నాహములతో బంపెను. ఈతడు గోల్కొండ వెడలి శ్రీ రంగ రాయలను జయించి యీ రాజధానికివచ్చి తొలుత వినికొండ, బెల్లంకొండ దుర్గములను స్వాధీనపఱచుకొని నాగార్జనకొండ, మాచెర్ల,



సీమలుహరించి నేలకోటయగు కొచ్చెర్లకోటలో తాను ఠాణా యేర్పరచుకొని అద్దంకి, అమ్మనబ్రోలు, కందుకూరు, కంభం, పొదిలె, తంగెడ, గురిజాల, కేతవరము, కారెముపూడి, మొదలగు నేలకోటలు సాధించి పిదపఁ గొండవీటిపై శా॥ ౧౫౦౧ (క్రీ॥ 1579) విక్రమ సం॥ వైశాఖ శు ౧౫ న దండువిడిసెను. అచ్చట రాజప్రతినిధిగనున్న వెలుగోటి తిమ్మపనాయఁడు రాయరావువలన నొక యిత్తడి వరాలసంచి లంచము గొని బొక్కసము రాజ్యమును విడిచి పాఱిపోయెను. యుద్ధశ్రమము లేకుండగనే రాయరావు దుర్గమగు కొండవీటిదుర్గమును స్వాధీనము జేసికొనెను. ఇదియే ఆంధ్రదేశము గోల్కొండరాజ్యమునఁ గలసినకాలము. ఇంగ్లీషువారు నిజామువారితో సంధిచేసికొని తీసుకొనువరకు నీ దేశము గోల్కొండరాజ్యపాలనముక్రింద నేయుండెను.

### బారాముత్సద్దీల పాలనము. (సముతులక్రమము)

రాయరావు వెలుగోటి తిమ్మనయొద్దనుండి కొండవీటి రాజ్యమును స్వాధీనము జేసికొని అచ్చటఁ దగునాయకుని దుర్గసంరక్షణార్థమై నియమించెను. పిమ్మటఁ దాను గోల్కొండకుఁ బోయి నవాబును దర్శించెను. గోల్కొండనవాబు మిగుల సంతసించి సన్మానముచేసి రాయరావు గోల్కొండయందుండి రాజ్యపరిపాలనాచట్టములు నిర్మించునటుల నియమించెను. రాయరావు పాదుషాయనుజ్ఞచే గోల్కొండయందుండి నూతనములగు చట్టముల నేర్పరచి పాలనక్రమమెల్ల శాసించెను. రాయరావు యేర్పరచిన చట్టములక్రమ మిం దుదహరింపఁబడుచున్నది.

### రాయరావు నిబంధనలు.

గోపినాథపురమునకు మరల మృత్యుంజానగరమని పేరుపెట్టి అక్కడ బారాముత్సద్దీలు అను రాజకీయోద్యోగస్థులు నిలిచి పాలనము సేయునట్లును, వినుకొండ బెల్లముకొండ థరగణాల వ్యవహారములు

కూడ బారాముత్సద్దీలే చూచుచుండునట్లును యేర్పరచెను. మఱియు గొండవీటిసీమ నీక్రిందివిధమునఁ బదునాల్గు సమతులుగ విభజించెను.

సముతులు, అందలి గ్రామములు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | పాలదుగు | 14 | గ్రామములు | 9 | సంతరావూరు | 10 | గ్రామములు |
| 2 | ప్రత్తిపాడు | 14 | ,, | 10 | చేబ్రోలు | 36 | ,, |
| 3 | నూతక్కి | 14 | ,, | 11 | మంగళగిరి | 33 | ,, |
| 4 | పొన్నూరు | 44 | ,, | 12 | నాదెండ్ల | 100 | ,, |
| 5 | మునిగోడు | 56 | ,, | 13 | కూచిపూడి | 54 | ,, |
| 6 | రావిపూడి | 12 | ,, | 14 | తాడికొండ | 22 | ,, |
| 7 | గుంటూరు | 34 | ,, | | | | |
| 8 | పులివఱ్ఱు | 52 | ,, | | గ్రామముల మొత్తము | 495 | |

ఈ సముతులకు చౌదర్లనుపేర నధికారులను నియమించెను. అన్ని సముతుల కేర్పరుపబడిన చౌదర్లపేర్లు తెలియవు. కాని నాదెండ్లకు 14 గ్రామములనియు, దానికి నలబోతువారు చౌదర్లనియు దండకవిలెయందు వ్రాయబడినది.

బిరుదులు.

(1) కర్ణాటప్రభుత్వకాలమున కొండవీటియందు ఖిల్లేదారు హోదాలోనుండిన "మాణిక్యారావువారు" అను కమ్మవారికి సర్ దేశముఖీమన్నె వారనియు, (2) మానూరువా (మధ్వబ్రాహ్మణులు) రికి జమీన్‌దార్ మజుందారనియు, (3) బలభద్రపాత్రునివారికి దేశపాండ్యాలనియు నధికారరూపకములగు బిరుదములిచ్చి రాయరావు క్రమముగ రాజ్యపాలనము జరుగునట్లు శాసనములఁ బ్రకటించెను.

బారాముత్సద్దీల పాలనము తొలగుట.

రాయరావు నియమించిన చట్టములప్రకారము కొంతకాలము రాజ్యపరిపాలనము క్రమముగ నడచెను. కాని రాజ్యములోని మన్నె



వారు (జమీన్‌దారులు) మొదలగువారు కొంతకొంత స్వాతంత్ర్యమును గల్పించుకొని రాజశాసనములను లక్ష్యపెట్టక తిరుగుబాట్లుసేయుచు జనోపద్రవములగు క్రూరకృత్యములును (దోపిడులు మొదలగునవి) రాజద్రోహములుసేయ నారంభించిరి. అప్పుడు జనక్షోభ మెక్కుడుగ నుండెను. రుసుములు సావరాలు వసూలుకాకుండెను. ఇది తెలిసి రాయరావు కొండవీటిరాష్ట్రపాలనమునకుఁ దగు నాయకుని బంపవలయునని యోజించి నవాబు యుత్తరువు ననుసరించి మఱియొకని బంపెను. కావున బారాముత్సద్దీల యేలుబడి శా॥ శ॥ ౧౫౦౪-౧౫౧౨ (క్రీ 1582-1590) సంవత్సరముతో తొలగిపోయెను.

అమీనుముల్కు.

అమీనుముల్కు బారాముత్సద్దీల యనంతరము కొండవీటికి యధికారిక వచ్చెను. బారాముత్సద్దీలకాలమున దేశమున జనించిన సంక్షోభమునుమాన్పి దేశమును ప్రశాంతముగఁ బాలించుటకై యీతఁడు గోల్కొండనవాబువలన నియోగింపఁబడెను. అమీనుముల్కు పదివేలగుఱ్ఱములు, యిరువదివేల కాల్బలము తనవెంటఁ దోడ్కొని వచ్చి శా॥ ౧౫౧3 (క్రీ 1591) ఖర సం॥ జ్యేష్ఠ శు 3 న గొండవీటియందుఁ బ్రవేసించెను. ఇతఁడతి కర్కశహృదయుఁడు. ఈతఁడు రాజద్రోహుల నెల్లబట్టి తెప్పించి వారినెల్లర నతికఠినముగ శిక్షించెను. ఎట్టి యల్పనేరమునకైనను అమీనుముల్కు మిగుల గొప్పగ దండన విధించుచుండెను. ఈతనిపేరు వినిన నెల్లరు మిగుల భయపడుచుండిరి. మొత్తముమీఁద నాకాలమునఁ బ్రబలిన దేశద్రోహులయొక్కయు, స్వార్థాభిలాషులై పరుల బాధించు దుండగులయొక్కయు సంక్షోభము లీ యమీనుముల్కు సామర్థ్యమునవలన నంతరించెనని చెప్పవచ్చును.

అమీనాబాదు గ్రామ నిర్మాణము.

అమీనుముల్కు దాను కొండవీటికివచ్చిన మరుసటి సంవత్సర

ను అనగా శా॥ శ॥ ౧౫౧౪ (క్రీ 1592) నందన సంవత్సర జ్యేష్ఠ శు౭ నాడు కొండవీటికి దాపుననున్న ముల్లగూరును యాబలూరుపాటిలో గలిపి నూతనగ్రామప్రతిష్ఠకై గడ్డయెత్తించి దానికి "అమీనాబాదు" అను పేరుబెట్టెను. అమీనుముల్కు కు యీ ముహూర్తమును గబ్బిట అప్పయ్య (అయ్యలయ్య) జ్యోస్యులు నిర్ణయించిచెప్పెను.

## పురాతన ప్రతిష్ఠాపనల వినాశము - నూతన ప్రతిష్ఠాపనలు.

(1) అమీనాబాదుకు సమీపమునగల కొండపై ముల్లగూరమ్మ గుడిగలదు. అమీనుముల్కు అందలి విగ్రహములను, ద్వారబంధములు మున్నగు శిలలను బగులగొట్టించెను. లోపలిభాగమునగల శివలింగమును తీసివైచెను. ఆ దేవాలయమును మశీదుగ నుపయోగింప నాతడు దాని నలుప్రక్కల ద్వారములు పెట్టించెను. * దేవాలయమునందొక సువర్ణవిగ్రహముండెడిదట. అమీనుముల్కు ఆలయమున బ్రవేశించినంత నది మాయమయ్యెనట. § కాని యెడ్ల సూరజాయనునతడా విగ్రహమును దీసి తనయింటదాచి దానికి బూజాదికము లొనర్చుచు అమీనుముల్కు యలజడి తీరిన యనంతరము అమీనాబాదుకు తూర్పున గుడిగట్టించి దాని నందు బ్రతిష్ఠించెనట. ఇపుడు పూజింపబడుచున్న విగ్రహము పునరుద్ధారణమువలన నేర్పడినదై యుండవచ్చును. మఱియు దేవాలయమును మశీదుగ జేయ నిశ్చయించిన యమీనుముల్కు పూర్వముండిన విగ్రహమును శిథిలముజేయక విడిచియుండడు.

(2) యాబలూరులోని శివకేశవాలయములు రెండును అమీనుముల్కు పాడుచేసెను. అచటనున్న అనిశ్రమ్మ చెఱువుకట్ట దెగగొట్టించి ఆ దేవాలయముల రాతితో బలమగు చెఱువుకట్ట గట్టించి చెఱువును విశాలముగ జేసెను. దానికి మూడుతూములు పెట్టించెను.

(3) అమీనుముల్కు చెఱువుకడనున్న చట్టుపైగల జలధారేశ్వరుని గుడిని బగులగొట్టించెను. ఆ దేవాలయపురాతితో పదునాఱు

* దండకవిలె. § కొండవీటి కైఫియతు.



స్తంభముల నావరణమును, బంగ్రెండు మధ్యసంధులును గల మసీదు గట్టించెను. ఆ మసీదుపై నాల్గుస్తంభముల మహాలు గట్టించి దానికి "మల్కానుమహాలు" అని పేరుబెట్టెను.

(4) ముల్లగూరమ్మగుడికి ఆగ్నేయభాగమున దనకొక్క యంతఃపురమును అమీనుముల్కు గట్టించుకొనెను. అచట "ఉప్పుతోట" ల నేర్పరచెను. ఆ తోట కీశాన్యదిశను బావి త్రవ్వించి దానికి "మల్కాబావి" అను నామమిడెను. ఆ బావి నీటిని తోటల కుపయోగపఱచుచుండెను.

అమీనుముల్కు కొండవీటిసీమ కధికారము వహించి తానొనర్చిన కృత్యములు మున్నగువాటిని తెలియజేయుచు నొక శాసనము వేయించియున్నాడు. దాని నీక్రింద ప్రకటించుచున్నాను.

### * అమీనుముల్కు శాసనము.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౧౪ అగు నేటి నందన సంవత్సర వైశాఖ శు 3 గురువారము స॥ స్నసలో సుతిసైను తిస్సామియా ఙ ౧ మహెసవ్వాలు స్న అలప్పావు ౧౦౦౦ సాలు అగు నేటి మోతిమదపులతుం అవియుతులు అరియాన లివుసల తనతల ఆయాలతుల బాహీరామల్కా అమీనుమలక వొడయులుంగారు చేసిన ప్రతాపధర్మశాసనక్రమ మెట్లన్నను—

మొదలను శాలివాహన శకవర్షంబులు ౧౫౦౨ అగు నేటి విక్రమ సంవత్సర వైశాఖ ౧౪ భవుమవారంనాడు హజరతీ యిభరాహీం పాదుషాహా వొడయులుంగారు తమ నాయజాదు అంపితేను ఉ॥ దాటి జగనెంగి వుద్దగిరి హమ్మని వెంకటరాజుందోలి ముంగోటలు లగ్గపట్టి వినికొండయు బెల్లముకొండ తంగెడకపాటిపరిక హరించి మరి బలిమిని గైకొని కొండవీడు కర్ణాటకరాజధాని యిభురాముడు బాహుబలంబుమీరుచును యీలాగు ప్రతాపాన కొండవీటిరాజ్యం పుచ్చుకొని రాజ్యం పరిపాలిస్తువుండెను. యివితల యిభరాహీము పాదుశహాగారి పుత్రుండు మహమ్మదుకుల్లిపాదుశహా వొడయులుంగారు క్రితము బయిసనసాలులో చ ౨౧ రబ్బిలసాని తేదిన పట్టాభిషిక్తుండై రాజ్యం పరిపాలిస్తు వుండంగాను ఖరసంవత్సరంలోను భల్లేరాయుండు సాబ్జాఆలముఖానుండు ఖానుఖానా మొదలైనవారున్ను పాయిదొరలున్ను తిరుగుబడి హరాంఖోరులై కొండవీటిసీమలోను వుండంగాను హజరతి పాదుషహా వొడయలుంగారు తమ పట్టణానకు ప్రధాని అయిన మల్కాఅమీను మల్కుంకు శెలవుయిచ్చి యీ తిరుగబడ్డ హరాంఖో

* ముల్లగూరమ్మ గుడిలోని ద్వారబంధమున దక్షిణవైపు రాతిపై నున్నది.

రులను దండించి సీమ కుదురుపరచి రమ్మని శెలవుదయచేస్తేను ఆలాగే రాజుగారి అన తిక్రమాన మల్కా వొడయులుంగారు గోలకొండ వెళ్ళి వచ్చేవన్న ఖబరువిని యీ హ రాంఖోరులు అయినవాండ్లు అందరు సోర్యోదయం అయితేను చీకట్లు విచ్చిపోయిన ట్లు యెక్కడివాండ్లు అక్కడనే యదా ఘదరులై పారిపోయిరి. మల్కా వొడయులుం గారును కృష్ణదాటి సీమలోకి విజయంచేసి దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనచేసి హరాంఖో ర్లు అయినవాండ్లకెల్లాను ఆజ్ఞచేసిరి."

## అమీనుముల్కు ప్రవర్తనము.

ఇతఁడు క్రమముగ దన ధర్మమునుమీరి చరింపనారంభించెను. అనేకరుసుములు, గోనెగిద్దలు నూతనముగ గల్పించి ప్రజాపీడాకరుఁడై యుండెను. దేవాలయములన్నియు మశీదులుగ మార్పించెను. వాటిపై నంతరువు లేర్పరచి యందు భోగస్త్రీలతోఁగూడ విహరించుచుండెడి వాఁడు. రాయరావు నియమించిన చట్టము లీతని యంత్యకాలమునకు బనికిరానివయ్యెను. అమీనుముల్కు మిగులఁ గఠోరపద్ధతి నవలంబించి నీతిదూరగుఁడై యధికారమును చెల్లించుచుండెను. దుర్నీతికాకర మగు నీతని పాలనమువలన ప్రజాక్షోభము మిక్కుటమై యుండెను. ఈ కారణములవలన బ్రజలలో కలవరము జనించి వారిని యుద్రేకపూరితుల గావించి యాత్మరక్షణోపాయము వెదకుకొనఁ బ్రోత్సాహపఱచెను.

## అమీనుముల్కుకు విధింపబడిన దండనము.

ఈతని బాఱికి వెఱచి, కొండవీటిసీమయందలి స్థలకరణములు, ఇతర పెద్దమనుష్యులు, నాదెండ్లమున్నగు సముతుదార్లు గోల్కొండకుఁ బోయి యటఁ బాదుషాహి కమీనుముల్కు దుర్నయములెల్ల వినిపించిరి. *"ఖొల్లిపాదుషా" అను నతఁడపుడచట రాజ్యమేలుచుండెను. అతఁడు వారి మనవుల విని జాలిఁబడి వారికభయహస్తమిడెను.

* నిజాంరాజ్యములోని వాడపల్లి నృసింహ దేవాలయమున ఇబ్రహీం పాదుషా పుత్రుండగు నీఖొల్లిపాదుషా శాసన మొకటి కలదు. అది శా॥ శ॥ ౧౫౬౦ కీలక సం॥ జ్యేష్ఠ బ ౨ లు నాటిది. (అమీనుముల్కు విషయమున వ్రాయబడిన సంగతులన్నియు సర్వేయరు జనరల్ శ్రీ మెకంజీదొరగారు వ్రాయించిన అమీనాబాదు కైఫీయతునందు నుదహరింపబడియున్నవి.)



అమీనుముల్కును తత్క్షణంబ రా నాజ్ఞబంపెను. అతఁడు వచ్చిన యనంతర మాతని పాపములకుఁ బ్రాయశ్చిత్తముగఁ బాదుషాహి అమీనుముల్కు కన్నులు పెఱికించెను. కొండవీటిసీమకు అమీనుముల్కు పాలనము శా॥ శ॥ ౧౫౨౦ సంవత్సరముతో దీరిపోయెను. ఈతఁడె పదిమిదేండ్లు అధికారము వహించియుండెను.

అమీనుముల్కు అనంతరము ఫత్తేఖానుడు కొండవీటికి పాలకుడుగ వచ్చినట్లు ఒకానొకచోట గానవచ్చుచున్నది. అది పొరబాటు. ఇతనికిఁ దరువాత "శిఖవసుఖానుడు" పాలకుడుగ వచ్చెనుగాని ఫత్తేఖానుడు గాడు.

## శిఖవసుఖానుడు.

అమీనుముల్కు పిమ్మటఁ గొండవీటి పాలనమునకు శిఖవసుఖానుడు వచ్చెను. ఈతడును నవాబుకడనుండి యధికారమునుపొంది వచ్చి పాలించినట్లు కనుపట్టుచున్నది. కాని దండకవిలె ననుసరించి చూడ నితడు మొదట అమీనుముల్కు క్రింద నొక యుద్యోగిగ వచ్చినట్లు చూపట్టుచున్నది. కాన నితని కాలనిర్ణయము సరిగాఁ దెలియరాదు.

శిఖవసుఖానుని కాలమున జరిగిన విషయము లెవ్వియు గానరావు. కాని యితడు కొండవీటికి దక్షిణమున మహమ్మద్ కుతుబ్ షాపేట (కుతుబ్ పేట) యును, కోటకుత్తరమున మహమ్మద్ షాపురమును, కొండవీటికి రెండుమైళ్ళదూరమునఁ దన పేరిట శిఖవస్కాన్ పేట (శింగిస్కాన్ పేట) యును మాత్రము గట్టించెను.

## "అమీను" ఉద్యోగమునవచ్చినవారు.

గోల్కొండ రాజ్య సింహాసనమునకు, నటఫర్ జంగు తానీషా, అబ్దుల్లాహుస్సేన్ తానీషా, అలంగీరుపాదుషాహీలు వరుసగా నధిపతులై పాలింపుచుండిరి. వీరు కొండవీటినిఁ బాలించుటకు "అమీను" అను అధికారిని నియమించుచుండిరి. ఈ అమీన్ పదవి నందివచ్చినవారు కొందరు గలరు. వారినిగూర్చి మన కేమియు విశేషాంశములు తెలియు

రావు. అలవడిన నిదర్శనములనుబట్టి వారిపేర్లను, కాలములును మాత్ర మిందుదహరించుచున్నాను.

అమీనులు.

| | | | |
|---|---|---|---|
| ఫరాస్ ఖానుడు. | శా॥ ౧౫౨౧-౧౫౨౩ | క్రీ 1599-1601. | 3 సం॥ |
| అబుల్ బీబీఫులుల్ ఖాన్. | ౧౫౨౪ | 1602. | 1 సం॥ |
| అసరస్ ఖాన్ | ౧౫౨౪-౧౫౨౭ | 1602-1605. | 3 సం॥ |
| యకలాస్ ఖాన్ | ౧౫౨౭-౧౫౩౩ | 1605-1611. | 6 సం॥ |
| గుంటుపల్లి ముత్తరాజయ్య | ఈ యుభయుల కాలము విశదీయ నవకా | | |

శము దొరకలేదు. అందువలన నెవరెన్ని సంవత్సరములు పాలించినదియు తెలియరాదు. మఱియు వీరిరువురును కలిసి కొండవీటిని పాలించిరనియుగూడ దోచుచున్నది.

వీరిలో యకలాస్ ఖానుడు స్వయముగ అమీను అధికారము వహించి ౧౫౩౫ వరకు (రెండేండ్లు) కొండవీటిని పాలించెను. ఇతడు కొండవీటి యుత్తరదిశ మూడుమైళ్ళ దూరమునఁగల చిన్నకొండపై బూర్వము రెడ్డిరాజులచేఁ గట్టింపఁబడిన విఘ్నేశ్వరాలయము చెడియుండగ నందుఁ బ్రవేసించి విగ్రహమును బగులగొట్టి దానికి దాపున షాజుగణేశుపేట యనుపేర నొక యూరు కట్టించెను. ఈగ్రామమును గుడియు విగ్రహము నిప్పటికినిఁ గనుపట్టుచున్నది. పిమ్మట ముకుటీఖానుడు అమీనుగా వచ్చి శా॥ ౧౫౩౬-౧౫౩౭ వరకు పాలించెను.

గుంటుపల్లి ముత్తరాజయ్య,

అమీనుపదవి నందిన గుంటుపల్లి ముత్తనామాత్యుఁడు (ముత్తిరాజు) మిక్కిలి సమర్థుఁడు. ఇతఁడు నవాబునను గ్రహమును వడసి యధికారమును వహించి కప్పములుకట్టక తిరుగబాటుచేసిన జమీన్‌దారులు, పాలెగాండ్రు మొదలగువారిని శిక్షించి రుసుములు చెల్లించునట్లు చేసి దొరతనమువారి మెప్పుగాంచెను. ఈతని కొకకొండవీటిఅమీను యుద్యోగముమాత్రముగాక (దుస్సాపాదుషా) రెండవపాదుషా యను



కితాబుతో పగటిదివిటి, అడ్డపల్లకి (అనగా వీధికి అడ్డము పల్లకినిపట్టించి నడిపించుట) కూసీలకు సెలవు. నవుబత్తునగారా. అయిదువేల గుఱ్ఱములు. నాలుగువేల కాల్బలమునుగూడ యిచ్చి దండనాధికారముతో నీ దేశపాలనమునకు మహమ్మదుకుల్లి పాదుషాగారు నిర్ణయించిరి.

ఈయన జనకతండ్రి పెదవీరంరాజు. దత్తుతండ్రి రామలింగభాస్కరుఁడు. ఈయన శైవమతావలంబియై ఆరాధ్యులను గురువులుగ నేర్పరచుకొని తనపేర ముత్తేశ్వరమని గ్రామముకట్టించి తత్సమీపమునఁగల కొండలపై శివప్రతిష్ఠలుచేసి తాను శైవమత మవలంబించునపుడు గురువగు శంకరలింగము అయ్యవార్లగారికి శంకరలి౦గగుడిపాడు అగ్రహారము శా॥ ౧౫౨౩ ప్లవ సం॥ మాఘ బ ౧౪ చతుర్దశిన (క్రీ ౬-౬-౪-౧) యిచ్చెను. వెలనాటి వైదికబ్రాహ్మణుడగు మద్దూరి పేరుభట్టునకు చినకసుముద్రుగ్రామము శా॥ శ॥ ౧౫౨౮ (క్రీ॥ 1606) పరాభవసం॥ మాఘ బ ౧౬ న యిచ్చెను. శ్రీశైలమున దేవాలయగోపురము కట్టించెను. ఈతని ధర్మములు పెక్కులు గలవు.

మఱియు శా॥ ౧౫౩౫ పరీధావి సం॥ర వైశాఖ శు ౫ లుగల యీతని శాసన మొకటి పొన్నూరు భావనారాయణస్వామివారి గుడియందు గలదు.

ఈయన యధికారము శా॥ ౧౫౦౦ - ౧౫౬౫ వరకు బహుధాన్య మొదలు దుందుభివరకు (౬౫ సం॥లు) జరిగెను. తన యంతిమదశయందు మొదట నవాబు తనకిచ్చిన పరిభవమును తానుంచుకొనక తిరుగ నవాబునకిచ్చివేసి తనవారికిఁ గొన్నిగ్రామములనుమాత్ర మిప్పించి తాను మృతుడయ్యెను.

ఈతని పాలనముక్రింది రాజ్యమును, పరాక్రమాదికములును, మరణమును నీ దిగువ పద్యములవలనఁ దెలియగలవు.

క. నాలుగు దుర్గంబులుఁ బదు
నాలుగు దేశముల ప్రజల నయమార్గమున౯

లాలింపుచుఁ జిరకాలము
పాలించెను ముత్తమంత్రి ప్రభుమాత్రుండే.

సీ. దుర్మదధూళిగఁ జేసి తూర్పాళ్ళఁబట్టడే కోపాగ్నిచే బొమ్మలాపురంబు
నుగ్గునూచంబుగా నూర్పిడిసేయఁడే ధాటిమీరఁగ నెల్లిబాటికోట
ఖండతుండములుగా చెండిచెక్కాడడే దండిబోయలపేట చుండికోట
కుటిలవైరుల గ్రుంచి కొల్లపెట్టింపఁడే శ్రీలుమీరఁగ దోరణాలకోట
తే. పాదుషా దత్త ఘనరాజ్యపదనిరూఢి
జెంది శ్రీ గుంటుపలికులశేఖరుండ
టంచు నీవైరిమంత్రులిట్లెంద్రు భువిని
మంత్రికులహేళి ముత్తనామాత్యమౌళి.

క. పొందుగ శకజలనిధి హరి
చందనతరు చంద్రసంఖ్య (౧౬౬౪) శకవర్షంబుల్
దుందుభి నాషాఢంబున
నందముగా వీరముత్త దరిగెన్ దివికిన్.

ఈయన దాతృత్వమునఁ బ్రసిద్ధికెక్కినవాఁడై యుండియు సాత్విక దాతగాక రాజసదాతయైన ట్లొక భట్టుచెప్పిన యీక్రింది పద్యమువలన దెలియును.

క. పదివేల మాడ లిచ్చిన
నిదె కొమ్మని నూఱువేల నిచ్చినఁగానీ
తుదిఁ బ్రియము సెప్పకుండిన
ముదుగుడుమీ గుంటుపల్లి ముత్తామాత్యా॥

గుంటుపల్లి ముత్తన.

గుంటుపల్లి ముత్తన కడు బీదకుటుంబమునఁ బుట్టినవాఁడు. ఇతఁడు స్వగ్రామమగు గుంటుపల్లి (నర్సరావుపేట తా॥) యొద్దగల కాకేపల్లి (ఇపుడు కానరాదు) పాటిమీద పశువులఁగాయుచు నొక చెట్టుక్రిందఁ బరుండి నిద్రించుచుండ నొక కృష్ణసర్పమాతని కెండతగులకుండ పడగ నడ్డముపట్టియుండెను. ఇట్లుండ రాయునభాస్కరుని వంశజుఁడగు రామలింగభాస్కరుడు (వినుకొండపరగణా జమీందారుడు) పల్లకినెక్కి త్రోవనుబోవుచు నిదిచూచి యచ్చెరువొంది బాలకుని వృత్తాంతమరయనెంచి పల్లకిని వానికడ దింపించి బాలుని నిదురనుండి లేపి



"నీవెవరు, నేను పెంచుకొనెదను వచ్చెదవా?" యని యడిగెను. అంతలకా బాలుడు సమ్మతింప నాతని తలిదండ్రుల సమ్మతి నాబాలుని పాలకకుమారునిగ గ్రహించెను. రామలింగభాస్కరునికిఁ బుత్రులు గలరు. కాని యీతనియెడల రాజచిహ్నములు గలిగినగాని సర్పము పడగ నెండకడ్డముగఁ బట్టదనియెంచి తనకుఁ బుత్రులుండినను ఆతఁడు ముత్తరాజును పెంచుకొనెను.

ముత్తనక్రమముగ నభివృద్ధినొంది నవాబును దర్శించెను. నవాబు అనుగ్రహమువలన దేశపాండ్యాగిరిమాత్రముగాక ప్రభుత్వమును సంపాదించెను. ఈక్రిందిదేశము లీతనిపాలనముక్రింద నుండెను. దుర్గములు 1 కొండవీడు, 2 వినుకొండ, 3 బెల్లముకొండ, 4 కొండపల్లి. వీటిక్రిందనుండిన సీమలు. అద్దంకి, ఒంగవోలు, కందుకూరు, నెల్లూరు, ఉదయగిరి, చుండి, పొదిలె, మారెళ్ళ, కోటసీమ, దూపాడు, దర్శి, కంభంమెట్టు, నందిగామ, నల్లగొండ, నాగార్జునకొండ, కంభము మొదలగునవి. (ఇవి పైనుదహరింపఁబడిన పద్యములోని సంఖ్యకు మిగిలినవి. అయినను యివి యన్నియు నీదేశములోనివే కావున నీతని పాలనముక్రింద యుండియుండును.)

గుంటుపల్లి భాస్కరుడు (విద్యలభాస్కరుడు).

ఈ ముత్తన మంత్రికుమారుఁడగు భాస్కరుడును దేశపాండ్యయగుటయేగాక మంత్రవిద్యలు నేర్చియుండెను. ఈతఁ డిప్పటికిని మృతజీవుఁడై యాత్మీయస్వచ్ఛయశశ్శరీరుఁడై మిగుల ఖ్యాతివహించి యున్నాడు. ఈ భాస్కరుని చరిత్ర మించుక యిట నుదహరించుట యవశ్యకము గాకపోదు.

భాస్కరుని మహిమ.

ఈతఁడు కొండవీటి కొండపైగల యొకానొక మునిచే నుపదేశమునొంది దేవ్యుపాసనచేసి తదనుగ్రహమున 64 విద్యలునేర్చి ప్రసిద్ధికెక్కెను. ఒకపరి యీతడు గోలకొండకుబోయి నవాబును దర్శించి

వారికోరికపై వారికిఁ దన యింద్రజాలవిద్యల జూపి మెప్పించెను. ఈతని విద్యలు కేవల వినోదార్థమై యుపయోగపడక ప్రజారక్షణోపయోగముగఁగూడ వినియోగపడుచువచ్చెనఁట. ఎట్లనిన, విభూతులు పెట్టుట, తాయెత్తులు బిళ్ళలు వేయుట, ప్రయోగములఁ ద్రిప్పుట మొదలగునవి చేయుచుండుటయేగాక, యొకవేపచెట్టును తనయింటికి ముంగిట మంత్రపూతముగఁ దెచ్చి నాటి దానియాకుచే నన్నివిధముల గు బాధలు మాన్పుచుండెడివాఁడట.

## వినుకొండ గుంటిఆంజనేయస్వామి.

వినుకొండపురమునఁ గొండక్రింద నొక పెద్దగుంటిపై నొక గొప్ప ప్రపత్త్యాంజనేయవిగ్రహమును తన మంత్రప్రభావమువలనఁ బ్రతిష్ఠించి యా దేవునిచే ఢిల్లికిని తనకును టప్పాలు నడిపించుచువచ్చెనఁట. అందువలన "హర్కారాంజనేయు"లనియు, "టప్పాలాంజనేయు"లనియు, గుండుపైనుండుటచే "గుంటిఆంజనేయు"లనియు నీ వినుకొండ ఆంజనేయస్వామి పిలువబడుచున్నాఁడు. ఈ విగ్రహ మిప్పటికిని సుప్రథితమై పై నుదహరించిన నామములతోఁ బేర్కొనబడుచున్నది. ఇచ్చట ననేకులు ప్రదక్షిణాదులుసేయుచు మనోభీష్టముల నొందుచున్నారు. ఈ స్వామియొద్ద భాస్కరునిచే వేయబడిన వేపచెట్టిప్పటికిని గలదు. ఈ స్వామికి 1860 సం॥ ప్రాంతమున వినుకొండలో తహశీల్దారుగనుండిన ఋష్యాశ్రసంభూతుఁడగు మధ్వ శ్రీ సింగిరిము కృష్ణరావు పంతులుగారు హోమతర్పణాదులచే గొప్ప తపస్సుధారపోసి యెక్కుడు ప్రభావము కల్గఁజేసిరి. 1900 సం॥న శ్రీ వల్లూరు గోపాలకృష్ణయ్యగారు (గుంటూరు) యితరుల సహాయమున స్వామియొద్ద సత్తురేకులతో గొప్ప కొట్టములు కట్టించిరి.

భాస్కరుని వినోదముల విషయము లనేకము లుండెను. కాని గ్రంథవిస్తరభీతిని వదలితిమి. ఈ విషయము లన్నియు నీ వంశజులును, కీర్తిశేషులును నగు గుంటుపల్లి సోమయ్యగారు ప్రచురించిన "గుంటుపల్లి ముత్తనామాత్య చరిత్ర" యందు విపులముగ వ్రాయబడినవి.



ఈ విద్యలన్నియు విప్రవినోదు లీతనివలన గ్రహించి జనులకు చూపుచు యాచించుకొనుచున్నారు. ప్రప్రథమమున వారు గురువగు భాస్కరుని "గుంటుపల్లిభాస్కరా" అని స్తుతింపుదురు. అందువలన నన్ని దేశములందున నాబాలగోపాల మీతనిపేరు సుప్రసిద్ధముగఁ దెలియుచున్నది.

## గుంటుపల్లివారి వంశవృక్షము.

భాస్కరులనుగూర్చి చరిత్రకారులకుఁ గలుగుచుండిన భేదాభిప్రాయములఁ దొలగించుటకై రాయనభాస్కరుని వంశవృక్షము ప్రకటింపఁబడినది. కాని తన్నామధేయులలో గుంటుపల్లి భాస్కరుడుగూడ చేరియుండుటచే నితని వంశవృక్షమునుగూడ నిందు వెల్లడించుచున్నాను.

(ఈ గుంటుపల్లి వారియొక్కయు, భాస్కరుని వారియొక్కయు వంశవృక్షము లిప్పటివరకునుగల పేర్లన్నియు సోమయ్యగారిచేఁ బ్రకటింపఁబడినవిగాని యిందనవసరములగుటచే విడువబడినవి. ఈ వివరముల దెలుపు కాగితములన్నియు చెన్నుపల్లిలో బ్రా॥శ్రీ గుంటుపల్లి పేరయ్యగారియొద్దఁ బదిలపరుపబడియున్నవి.)

## జూపల్లి రంగపతిరావును, వారి ధర్మములును.

ముకుటీఖానునిపిమ్మట జూపల్లి రంగారావుగారి కుమారుఁడు రంగపతిరావు కొండపీటికి అమీనుగావచ్చి శా॥ ౧౫౩౮-౧౫౪౦ (క్రీ 1616-1618) వరకు 3 యేండ్లు పాలించెను. ఈతనికాలమున జరిగిన ధర్మములు కొన్ని తెలియవచ్చుచున్నవి

## రంగపతిరావు ప్రతిష్ఠలు.

ఇతఁడు కొండవీటికి నైఋతిభాగమున నాదెండ్లత్రోవలోనుండు శ్రీరంగనాయకుల జయవిజయ విగ్రహములను తీసికొనిపోయి తాను వేరుగ నాలయముఁగట్టించి శ్రీరంగనాయకులఁ బ్రతిష్ఠించెను. ఇప్పుడీ

దేవాలయము రూపుమాసియున్నది. కాని విగ్రహము నిటీవల సాలస లోని యాలయమున ప్రతిష్టించిరని తెలియుచున్నది. మఱియుఁ దాఁ గట్టించిన దేవాలయముకడ నితఁడు శ్రీరంగనగరమను పేట గట్టించి రామేశ్వరస్థంభములనుపేరఁ గొన్ని స్థంభములు నిల్పెను.

## మిరియాలబురుజు నిర్మాణము.

కొండపై దుర్గమునకు వాయవ్యభాగమున నొక యెత్తగుచట్టుపై బురుజుగట్టించి యచట మందుగుండు సామానులుంచునట్లు యేర్పరచి దానికి మిరియాలబురుజని పేరుపెట్టెను. ఇది యిప్పటికిని నేత్రానందము గలిగించుచున్నది. ఈ బురుజుపైనెక్కి చూడ సర్సరావుపేట కోటలోఁగల మేడలగుపడును.

## రంగపతిరావు ధర్మములు.

ఈతఁడొకపరి కృష్ణానదికి స్నానమునకుఁబోగా నచట వల్లభాపుర బ్రాహ్మణులువచ్చి జొన్నబియ్యము నక్షతలుజేసి యాశీర్వదించిరి. అత డచ్చెరువొంది వరిబియ్యము లేవా? యని యడుగ మాయూర వరి పండుభూమి లేదు వైశ్వదేవమునకుఁగూడ యివియే యుపయోగింతుమనిరి. మీ గ్రామ పొలిమేరను వరిపైరుపండెడి పొలమే యూరఁ గలదని యడుగ "ఈమని" గ్రామము గలదనిరి. అతడు కరుణించి ఈమని పొలములో తూములు (౭౫) డెబ్బదియైదు విడదీసి వల్లభాపురముక్రిందఁ గలిపి వీరికిచ్చెను.

మఱియు శా॥ ౧౫౩౩ సాధారణ సం॥ న శ్రీమంగళగిరి నృసింహస్వామివారిసేవ సేయుటకు మాచ పద్మసానియను భోగస్త్రీకి పడమటిగుడిపూడి పొలమును 30 తూముల భూమి నిచ్చెను. "గుడిపూడి పొలమును ప్రభువు చూపగా అబ్బూరికరణము కొండయ్య అనునతఁడు తుమ్మపూడిలో నిచ్చెనని ఒట్టు వేసెను. గనుక ఆ పొలము పద్మసానికి నడిచినది కాదు" అని దండకవిలెయందు వ్రాయఁబడినది.



## మహమ్మదీయపాలనాంత్యభాగము.

(1) హైదరాబాదుసింహాసనమునకు నవాబు ముబారత్ ఖాను బహదర్ వచ్చి కొండవీటిసీమయందుఁ గల జమీందారుల నందఱిని బిలువనంపి జమీగ్రామములనుఁ బంచిపెట్టి కొండవీటిసర్కారునకు సావరాలు రుసుములు చెల్లింపుచుండేలాగునఁ గట్టుబాటు చేసెను.

(2) పిమ్మట నిజామల్ముల్కు బహదురు నవాబుగా వచ్చిరి. యీసీమకు 1. ఖజ్జాబహదరుల్లా. 2 మోతర్ ఖానుడు. 3 బాలకృష్ణుడు మొదలగువారిని అమీనులుగా నంపిరి. వీరి కాలనిర్ణయములుగాని వీరి కాలమున జరిగిన విశేషములుకాని తెలియరావు. అయినను వీరి కాలము దాదాపు శా॥ ౧౫౪౧ మొదలు ౧౬౭౧ (క్రీ॥ 1619.1749) వరకు నూటముప్పది సం॥లు జరిగినదని చెప్పవలసియుండును.

---

## పదియవ ప్రకరణము.

---

### (ఫరాసు) ఫ్రెంచివారి రాకడ.

ఇట్లుండ హైదరాబాదుసింహాసనమునకు సాహెబ్ దాదాబహదుర్ వారు ప్రభువై వచ్చి పాలించుచుండిరి. ఈ కాలమున ఫరాసు (ఫ్రెంచి) వారు హిందుదేశముఁ బ్రవేసించి కొన్ని కొన్ని ప్రదేశములను సంపాదించి కొన్ని పట్టణములందు వర్తకసంఘములను స్థాపించి వ్యాపారములు సేయుచు నదివరకు బాలించుచుండిన రాజుల మైత్రి సంపాదించుచుఁ గాలముఁ గడుపుచుండిరి. ఇట్లుండి ఫరాసువారు గోల్కొండ నవాబుకుమారుడగు నాజర్ జంగుబహదర్ రాజ్యమునకు రాగా నతనిచే నే కారణముననో శా॥ ౧౬౭౨ (క్రీ 1750) (స్న ౧౧౬౦ ఫసలీ) యందు కొండవీటిరాష్ట్రమును బహుమతిగాఁ గైకొనిరి. పిదప గుంటూరునం దొక (పాతగుంటూరు) కోటఁగట్టి కొండవీటినుండి యిచ్చటికి రాజధానిని మార్చుకొని శా॥ ౧౬౭౨-౧౬౭౯ (క్రీ 1750-1757) వరకుఁ బాలించిరి. క్రీ 1752 సం॥ నవంబర్ నెలలో సాలావర్ జంగ్ ఫ్రెంచివారి కీ కొండవీటిరాజ్యము నిచ్చెనని కృష్ణాడిస్ట్రిక్టు మ్యాన్యూయలునందు వ్రాయఁబడినది.

ఫ్రెంచివారి పాలనకాలమునందలి విశేషము లేవియుఁ గానరావు.

### కొండవీటిసీమ మరల మహమ్మదీయులకు వచ్చుట.

అటుపిమ్మట నీ సీమ మరల నిజాముగారికి వశపఱుపఁబడి క్రీ 1708 సం॥ వరకు వారిచేఁ బాలింపఁబడినది. ఈ కాలమున నవాబు నాజర్ జంగు తమ్ముడు నిజామల్లీఖానుడు కొండవీటికి రజావేగుఖానుని జిల్లేదారుగాఁ బంపెను. అది మొదలుగ నిచ్చటికి వచ్చినవారి యధికారమునకు జిల్లేదారు అని పేరువచ్చెను.

ఈ యధికారమున రజావేగుఖాన్ వెనుక. 1 మనుషుడుజంగ్ 2 యతిదావుత్ ఖాఁ అనువారు వచ్చిరి. అటుపిమ్మట నవాబు బసాలత్



జంగుగారు తమ దివానగు రాజాబలవంతు ఇంద్రభేత్తుగారిని మూడు దుర్గముల కధిపత్యముతోడను, సయ్యాదుఫత్తుల్లాఖానుని జిల్లేదారు అధికారముతోను బంపిరి. తరువాత ముశలారిముష్టిఫీలుముగేదాదావారు గోల్కొండసింహాసన మెక్కి యీ సీమకుఁ దమ దివానగు పెల్లూరి రామయ్యగారి నీ రాజ్యపాలకునిగ నంపిరి. ఇతఁడు కొంత కాలము పాలించిన పిమ్మట నీ క్రిందఁ జెప్పబడినవారు పాలకులు (అమీనులుగ) వచ్చిరి.

అసదుల్లాఖాఁ, తౌతద్దీఖాఁ, ధీవర్సు, దారా, సయ్యాదుపత్తుల్లాఖాఁ, నటఫర్ జంగు, యక్లసుఖాఁ.

వీరిపాలనము శా॥ ౧౬౮౦-౧౭౦౮ (క్రీ 1758-1786) వరకు జరిగెను.

### కొండవీటిసీమ ఇంగ్లీషువారికి వచ్చుట.

అంతట హైదరాబాదునవాబు వలన శా॥ ౧౭౦౯ క్రీ 1788 సం॥ సెప్టెంబరు నెలలో నీ సీమ యంతయు ఈస్టిండియా కంపెనీ వారికి (ఇంగ్లీషువారికి) యీయఁబడెను.

వీరు రాష్ట్రమును స్వాధీనముఁ జేసికొని దీనికిమాత్రముగాక నితర భాగములకును పాలకులై దేశ మంతయు జిల్లాలనియు, తాలూకాలనియు భాగముల నేర్పరిచి జిల్లాకలెక్టరు అను పేర నొక గొప్ప యుద్యోగస్థుని నియమించి బహువిధచట్టముల నేర్పరచి చిరవైభవము లుప్పతిల్లఁ బాలించుచు వచ్చిరి. వీరీ కొండవీటి నొక జిల్లాగా నేర్పరచిరి. కొంతకాలము గడచినపిమ్మట కొండవీటినుండి జిల్లా (మండల కార్యస్థానము) గుంటూరునకు మార్చి కొండవీటి నొక తాలూకాగా నేర్పరచిరి. కాలక్రమమున నిది తాలూకాస్థానమునుగూడ గోల్పడి గ్రామముగ మార్చబడినది. క్రమక్రమమున నిది క్షీణదశకువచ్చి పట్టణ మంతయు క్షీణించి పల్లెగా మారినది. రాను రాను యింకను క్షీణదశ నొందుచున్నది.

---

## సమాప్తి.

ఈ గ్రంథమునందు వివరింపబడిన విషయములను బట్టి కొండవీటినగర పురాతనప్రాశస్త్యము కొంతయైనను పాఠకుల కెఱుకపడవచ్చును. మనకు దెలిసినంతవఱకీ కొండవీటి సామ్రాజ్యము పదియవ శతాబ్దిని ప్రారంభమై పదునెనిమిదవ శతాబ్దాంతములో నస్తమించినది. గజపతులు, కాకతీయులు, రెడ్లు, విజయనగర ప్రభువులు, తురుష్కులు, మున్నగు నైదు రాజవంశములచేఁ బరిపాలింపఁబడిన యీ కొండవీటినగరము—కత్తులబావి మొదలగు నమానుషకృత్యముల గాథలకు మూలస్థానమగు నీ కొండవీటినగరము రామయభాస్కరుఁడాదియగు ప్రధానులయొక్కయు, శ్రీనాథాది మహాకవులయొక్కయు, సంస్తుతిభాజనంబైన యీ కొండవీటినగరము, నేడు తన వైభవము నంతయును గాలప్రవాహవేగమునఁ గోల్పడి, జీర్ణసౌధవిభిన్నదేవాలయద్వార, గాఢధ్వాంతాలవాలపర్వతగుహా, ముఖంబుల "హా" రని విలపించుచున్నదియుఁబోలె చెన్ను దొఱంగి యున్నది. అచటి కోటలు, పేటలు, వాడలు, మేడలు, భవనములు, దేవాలయములు, కూపములు, తటాకములు కొన్ని నామావశేషములైనను నింకఁ గొన్ని యందందు నిలిచి నేటికి నానాటివైభవము జూపుచు స్మృతిపథంబునకు దెచ్చుచున్నవి. అచటి పురాతనపుకట్టడముల చిహ్నములును లోకోత్తరప్రకృతిసౌందర్య ప్రకటనాభాజనంబులగు నచటి పర్వతసానుప్రదేశములును, అచటి నిర్మలవారిపూరసంశోభిత విశాలజలాశయంబులును యిప్పటికి ననేకులగు యాత్రికుల నాకర్షించుచు దర్శనీయతమములై, విలసిల్లుచున్నవి.

పాఠకోత్తమా! నేత్రానందసంధాయకంబు పురాతనాంధ్రరాజ్యలక్ష్మీముఖకమలతిలకంబు — గోపీనాథాదిక మహాదేవాయతనభాసితంబునగు నీ కొండవీటినగరము నొక్కపరి దర్శింపుము. శైత్య, మాంద్య, సౌరభ్యగుణంబులఁ దనరి వీచుచుండు చల్లగాలి కచటి విశాలపర్వతసానుతలంబుల విశ్రమింపుము. అకారణబంధులై వాయుసంచలితశాఖాకరంబుల "రా ర" మ్మని పిలుచుచు పరిపక్వఫలంబుల నుపాయనమిచ్చు నచటి వనస్పతుల మధురఫలంబులఁ దృప్తిఁ దీర భుజింపుము. పూర్వరాజన్యప్రతిష్ఠితంబు లాంధ్రలక్ష్మీనిక్షిప్త విమలదర్పణంబుల డాబునమనోహర నిర్మలసలిలపూరంబులఁ గన్పట్టు నా కొండ మధ్యభాగములందలి జలాశయంబులలోని తీయనినీటి నొక గ్రుక్కెఁడేనియుఁ బుచ్చుకొనుము.

కొండపైనుండి దిగువ గన్పట్టు కొండవీటి నేటి చిహ్నములను కన్నులారగాంచి, దాని పురాతనవిభవంబు నొక్కసారి నీ మనోవీథినిఁ దలంపుము. నాటికిని నేటికిని గల తారతమ్యముల విమర్శించినపుడు నీహృద్వీథిఁబుట్టు భావపరిణామావస్థ నీవణ్మాత్ర మనుభవింపుము. కొండవీటి రాజ్యపాలకమహానాటకరంగమున నటించి లోకాంతరమున విశ్రమింపఁజనిన యశశ్శరీరులగు నానాటి మహారాజుల, మంత్రుల, కవుల, వీరుల, ఘనత నొకించుక గీర్తించుము. ఆంధ్రుఁడనను నీకిది విధాయకకృత్యమని తలంచుము.

---

# అనుబంధము.

## కరిణీక మిరాశీలనిర్ణయవృత్తాంతము

శా॥ ౧౦౬౭ రక్తాక్షి భాద్రపద బ 30 అంగారకవారమున గోపరాజు రామమంత్రి బ్రాహ్మణులకు, కరిణీకము లుద్ధరించినట్లు గణపతిదేవుని చారిత్రమున వ్రాయఁబడినది. ఈ మిరాశీలు బ్రాహ్మణులందరికిని పలుశాఖలవారి కీయబడినవి.

ఇందు కొందఱికి సీమపెత్తనము లీయబడినవి. "సీమ" అనగా కొన్ని గ్రామములపైని పరగ్రామముగా నుండు స్థలము. అట్టి సీమలకు కొందఱి నధికారులుగా నుంచి కలతలు తీర్చుచు యోగక్షేమములు విచారించుచుండుటకు నిర్ణయించెను. ఈ రెండు విషయములును దీనియందు వ్రాయబడినవి. ఈ సీమషెత్తనదార్లకు వేతననిర్ణయ మేమియో దెలియరాదు. మిరాశీల నిచ్చినవారి యింటిపేర్లును, గోత్రములును, నాడులును వారి కీయఁబడిన భూజీవనమును, ఆ యా మిరాశీదార్లు తమ యిచ్చవచ్చినట్లు జరిగించిన దానవిక్రయములును, మొదలగు విశేషాంశములతో గ్రామముల పట్టికయందు చేర్చబడినది. దొరకినంతవరకు గ్రామముల పేర్లు మొదలగునవి సంపాదించి వ్రాయబడినవి. భూజీవనముల పరిమితిని ఖండలీలను సంజ్ఞతో వ్రాయబడినవి. వీని వివరణము "పూర్వపు భూమికొలతలు" అను విషయమునఁ జూడనగును. ఈ భూజీవనపరిమితిసంఖ్యలు, గ్రామ మొత్తమువిస్తీర్ణములుగాని వారికిచ్చినవి కావని కొందఱి యభిప్రాయము. బహుకాలముననిర్ణయింపబడిన సంఖ్యను కాలక్రమమున వ్రాయబడుటచేఁ గొన్ని కొన్ని వ్రాతతప్పు లుండి యుండును. కావున నెట్లు చెప్పుటకును వీలుపడదు. ఈ పట్టిక అక్షరసంజ్ఞను వ్రాయబడినది. గ్రామముల పేర్లకు ముందుగల పెద్ద, చిన్న, అని సంజ్ఞగలవాటిని దిశలపేర్లు మొదల గలిగినవాటిని తప్ప తక్కిన గ్రామములపేర్లు ఆయా మొదటి యక్షరముల వరుసనే వ్రాయబడినవి.



ఈ పట్టికయందుఁ గల వివరము లన్నియు. నాయా గ్రామ చరిత్రములు ఆయా వంశజుల పూర్వ వృత్తాంతములు సంగ్రహముగ దెలుపనుద్దేశింప బడినవి. కాని వ్యావహారికోపయోగమునకుఁగాదు.

## నాడుభేదములు.

ఆంధ్రదేశమునఁగల బ్రాహ్మణు లందుఁ బలుశాఖలు నాడులు గనుపట్టుచున్నవి. ఈ శాఖలు వేదములవలనను నాడులు వారివారి దేశములవలనను వచ్చినవి. వీ రందరును భోజనమునకు మాత్ర మేకీభవింతురు కాని సంబంధబాంధవ్యముల కేకీభవింపరు.

ఈ నాడుల వివరణము తెలిసినంతవర కీ క్రింద వ్రాయఁబడినది.

వెలనాడు.—కొండపీటి బెల్లంకొండ వినుకొండసీమల ప్రాంతములందు గల యాంధ్రదేశము. దీనికి చందోలు ముఖ్యపట్టణము. ధనపురి (చందోలు) ముఖ్యపట్టణమని ఆంధ్రులచరిత్ర 2 వ భాగమున వ్రాసిరి.

తెలగనాడు.—(తెలగాణ్యము) (త్రిలింగదేశము) నిజాము రాజ్యమున దక్షిణభాగము మొదలగునది.

వేగినాడు.—రాజమహేంద్రవరము మొదలు తూర్పుదేశము (రాజనరేంద్రపాలితదేశము).

(ఉలికి) ములిగినాడు.—శ్రీగలము (కడపజిల్లా జమ్మలమడుగు) మొదలు జంబుకేశ్వరము లేక మధ్యార్జునము (కుంభకోణము) ప్రాంతదేశము మఱియు "ములుక్‌నాడు" అనగా (ములుకులు) మహమ్మదీయ ప్రభుపాలితదేశమని చెప్పుచున్నారు.

బడుగులనాడు.—(కన్నడీలు) రత్నగిరి మొదలు కట్టుపుసీమ.

కాసలనాడు.—బెంగుళూరుయొద్దగల బేలూరు మొదలు నగరసీమ. (కార్వేటినగరము)

పాకనాడు.—నెల్లూరు అద్దంకి మధ్యసీమ.

నందవరీకులు.—కడపజిల్లా నందవరము కాపురస్థులు.

శిరనాడు.—శిర్పిసీమ.

కమ్మనాడు.—గుంటూరుజిల్లా కొణిదెన (కొట్యదొన) ముఖ్య పట్టణముగాఁగల సీమ. కమ్మరాష్ట్రమునం దిరువదియొక్క వేయి గ్రామము లుండెనని శాసనములవలనఁ దెలియుచున్నది.

పల్లినాడు.—గుంటూరుజిల్లాలోని పల్నాడుతాలూకాప్రదేశము.

పెసరవాయి.—ఇది దేశనామముగాక శాఖానామమయినట్లు గనుపట్టుచు విశదముగ తెలియరాదు.

ఆఱువేలనాడు.—(షట్సహస్రమండలము). ఇది గుంటూరు మండలములోనిది.

ఈ కరిణీకము లిచ్చునాటికి బ్రాహ్మణులలో నియోగవైదిక భేదము పాటించుటలేదు. కరిణీకము లీయబడినపిదప వృత్తిభేదముల వలన నొక గోత్రులు నొక కుటుంబమువారైనను భేదములు కలిగి కాలక్రమమున సంబంధ బాంధవ్యములు సైతము మాని వేరు శాఖలవారుగా మారి "నియోగ" "వైదిక" నామధేయములచే వ్యవహరింపఁబడుచున్నారు. అని దండకవిలెలో వ్రాయఁబడినది. ఇందుకు నిదర్శనముగా నొకటే గోత్రము నొకటే యింటిపేరును గలవారు నియోగవైదికులందు గనుపట్టుచున్నారు. కరిణీకములపట్టికయందు "వెలనాడు" "తెలగాణ్యులు" అని పూర్వపు వాడుకనుబట్టి కవిలెయందు వ్రాయబడినవి కాని ఆ భేద మిప్పుడు వ్యవహరింపబడకపోవుటచే తెలిసికొనుట దుర్లభము. వెలనాడు తెలగాణ్యులు పాకనాటి నియోగు లందరును సాధారణముగా నాఱువేలనియోగులుగనే చెప్పబడుచున్నారు కరిణీకములపట్టికయం దీ నాడుల పేర్లు వచ్చినప్పుడు వైదికశాఖలని చదువరులకు భ్రమ కలుగకుండునటుల నియోగపదము వ్రాయబడినది

## సీమపెత్తనములు.

గోపరాజు రామమంత్రి కొండవీటిదేశములోని పదునాల్గు సీమలకు సీమపెత్తనదార్లను నిర్ణయించెను.

1 అద్దంకిసీమ } వెలనాడు నీలంరాజువారు సంప్రతి 1
2 అమ్మనబ్రోలు } పోలంరాజువారు ,, 1



దామరాజువారు ,, 1
అద్దంకివారు ,, 1

3 కందుకూరుసీమ.—కరణకమ్మలు అక్కరాజువారు 1
ముత్తరాజువారు 1

4 నెల్లూరుసీమ—కరణకమ్మలు అక్కరాజువారు 1
ముత్తరాజువారు 1
తెలగాణ్యులు శ్రీవత్సస గోత్రులు
ఆదిరాజువారు 1

5 ఉదయగిరిసీమ } అక్కరాజువారు 1
6 చుండిసీమ } ముత్తరాజువారు 1

7 పొదిలెసీమ—వెలనాడు పోలంరాజువారు 1

8 మార్కాపురసీమ—వెలనాడు ధూళిపాళవారు 1
బచ్చలివారు 1

9 కోటసీమ—వెలనాడు తురుమెళ్లవారు 1 *
కాశింరాజువారు 1

10 దూపాటిసీమ—కరణకమ్మలు కుంచాలవారు 1
వెలనాడు అన్నంరాజువారు 1

11 నాగార్జునకొండసీమ—
1. మాచెర్లసముతుకు. వెలనాడు కందుకూరువారు 1
ప్రథములు సూరపరాజువారు 1
2. కారెంపూడిసముతు } కందుకూరువారు 1
3. తుమ్మకోటసముతు }
4. గురిజాలసముతుకు. వెలనాడు } దుగ్గరాజువారు 1
హారితసగోత్రులు }
5. తంగెడసముతు. వెలనాడు హారితసగోత్రులు
తుమ్మలచెరువువారు 1

| | | |
|---|---|---|
| 12 బెల్లంకొండసీమ— | ప్రథములు. బెహరావారు | 1 |
| | కరణకమ్మలు బెల్లంకొండవారు | 1 |
| | వెలనాడు శ్రీగిరిరాజువారు | 1 |
| 13 వినుకొండసీమ— | నందవరీకులు గుంటుపల్లివారు | 1 |
| | రాయనవారు (భాస్కరునివారు) | 1 |
| 14 కొండవీటిసీమ— | (హవేలీకి) తెలగాణ్యులు సంపుటంవారు | 1 |

(ప్రస్తుతనామము కొండవారు).

(వెలనాటిసంప్రతి ౧ ప్రథములసంప్రతి ౧ "వెలనాటి సంప్రతి వాడు కౌండిన్యగోత్రుడు గుఱ్రం బలభద్రుడు గజపతివారి యేలుబడిలో "పాత్రుడ"ను బిరుదు నొంది రెండవసంప్రతి మృతనష్టముకాగా బలభద్రపాత్రు డొకడే యేకభోగముగా నేలెను." అని పేపఱ్రుకరణముగారి ప్రతియందు గలదు).

## పూర్వపురాజు లిచ్చిన అగ్రహారముల విషయము.

పూర్వపురాజులు కొండవీటి హవేలిక్రింద యిచ్చిన అగ్రహారముల పట్టిక యొకటి దండకవిలెయందు వ్రాయబడినదికాని మాత్రకభిన్నములచే కలిగిన యిబ్బందివలన పలుచోట్ల పేర్లు మొదలగునవి వదలివేయబడినవి. కాన అవి యిందు వివరింప వలనుపడదు, పట్టిక చివరను యిట్లు వ్రాయఁబడినది.

"అంతు గ్రామాలు ౧౦౪ న్నూ క్షేత్రాలు ౪ న్నూ పాలెములు 3 ఖండ్రికలు ౧౦ మహమ్మదు ఖొల్లిపాదుషాసాహేబు * * ౧౬ న్ను ఖండ్రికలు ౨ న్ను గజపతిదత్తగ్రామాలు ౮౪౫౦ పాలెములు ౭. మాచిరెడ్డిచేసినది ౦౫౦ అంతు గ్రామాలు ౨౦౯౫౦ ఖండ్రికలు ౧౨ పాలెములు ౯ క్షేత్రాలు ౪ అంతు గ్రామాలు ౨౨౬౫ పాలెములు ౯."

---



| ప్ర॥ నా॥ | ప్రస్తుతనామము. |
|---|---|
| బా | బాపట్లతాలూకా |
| స | సత్తెనపల్లితాలూకా |
| న | నర్సారావుపేటతాలూకా |
| రే | రేపల్లెతాలూకా |
| తె | తెనాలి తాలూకా |
| బె | బెజవాడతాలూకా |
| గుం | గుంటూరుతాలూకా |
| వి | వినుకొండతాలూకా |
| మా | మార్కాపురంతాలూకా |
| వం | వంగోలుతాలూకా |

## ప ట్టి క సూ చి క.

(1) పట్టికయందలి గ్రామనామము లన్నియుఁ బ్రథమాక్షర సంజ్ఞక్రమమున నిందుఁ జేర్పఁబడినవి.

(2) "ఇ. ఉ. ఏ. ఓ."అను నక్షరము లాదియందుగల గ్రామములు వాటికిసంబంధించిన "య. వ."అను నక్షరములక్రిందఁ జేర్పఁబడినవి.

(3) "వెలనాడు" అనగా ఆర్వేల నియోగులను నర్థమున గ్రహింపనగు.

(4) "ప్రథమ" అనగా యాజ్ఞవల్క్య లనుభావము.

N. B. వివరము తెలియని చోట్ల ... ... నిట్లువిడువ బడినది.

# కరిణీక గ్రామముల పట్టిక

| గ్రామము. | కరణముపేరు లేక ఇంటిపేరు. | గోత్రము. | శాఖ లేక వాడు. | సంప్రతుల సంఖ్య. | గ్రామకట్టుబడి (ఎకరాలు) | వ. రా. | |
|---|---|---|---|---|---|---|---|
| అడుసుమల్లి (బా) | ప్రా॥ నా॥ అడుసుమల్లివారు తిక్కరాజు | కౌండిన్య | వెలనాడు (ఆర్వేల) | 1 | 75 | | ౨ |
| అత్తిలూరు (స) | ప్రా॥ నా॥ అత్తిలూరివారు | భారద్వాజ | పాకనాడు | 1 | 65 | | |
| అన్నవరం | ...... | శ్రీవత్స | వెలనాడు (ఆర్వేల) | 1 | | | |
| అన్నపర్రు (బా) | ప్రా॥ నా॥ అనపర్తివారు | శ్రీవత్స | వెలనాడు (ఆర్వేల) | 1 | 40 | దౌహిత్రులు శ్రీవత్సగోత్రులు విమ్మరాజువారికి యిచ్చిరి. దీనిని పద్మరాజు అనంతవర మందురు. | |
| అనంతవరం (స) | కవివారు | భారద్వాజ | వెలనాడు | 1 | 150 | | |
| అంబటిపూడి (స) | పసుమర్తివారు | డిటో | నందవరీకి | 1 | 80 | | |
| అంబటిపూడి (స) | గోపాలునివారు | భారద్వాజ | నందవరీకి | 1 | ... | | |
| అనంతవరం (పడమట) (గుం) | ...... | ... | ప్రథమ | 1 | 60 | | |
| అయినవోలు (గుం) | ...... | కాశ్యప | డిటో | 1 | 50 | | |
| అయ్యనవోలు (వి) | సోమశేఖరునివారు | భారద్వాజ | ఆర్వేల | 1 | ... | అయ్యన్న పేరటకట్టిరి గనుక యీపేరువచ్చెను. ఇచట మోచుకున్నని కోటగలదు. వీరితో సుకర్ణాదాయంవారు దౌహిత్రులు బొగ్గరము వారికిచ్చిరి. వీరు ముచ్చర్లవారికి వీ తి లు విక్రయించిరి. | |
| | ప్రా॥ నా॥ అయినవోలువారు సుకర్ణాదాయంవారు | కౌండిన్య | ఆర్వేల | 1 | 220 | | |
| అన్నవరం | గాదెరాజు రామరాజు | కాశ్యప | వెలనాడు | 1 | 40 | | |
| అగతవరం (అగతవరప్పాడు) | కాకానివారు | భారద్వాజ | వెలనాడు | 1 | 40 | | |
| అనుమర్లపూడి (గుం) | ప్రా॥ నా॥ అనమర్లపూడివారు | కౌండిన్య | డిటో | 1 | 120 | | |
| అనంతవరం | అన్నవరపువారు | శ్రీవత్స | ఆర్వేల | 1 | 75 | దీనికి తగాదాలు చాలా జరిగినవి. విజకొండ దండకవిలె చూడవగు. | ౩ |
| అయితానగరం (తె) | ...... | కాశక | నందవరీకి | 1 | 80 | | |
| అత్తోట (తె) | ప్రా॥ నా॥ అత్తోటవారు | భారద్వాజ | వెలనాడు | 1 | 80 | | |
| అనంతవరం (తె) | గాదెరాజువారు (రామరాజు) | కాశ్యప | వెలనాడు | 1 | 60 | | |
| అరవపల్లి (రే) | వడ్లమూడివారు | కౌండిన్య | డిటో | 1 | 40 | | |
| అరవల | ...... | భారద్వాజ | ... | 1 | 200 | | |
| అప్పికట్ల (బా) | మతుకుమల్లివారు | కౌండిన్య | వెలనాడు | 1 | 80 | | |
| అనంతవరం | గంధంవారు | కౌశికస | డిటో | 1 | 24 | | |
| అద్దేపల్లి (రే) | బందావారు | పరాశర | తెలగాణ్యం | 1 | 80 | | |
| అంగలకుదురు (తే) | బుస్సవరపువారు ...... | భారద్వాజ | నందవరీకి | 1 | ... | దౌహిత్రుడు గౌతమ గోత్రుడు పిసిపాటి మంచిరాజుకు యిచ్చిరి. | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అంగలూరు (వి) | భోగ్గరంవారు | భారద్వాజ | నందవరీకి | 1 | 65 | |
| అత్తిలూరు | అడిదంవారు | డిటో | పాకనాడు | 1 | 60 | |
| అత్తిలూరు | ధూళిపెట్టవారు | గౌతమ | వెలనాడు | 1 | 600 | |
| | కటుకూరివారు | కాశిక | డిటో | 1 | | |
| అమృతలూరు (తె) | పులిపాకవారు | హరితస | డిటో | 1 | 400 | పులిపాక కాళ్ళ వెంకన్న తన దొడ్డికాళ్ళ కుమార్తెకు పెండ్లికానందున పాంచాలపుర పు కరణం అల్లేడు గారి అడ్డగడ నల్లవెం కన్నకు యిచ్చి వివాహంచేసి పరకభాగం కరిణీకము యిచ్చెను. పిడప కాళ్ళ వెంకన్న రాన య్యలు తన భాగమును వీసముగ గెల చో॥ నైనల్ల వెంకన్నకు విక్రయించి దేశాం తరం పోయిరి. |
| | నారాయణివారు | భారద్వాజ | డిటో | 1 | | |
| | తిమ్మరాజువారు | మౌద్గల్య | బడగలనాటి కన్న డీలు | 1 | | |
| అలవాల (స) | సాగినారాయణప్ప | వశిష్ట | నందవరీకి | 1 | | పూర్వము గూడూరువారు కరిణా లుండిరని విను॥ దం॥ క॥ యందు వ్రాయబడినది. |
| అలవాల | మారేపల్లివారు | కాశ్యప | ప్రథములు | 1 | 60 | (నరిమొక ప్రతిలోనిది) |
| అగ్నిగుండాల (వి) | తిరువెంకళప్ప ప్ర॥ నా॥ అగ్నిగుండాలవారు | శ్రీవత్స | ఆరువేలనియోగి | 1 | | |
| అప్పాపురం | సంకా గురురాజు | కౌండిన్య | వెలనాడు | 1 | | |
| తూర్పుఅన్నవరం (శా) | పోలూరు నరిశములు | డిటో | డిటో | 1 | | |
| అప్పాపురం (శా) | బ్రహ్మాండం నాగరాజు | శ్రీవత్స | డిటో | 1 | | |
| అప్పాపురం | రేటూరి కరణములు | ... | ...... | | 150 | |
| అబ్బూరు (స) | శివదేవునివారు | శ్రీవత్స | పాకనాడు | 1 | 240 | |
| | అక్కిరాజువారు | సాంఖ్యాయన | కరణకమ్మలు | 1 | | |



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పల్లఅనంతవరం (స) | పరగటిచర్లవారు | కాశిక | ఆర్వేల | 1 | 50 | వేచిరాజుగ్రామం |
| | బొడ్డుచర్లవారు | విశ్వామిత్ర | నందవరీకి | 1 | | |
| అల్లూరు (శే) | కర్రి నర్సరాజు | భారద్వాజ | ప్రథమ | 1 | ... | |
| | యల్లాప్రగడ కృష్ణంరాజు | భారద్వాజ | వెలనాడు | 1 | ... | |
| అన్నవరపుపాడు | మాదిరాజువారు | ...... | ఆర్వేల | 1 | 12 | |
| | అక్కిరాజువారు | ...... | డిటో | 1 | | |
| | ముచ్చర్లవారు | ...... | డిటో | 1 | | |
| అమృతవరం (వి) | మాచిరాజువారు | కౌండిన్య | వెలనాడు | 1 | 40 | |
| అందుగులపాడు | అందుగులవారు | శ్రీవత్స | కరణకమ్మలు | 1 | 400 | శిస్తాలెనులు:- గోపినాథనిపాలెం, నాయుని పాలెం, కల్లూరిపాలెం. |
| వేట్రాయుని అప్పాపురం (వి) | జంధ్యాలవారు | ...... | ప్రథమ | 1 | ... | |
| అప్పాపురం | ...... | ...... | ...... | | ... | వేచిరాజు. వినుకొండలోనిది. |
| శానాఅన్నవరం | సోమశేఖరునివారు ప్ర॥ నా॥ అయినవోలువారు | భారద్వాజ | ఆర్వేల | 1 | 50 | |
| అన్నవరం (స) | మాదిరాజువారు | శాండిల్య | ప్రథమ | 1 | 80 | శ్రీరామువారి అన్నవరం- పూర్వము పొట్లగట్ల వారు, రెంటాలవారు, మాదిరాజువారు, మురారిదేవులవారు వుండిరి. |

## ఆ

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆకుదాలపల్లి (శే) | ప్రాసంవారు | ...... | ప్రథమ | | | |
| | రాపట్లవారు | కాశిప | వెలనాడు | | | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆముదాలపల్లి (రే) | శిఖరంవారు [శూద్రులు] | ...... | ......... | 1 | 40 | |
| | కేచిరాజువారు | కౌండిన్య | వెలనాడు | | | |
| | ఆముదాలపల్లివారు | భారద్వాజ | డిటో | | | |
| ఆకుమూరు | ...... | పరాశర | తెలగాణ్యం | 1 | 160 | |
| అడుమూడి | గాదెరాజువారు | కాశ్యప | వెల్నాడు | 1 | 300 | |
| ఆళ్ళమూడి [రే] | ...... | ఆత్రేయ | డిటో | 1 | 80 | |
| అలపాడు [తె] | అలపాటివారు | ...... | ప్రథమ | 1 | 80 | |
| ఆలపాడు | మోదుకూరి లచ్చిరాజు | వశిష్ఠ | నందవరికి | 1 | | |
| అలూరు [తె] | ......... | గౌతమ | తెలగాణ్యం. | 1 | 50 | |
| అరమాడ | ......... | జమదగ్ని | కరణకమ్మ | 1 | 60 | |
| అరుమ్బాక [రే] | కొండవారు | కౌశిక | వెల్నాడు | 1 | 80 | |
| అడుపల్లి | ......... | ...... | డిటో | 1 | ... | |
| అరిమండ [భా] | అరిమండ వెంకటరాజు | జమదగ్ని | కరణకమ్మ | 1 | 60 | |
| ఆరేపల్లి | ఘట్టువారు | కౌండిన్య | ప్రథమ | 1 | | |
| ఆరేపల్లి [న] | గోపాలునివారు | మౌద్గల్య | ఆర్వేల | 1 | 55 | |
| | | | క | | | |
| కొండవీడు [న] | సంపటంవారు శేష కొండా వారు | కౌశిక | వెల్నాడు | 1 | 400 | |
| | పట్టస్వామివారు | కౌండిన్య | ప్రథమ | 1 | | |
| కొప్పుఱ్ఱు [భా] | కొప్పర్తివారు | భారద్వాజ | వెల్నాడు | 1 | 150 | |
| | పుణ్యమూర్తివారు | కౌశిక | డిటో | 1 | | |



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కారుచోల [న] | కారుచోలవారు | కౌండిన్య భారద్వాజ | నందవరీక | 2 | 400 | |
| కొర్రపాడు [ప] | శివదేవునివారు | శ్రీవత్స | పాకనాడు | 1 | 380 | ఈమిరాశిదార్లు మంత్రయ్యగారు × ౨౦ లకు అమ్మిరి. |
| | కేతనవారు | కాశ్యప | ప్రథమ | 1 | | |
| కోడిపురం | ......... | హారితస | వెలనాడు | 1 | 50 | |
| కావూరు | ......... | కౌశిక | డిటో | 1 | 150 | |
| డిటో | కావూరి వెంకటవరదం | శ్రీవత్స | డిటో | 1 | | |
| కొమ్మూరు [భా] | గంగరాజువారు | లోహిత | తెలగాణ్యం | 1 | | |
| [ఇచ్చట తిమ్మర్సు కొడుకు లక్ష్మీకాంతర్సయ్య కేశవప్రతిష్ఠ చేసెను] | నాగరాజువారు | శ్రీవత్స | డిటో | 1 | 600 | |
| | కొమ్మరాజువారు | | | | | |
| | సోమనవారు | | | | | |
| కాకుమాను [భా] | కాకుమానువారు | పరాశర | వెలనాడు | 1 | 400 | |
| | | | పెసరకాయలు | | | |
| కొమిరపూడి [ప] | శివదేవునివారు | శ్రీవత్స | పాకనాడు | 1 | 200 | |
| | చంద్రశేఖరుడు | | | | | |
| కేసానుపల్లి [న] | ప్ర॥ నా॥ కేసానుపల్లివారు | కాశ్యప | వెలనాడు | 1 | 60 | |
| | చెంచు మల్లంరాజు | శ్రీవత్స | డిటో | 1 | | |
| కట్టెంపూడి [భా] | బల్లికురవవారు | కౌండిల్య | పాకనాడు | 1 | 80 | |
| కాశిపాడు [ప] | | గౌతమ | వెలనాడు | 1 | 60 | |
| కురునూతల [గుం] | ప్ర॥ నా॥ కురునూతలవారు | కాశ్యప | ప్రథమ | 1 | 60 | |
| కొర్నెపాడు [గుం] | ప్ర॥ నా॥ కొర్నెపాటివారు | గౌతమ | వెలనాడు | 1 | 80 | |
| కొంపల్లి | ...... | భారద్వాజ | ప్రథమ | 1 | 60 | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కొండెపాడు [గుం] | | శ్రీవత్స | ప్రథమ | 1 | 80 | |
| పెదకూరపాడు [స] | కూరపాటివారు | కౌండిన్య | వెలనాడు | 1 | 800 | |
| | | గౌతమ | నందవరీకి | 1 | | |
| | | శ్రీవత్స | | 1 | | |
| కస్తల [స] | ప్రౌ॥ నా॥ కస్తలవారు | కాశ్యప | వెలనాడు | 1 | 80 | |
| కోకంటిపాలెం [స] | ప్రౌ॥ నా॥ కోకంటపాలెంవా | కాశ్యప శ్రీక కౌండిన్య | ప్రథమ | 1 | 80 | |
| కంభంపాడు [స] | ......... | కాశ్యప | వెలనాడు | 1 | 240 | |
| కోసూరు [స] | గోపాలునివారు | భారద్వాజ | నందవరీకి | 1 | 100 | |
| కలగిరి | ఈశ్వరరాయునివారు | కణ్వస | తెలగాణ్యం | 1 | ... | |
| కుంటిమద్ది | పాటిబండ్లవారు | కౌశిక | వెలనాడు | 1 | ... | |
| కంటనంపాడు | ......... | ...... | ... | 1 | 40 | |
| కుంచనపల్లి [గుం] | మునిపల్లివారు | కణ్వస | వెలనాడు | 1 | 45 | |
| | కుంచనపల్లివారు | ...... | ప్రథమ | 1 | | |
| కొంపల్లి ఉత్తరం | ......... | కాశ్యప | డిటో | 1 | 40 | |
| కుంకలగుంట [న] | దమ్మవరంవారు | శ్రీవత్సస | నందవరీకి | 1 | 1000 | పూర్వమిరాశిదారులు వశిష్టగో॥ నందవరీకులు కుంకలగుంటవారుండి నశింపగా స్థలకరణాలు భాస్కరునివారు గుంటుపల్లివారు ఆక్రమించుకొని ఏదప దమ్మవరపు పెదనూరప్ప కుమారుడు వెంకటప్పకును యీరసన్న కుమారుడు పుల్లన్నకును యిచ్చిరి. వినుకొండ దండకవిలె చూడుము. |
| | చేజర్లవారు | డిటో | డిటో | 1 | | |

(౨)



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కంతేరు (గుం) | యద్దనపూడివారు | కౌండిన్య | వెలనాడు | 1 | 100 | యద్దనపూడి వెంకన్న, కౌండిన్య గో. రామకూరి రఘుపతిరాజుకు ౫౯౦ లకు విక్రయించెను. |
| ...... | ...... | భారద్వాజ | ... | 1 | ... | |
| కొప్పల్లి | ......... | డిటో | తెలగాణ్యం | 1 | 40 | |
| కన్నెకండ్ల (స) | కోదండరామరాజు | డిటో | ప్రథమ | 1 | ... | |
| పెదకోడిప్రరు. | అడిదమువారు | ఆత్రేయస | వెలనాడు | 1 | 240 | |
| కొల్లూరు (తె) | నాదెండ్లవారు | పరాశర | డిటో | 1 | 360 | వాడపల్లి అను వారిని వుంచిపోయిరి. |
| క్రాప (తె) | డిటో | డిటో | డిటో | 1 | 40 | |
| పెదకొండూరు (తె) | జోడపాటివారు | గౌతమ | డిటో | 1 | 360 | |
| కొత్తూరు (బె) | కొత్తూరివారు | భార్గవ | వెలనాడు | 1 | ... | |
| కొల్లిమెర్ల | లింగంపల్లివారు | భారద్వాజ | వెలనాడు | 1 | ... | |
| | ప్రభాకరుడు | మౌద్గల్యస | వెలనాడు | 1 | ... | |
| కొండకోడూరు | పిల్లలమర్రివారు | గౌతమ | డిటో | 1 | 80 | |
| కరివేడు (వం) | గౌతవాధునివారు | కౌశిక | డిటో | 1 | 800 | |
| కూచనపల్లి (వి) | బొగ్గరపువారు | భారద్వాజ | ఆర్వేల | 1 | 110 | విప్పర్లపల్లె అగ్రహారీకులు చతుర్వేదులవారు ముప్పాతిక మిరాశికొనిరి. వీరివద్ద వైదీకి భారతుల సుబ్బయ్య కొనెను॥ వి॥దం॥క॥ చూడుము. |
| కొరిటపాడు (గుం) | గుంటూరుమాడు | గౌతమ | డిటో | 1 | 100 | |
| కనుపుర్రి (రే) | యండపల్లిసాంబయ్య | పరాశర | ...... | 1 | ... | |
| కంతేరు (గుం) | ......... | గౌతమ | ప్రథమ | 1 | 40 | |
| కైతేపల్లి (రే) | ......... | గౌతమ | వెల్నాడు | 2 | 80 | |
| | ......... | కాశ్యప | ...... | ... | ... | |

